ఉషాకిరణ్ మూవీస్



# సుందరి సుబ్బారావు

నిర్మాత
రామోజీరావు

దర్శకత్వం
నరసింహారావు రే



# సుందరి-సుబ్బారావు

## (పాటలు)

హోటల్లో తిన్నదానికి బిల్లు కట్టకపోతే ఆ మనిషిచేత పప్పు రుబ్బించడమో, నీళ్ళు తోడించడమో లాటి చిల్లరపనులు అప్పగించి ఆ బాకీ చెల్లుచేసుకోడం ఎక్కడైనాజరిగేదే!అంతేగాని ప్రాణాంతక మైన పనులుచెప్పి చేస్తావా ఛస్తావాని అడిగి భయపెట్టడం ఎక్కడోగాని జరగదు.

సుబ్బారావుకి అల్లాంటి భయంకర మైన శిక్షే పడింది!

బాత్‌రూంలో మాత్రమే పాడుకునే అలవాటున్న సుబ్బారావుని ఆడపిల్లల ముందు నిలబెట్టి పాడమన్నాడు హోటల్ ప్రొప్రయిటరు. పాడలేక పారిపోదామను కుంటున్న సుబ్బారావు ఆడపిల్లల్లో తాను ప్రేమించిన సుందరిని చూసేడు. చూడ గానే భయం తొలిగి ప్రేమ ఉప్పొంగింది. ఆ ప్రేమే అతనిచేత పాడించింది.

పాడనా వేణువునై
నీవు నా ప్రాణమై
నా జీవన బృందావనిలో
ప్రియదర్శన రసమాధురిలో...

పాడుతున్న పాటే కాదు — అందుకు వాడిన పదాలు కూడా ప్రేమకు స్వర్ణాభి షేకం చేసేయంటే అది అతని గొప్ప కాదు. ప్రేమ తాలూకు రసరమ్య విన్యాసమది. ఆ పాటతో అతను అతని ప్రియురాలితో మనోహర ఊహావీధిలో విహరిస్తున్నాడు. అతని ప్రేమ గీతికకు ఆమె స్వరాలు పలుకుతోంది.

చెలీ సఖీ ప్రియే చారుశీలే అని
తలచి తనువు మరిచి కలలుకన్నానులే
కాముడిలా సుమబాణాలు వేసి
కదిలిన నీ చలికోణాలు మూసి
ఆమనిలా సుమగంధాలు పూసి
కవితలుగా నవవేదాలు రాసి

మోవికి తగిలే ముద్దుల మురళి
కౌగిళ్ళలో ప్రియకళ్యాణిలో
సంగీతమే పాడిందిలే...

పలికెడిది భాగవతమట. పలికించెడు వాడు రామభద్రుడుట అని అన్నాడో మహాభక్తుడు. ఈ ప్రేమికుడు ఇట్లా అంటున్నాడు—

కలం గళం స్వరం నాకు నువ్వేనని
మధుర ప్రణయ కవిత
పాడుకున్నానులే!

అంటూ అంతా భామ మయం.... జగమంతా భామమయమనే రీతిలో నడిచిన ఈ ప్రేమ పాట రాసినవారు వేటూరి. సుందరి-సుబ్బారావుల కోసం పాడినవారు యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, జానకి.

చలికాలంలో కుర్ర జంటను భస్తే నమ్మకూడదు. బుద్ధిగా వుంటారనే గ్యారంటీ అసలివ్వకూడదు. వాళ్ళు చెప్పే దొకటి, చేసేదొకటి. వెళ్లేది సినీమాకని చెప్పి దారి మార్చి ఉద్యానవనం వెతుక్కొని, అక్కడ వాళ్లకై వాళ్లే ఒక సినీమా వేసేసుకుని చూసేసుకున్నారు. పైగా వాతావరణమొకటి చలిచలిగా వుండి రెచ్చగొడ్తుంటే ఊరుకుంటారా? అందుకే సుబ్బారావు అన్నాడు—

అసలే చలికాలం
ముసిరే సాయంత్రం
ఇదే నీకు నా స్వాగతం
బిగికౌగిలే అంకితం!

అంతేకాదు — రెచ్చగొట్టే ఈ చలి సీజన్లో దేవుడికైనా చెలి సాయం తప్పని సరని సుబ్బారావు అన్నమాట పాటలో ఇలా ఒదిగింది—

దేవుడికైనా జీవుడికైనా
తప్పదులే చెలి సాయం!

సుబ్బారావు స్వాగతానికి సుందరి మురిసిపోయి, ముద్దబంతి పూవులా మారిపోయి, అతని కౌగిట చేరిపోయి అవునవునంటూ అతనన్న మాటే అతనికి అప్పగించింది. అప్పుడు—



అతను : నా ఊపిరే సోకి ఉయ్యాల
ఊగేటి
వయ్యారమా వందనాలు!
ఆమె : సిగమల్లెలో మంచు తగిలేక
శృతిమించు
శృంగారమా వందనాలు!
అతను : గడియ గడియకి గడియ
బిగిసినా
కౌగిళ్ళలో వుంటే చాలు!
ఆమె : ఈ పుష్య మాసాన పులకించి
పోయేటి
హేమంతమా వందనాలు!
అతను : హిమవర్షపాతాల గమకాలు
పలికేటి
ఓ అందమా వందనాలు!

చలికాలానికి వందనాలు చేసి తమకేమి కావాలో కోరుకున్న ప్రణయ జంటకి ఆతర్వాత ఏ వరాలు ఇవ్వబడ్డాయో ఆ వివరాలు కథలో దొరుకుతాయి. ఈ చలి పాట కూడా వేటూరి వారే రాసేరు. సుందరి - సుబ్బారావులు పాడే పాటని అందించినవారు యస్పీ బాలసుబ్రహ్మణ్యం, జానకి.

ప్రేమలో కూడా అప్పుడప్పుడు కోపాలొస్తుంటాయి. వెన్నలాటి ఆ చిన్న



కోపాలు చెప్పుకోడానికీ, చూడటానికి కూడా అందంగానే వుంటాయి. ఆ వరస కోపల్లె శివరాం రాసిన పాటలో ఈవిధంగా పల్లవిస్తుంది.

ఆమె : చిరుచిరు కోపం
చీకటి తాపం
శ్రీవారికి అలవాటు
శ్రీమతికే ఇది గ్రహపాటు

అతను : చెకుముకి రాయీ
వెన్నెల హాయీ
శ్రీమతికే ప్రతిరూపం
శ్రీవారికి ఒక శాపం

కురజంట పాడే ఈ పాటకి మరో పెద్ద జంట పరవశం చెంది, ఫ్లాష్ బేసులు తలుచుకుని శృంగారం పండించుకోడం ఆ పాట చేసిన పుణ్యమే మరి! ప్రేమ





పులకించటానికి ఒకరాగం చాలని శాస్త్రం! ఆ మాట నూటికి నూరుపాళ్ళా నిజమని సుందరి సుబ్బారావులు నిరూపించేరు. పాడినవారు బాలసుబ్రహ్మణ్యం, జానకి.

ఫలానా మనిషిని ప్రేమించు, ఫలానా వ్యక్తిని పెళ్ళాడు అని ఎవరో చెబితే ఆ ప్రకారం నడుచుకునేందుకు మనసు అంగీకరించకపోవచ్చు. మనసనే పదార్థానికి రూపురేఖలు లేకపోయినా అది వ్యతిరేకిస్తే కథ అడ్డం తిరుగుతుంది.

గజలక్ష్మి బర్త్‌డే పార్టీలో అదే జరిగింది. గజలక్ష్మిది పేరుకి తగ్గ రూపం. ఆ పిల్లను సుబ్బారావుకిచ్చి చేయాలనుకున్నారు పెద్దవాళ్ళు. ససేమిరా వీల్లేదని చెప్పటానికి మాటకంటే పాటకే పవరెక్కువని ఆ బర్త్‌డే పార్టీలో పాటందుకున్నాడు సుబ్బారావు—

ఘల్ ఘల్ గజలక్ష్మి—ఘనలక్ష్మి
హేపీ బర్త్‌డే టూయూ—
హేపీ బర్త్‌డే టూయూ!

పాట పాడుతూ ఊహలోకి వెళ్ళిపోయేడు. అనుకున్నట్టుగానే అడవిలో అతనికి గున్నఏనుగు ఎదురైంది. అయ్ లవ్ యూ అని తొండమెత్తింది—

గజగజలక్ష్మి గంభీరలక్ష్మి
తొండమెత్తకే తల్లీ
గడగడలక్ష్మి గండాల లక్ష్మి
నీకు దండమే తల్లీ

అంటూ చేతులు జోడించేసేడు. అక్కడికీ గజలక్ష్మి కనికరించకపోయినపుడు పూర్వగాథొకటి చెప్పేడు—

నీ మొరలే ఆలకించి ఆ హరియే
సాగివచ్చి
చక్రమే అడ్డువేసి కాపాడలేదా?
నా మనవే చిత్తగించి మనసార
ఘీంకరించి
ఏదైనా అడ్డుచెప్పి కాపాడలేవా?

వేటూరి — బాలసుబ్రహ్మణ్యం సహకారంతో సుబ్బారావు ఈ పాట పాడి గండంనుంచి బయటపడ్డాడు. ఆ గండం

తప్పినా మరికొన్ని గండాలు సుబ్బారావుతో చెడుగుడు ఆడుకున్నాయి. గండాల గారడీలో సుబ్బారావు అవస్థ పడుతుంటే—మరొక అమ్మడు అతనికి ధైర్యంచెప్పడానికి వేటూరి సాయంతో వెంటబడింది—

జావకారిపోకయ్యో సుబ్బారావో
సువ్ బావగారి వరసయ్యో సుబ్బారావో
పొద్దువాలిపోయేక ముద్దు రాలిపోయేక
చేసేది ఏముంది సుబ్బారావో

తన సొంత గొడవతోనే సతమత మవుతుంటే ఈ కొత్త వరసకి బెంబేలు పడిపోయిన సుబ్బారావు అంటాడూ —

పోజుమీద రాకమ్మో పోలేరమ్మో
నీ మోజులో పడ్డవాళ్లు పోలేరమ్మో
పిచ్చిముదిరిపోయేక ఉచ్చులోపడ్డాక
చచ్చినా నిన్నిడిచి పోలేరమ్మో

బాలసుబ్రహ్మణ్యం, శైలజ ఈ పాట పాడేరు. మళ్ళీ మళ్ళీ వినాలనిపించే పాటల పంచకంతోపాటు కడుపుబ్బ నవ్వించే సన్నివేశాలనేకం 'సుందరి — సుబ్బారావు' హాస్యవల్లరిలో ప్రత్యేకతలు. పాటలకు సత్యం సమకూర్చిన బాణీలు ఆణిముత్యాలు!

ఉషాకిరణ్ మూవీస్ అందించే ఈ నవ్వుల నయాగరాలో చంద్రమోహన్, నూతన్‌ప్రసాద్, వీరభద్రరావు, కాంతా రావు, సాక్షిరంగారావు, పి.జె.శర్మ, రావి కొండలరావు, పొట్టిప్రసాద్, వంకాయల, విజయశాంతి, రాజ్యలక్ష్మి, రమాప్రభ, లక్ష్మీచిత్ర, ఆనంది ముఖ్యపాత్రలు ధరించారు.

మూలకథ: జి. కృష్ణమూర్తి; చిత్రానువాదం, మాటలు: ఆదివిష్ణు; పాటలు: వేటూరి, కోపల్లె శివరాం; సంగీతం: సత్యం; ఛాయాగ్రహణం: కోటేశ్వరరావు; కళ: భాస్కరరాజు; కూర్పు: డి. రాజగోపాల్; ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: మిక్కిలినేని జగదీష్‌బాబు.

రామోజీరావు నిర్మించిన ఈ చిత్రానికి రేలంగి నరసింహారావు దర్శకత్వం వహించారు. విడుదల: మయూరి.


రేలంగి నరసింహారావు


ఆదోనిశ్రీనివాసరావు


సత్యం


బాలు


శైలజ

ముఖచిత్రం : ఎస్. శివన్నారాయణ

రెండవ కవరు : ఇ. రాజ్యలక్ష్మి

మూడవ కవరు : ఎల్. ఆర్. గ్రోవర్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# చతుర ప్రపంచం



## జింగ్ సెంగ్

ప్రస్తుతం అమెరికాలో "జింగ్ సెంగ్ వేళ్ళు" అనేవి వేడివేడి పకోడీల్లా అమ్ముడుపోతున్నాయి. ఈ వేళ్ళు చైనాలో పెరుగుతాయి. పాశ్చాత్యులు ఈ వేరును పళ్ళరసాల్లో, టీ, కాఫీ, తేనె, విస్కీ దేనితో వీలయితే దానిలో కలిపి సేవిస్తున్నారు. జింగ్ సెంగ్ పౌడర్ నింపిన కేప్సూల్స్ కూడా అమెరికన్ మార్కెట్లను ముంచెత్తుతున్నాయి.

ఇంతకీ ఇంతమంది ఎగబడి కొనడానికి ఈ జింగ్ సెంగ్ ప్రాముఖ్యత ఏమిటి అనిపిస్తుంది. ఇది ఇంపొటెన్సీ, మలేరియా, తలనొప్పి, కాన్సర్ వగైరా వగైరాలను నయంచేస్తుందన్న పేరు రావడమే దానికి కారణం. ఈ వేళ్ళు గత ఐదు వేల సంవత్సరాలుగా చైనాలో వాడుకలో ఉన్నాయి.

1948లో ఈ వేర్లను వారు కొందరు యువరష్యన్ సైనికులకు ఇవ్వగా వీటిని వాడిన సైనికులు చాలా చురుకుగా యుద్ధంలో పాల్గొన్నారట. అప్పటినుంచి యూరోపియన్లు ఈ జింగ్ సెంగ్ వేర్ల వెంటబడ్డారు. కేవలం గత ఒక్క సంవత్సరంలోనే యాంకీలు చైనానుంచి అరవై కోట్ల రూపాయల విలువ చేసే వేర్లను తీసుకొచ్చారంటే వీటి పేరుతో ఎంత భారీగా వ్యాపారం నడుస్తోందో ఊహించవచ్చు. ప్రముఖ శాస్త్రవేత్తలు ఈ జింగ్ సెంగ్ వేరుకున్న వైద్య ఉపయోగాలను కనుగొనే ప్రయత్నాల్లో వున్నా చైనా, కొరియా వైద్యులు మాత్రం ఈ వేర్లకు చాలా వైద్య ప్రయోజనాలున్నాయని గట్టిగా చెపుతున్నారు. ఈమధ్య జరిగిన వైద్య పరిశీలనల్లో ఈ వేరు విద్యార్థుల జ్ఞాపకశక్తిని పెంపొందిస్తుందని తేలిందట.

## స్టాంపుకోసం

పొరపాట్లు చేసి పరులకు కోట్లు సంపాదించి పెట్టేది బహుశా తపాలా శాఖ ఒక్కటేనేమో. తపాలాశాఖవారి పొరపాట్ల కథలు ఏదేశంలోనయినా కోకొల్లలు.

పూర్వం బ్రిటిష్ గయానా దేశపు స్టాంపులను బ్రిటిష్ ముద్రణ కర్తలు వాటర్‌లూ అండ్ సన్స్ వారు ముద్రించేవారు. కొన్నాళ్ళపాటు ఆ స్టాంపుల ముద్రణ సజావుగా సాగిపోయింది. 1856లో బ్రిటిష్ గయానా ట్రెజరీ వారు

తమ దగ్గిరున్న స్టాంపు నిల్వలు తరిగిపోయాయని గుర్తించారు. అప్పటికి వాటర్‌లూ అండ్ సన్స్ నుంచి కొత్త స్టాకు రాలేదు. అందుకని బ్రిటిష్ గుయానా ప్రభుత్వం స్టాంపులను స్థానికంగా ముద్రించాలని నిర్ణయించింది. ఈ స్టాంపులు పూర్వంలాగే కెంపు రంగు మీద నలుపు డిజైనుతో ముద్రించబడినాయి. అయితే వాటి నాణ్యత అంత బావుండలేదు. ప్రజలు వీటిని నకిలీ స్టాంపులు అనుకొనే ప్రమాదం వుంది గనుక తపాలా శాఖ అధికారులను వాటిమీద సంతకం చేసి విడుదల చేయమని ఉత్తర్వులిచ్చారు.

ఇది జరిగిన కొన్నేళ్ళ అనంతరం ఓ యువకుడు పాత వస్తువులను తవ్వితీస్తుండగా ఇ. టి వైట్ అనే సంతకం వున్న పాతకాలపు ఒక సెంట్ తపాలా బిళ్ళ కనిపించింది. ఇది 1856లో తపాలాబిళ్ళల కొరత ఏర్పడినపుడు ముద్రించబడిన స్టాంపుల్లో ఒకటి. యువకుడు ఆ తపాలా బిళ్ళను ఆరు షిల్లింగులు అంటే సుమారు ఆరు రూపాయలకు అమ్మేశాడు. తర్వాత లివర్‌పూల్‌కి చెందిన థామస్ రీడ్ దాన్ని 129 పౌన్లకు కొన్నాడు. అలా అది అనేక చేతులు మారి చివరగా 1922లో 7,343 పౌన్లకి అమెరికాలోని ఆర్థర్ హిండ్‌కి చేరింది.

1928లో ఓ అమెరికన్ యువకుడు హిండ్ వద్దకు వచ్చి "నేను చాలాదూరం నుంచి మిమ్మల్ని కలవడానికి వచ్చాను. నా దగ్గిర బ్రిటిష్ గుయానా దేశపు స్టాంపు వుంది. దాన్ని అమ్ముదామనుకుంటున్నాను. మీరు కొంటారేమోనని వచ్చాను" అన్నాడు. హిండ్ స్టాంపును



తీసుకొని చూశాడు. అది 1856లో అవసరం కోసం ప్రచురించిన స్టాంపే. అప్పట్లో అవసరం తీరిపోయాక ఆ స్టాంపులన్నింటినీ కాల్చేశారు. కాని ఎలాగో ఒకటి రెండు మిగిలిపోయాయి. అలా మిగిలిన వాటిలో ఇది ఒకటి అని గ్రహించాడు హిండ్. లోపలికి వెళ్ళి తన అరుదైన స్టాంపుల ఆల్బమ్ తీసి తనదగ్గిరున్న స్టాంపుతో పోల్చి చూశాడు. శక్తివంతమైన భూతద్దంతో క్షుణ్ణంగా పరిశీలించాడు. రెండూ ఒకేలా వున్నాయి.

"ఎంతకి అమ్ముతావు స్టాంపుని" అని యువకుడిని అడిగాడు హిండ్. "మీ దగ్గిరున్న స్టాంపుకి చెల్లించిన మొత్తంలో మూడోవంతు ఇస్తే చాలు నాకు" అన్నాడా యువకుడు. హిండ్ మరి ఆలోచించకుండా అతడు కోరిన మొత్తం 4,000 డాలర్లు ఇచ్చేశాడు. ఆ యువకుడు అటు వెళ్ళగానే హిండ్ సిగరెట్ లైటర్ తీసి ఆ 4,000 డాలర్ల స్టాంపును కాల్చేశాడు. బ్రిటిష్ గయానా నకిలీ స్టాంపు కలిగి వున్న అదృష్టవంతుడు తనొక్కడే అని తనను తానే అభినందించుకున్నాడు ఆ తర్వాత.

## కంప్యూటర్ ఆహారం

పరిశ్రమల్లో ప్రాముఖ్యత సంపచడమే గాక తిండి, నిద్ర వగైరాలను కూడా నిర్ణయిస్తూ మనిషి దైనందిన కార్యక్రమాల్లోకి ప్రవేశిస్తోంది కంప్యూటర్.

ఈ సంవత్సరపు ప్రతిష్టాకరమైన టెన్నిస్ టోర్నమెంట్ వింబుల్డన్ స్త్రీల ఛాంపియన్ నవరతిలోవ వయసులో చిన్నదేమీ కాదు. అయినా ప్రథమస్థానం సంపాదించుకోగల సామర్థ్యం వుంది.



అందుకు కారణం డాక్టర్ రాబర్ట్ హాస్. ఏవరీ డాక్టర్ రాబర్ట్? ఈయన ఆట గాళ్ళకి పోషకాహార విషయాల్లో సలహా లిచ్చే నిపుణుడు. ఈయన ఈ విషయంలో ప్రత్యేక కృషి చేశారు.

ఆటల్లో ప్రథమ స్థానం సంపాదించ దలిచే ఆటగాడు అందుకు తగిన ఆహారం తీసుకోవాలని ఈయన అభిప్రాయం. మరి సరైన ఆహారాన్ని నిర్ణయించడం ఎలా? అందుకు డాక్టర్ రాబర్ట్ కొన్ని పరీక్షలు నిర్వహిస్తారు. ఆటగాళ్ళ రక్త పరీక్ష చేసి అందులో చక్కెర, ఏసిడ్, కొలెస్టెరాల్ పరిమాణాలను పరిశీలిస్తాడు. ఆయన ఇలా 36 అంశాలను క్షుణ్ణంగా పరిశీలిస్తాడు. తర్వాత ఎత్తు, బరువు వగైరా విషయాలతోపాటు స్త్రీయా, పురుషుడా అన్న అంశాన్ని కూడా పరిగణనలోకి తీసుకుంటాడు.

అనంతరం ఈ వివరాలనన్నింటిని తన కంప్యూటర్‌కి అందిస్తాడు. కంప్యూటర్ వాటి ఆధారంగా ఆటగాడు ఎలాంటి ఆహారం, ఎంత పరిమాణాల్లో తీసుకోవాలో నిర్ణయిస్తుంది.

డాక్టర్ రాబర్ట్‌గారికి నవరతిలోన చాలా ముఖ్యమైన కష్టమర్ గనుక ఎప్పటి కప్పుడు రక్త పరీక్షలు చేసి ఆహారంలో మార్పులు చేర్పులు చేస్తుంటారు. ఆమె వింబుల్డన్‌లో పాల్గొన్నప్పుడల్లా డాక్టర్ రాబర్ట్ తన కంప్యూటర్‌ను వెంట బెట్టుకు వెళతాడు ఆమెతో కూడా. ఆమె విజయానికి డాక్టర్ సహకారం చాలా వుంటుంది. అయితే డాక్టర్ రాబర్ట్ మాత్రం "అబ్బే....ఇందులో నాదేం లేదు. అంతా కంప్యూటర్ మహత్యం" అని చెప్పేస్తాడు నిజాయితీగా.

## ఆదర్శ వార్తాపత్రిక

ఇవాళ్టి పత్రికలు ఇలా పుట్టి అలా మాయమౌతున్నాయి. ఇవాళ కనిపించిన పత్రిక రేపు కనిపించదు. ఇక పత్రిక సర్క్యులేషన్ పెంచడానికి ఒంటికాలి మీద తపస్సు చేసినంత కష్టపడాల్సి వస్తోంది. అలాంటిది రోజుకి కోటి 36 లక్షల సర్క్యులేషన్ గల పత్రిక వుందంటే నోరు తెరువక తప్పదు ఆశ్చర్యంతో. ప్రపంచంలోకెల్లా అత్యంత సర్క్యులేషన్ గల పత్రిక జపాన్‌లో వుంది. 136 లక్షల సర్క్యులేషన్ గల పత్రిక 'యొమియురి షిమ్‌బూన్'.

ఈ పత్రిక ఉదయం, సాయంత్రం ఎడిషన్లు రెండూ కలిపి రోజుకు 136 లక్షల కాపీలు ప్రచురించబడుతున్నాయి. ఈ పత్రిక తాలూకు ఇంగ్లీష్ ఎడిషన్ రోజుకి 30 వేల కాపీలు ప్రచురించబడతాయి. అమెరికాలోని పదిహేడు ప్రముఖపత్రికల సర్క్యులేషన్ మొత్తం కలిపినా 'షిమ్‌బూన్' పత్రిక సర్క్యులేషనంత వుండదు.

నమ్మండి నమ్మకపోండి – ఈ పత్రిక ఎడిటోరియల్ బోర్డులో 3,059 మంది వున్నారు. కేవలం జపాన్‌లోనే షిమ్‌బూన్‌కు 436 వార్తాసంస్థలు వున్నాయి. ఈ పత్రికకు స్వంతంగా మూడు విమానాలు, నాలుగు హెలికాప్టర్లు వున్నాయి. ఈ పత్రిక పాఠకులు కొందరు ఉదయం, సాయంత్రం ఎడిషన్లు రెంటినీ కొంటారు.

ఈ పత్రికకు హత్యలు, దోపిడీలు, మానభంగాలు వంటి సంచలనాత్మక వార్తల మీద నమ్మకం లేదు. అలా వార్తలు ఆ పత్రికలో చివరి పేజీల్లో చిన్న చిన్న వార్తలుగా వస్తాయంతే.

జపాన్ జర్నలిజంలో బాధ్యతకు

ఎక్కువ ప్రాధాన్యత వుంటుంది. వీరు రాజకీయవాదుల, ప్రభుత్వ బెదిరింపులను ఏమాత్రం లెక్క చేయరు. అంతేకాదు ఈ పత్రిక తన ఉనికిని నిలబెట్టుకోడానికి ప్రకటనల మీద ఆధారపడదు కూడా. జపాన్‌లోని రిపోర్టర్లలో చాలామంది కోర్గ లోనే తిరుగుతారు.

## కవయిత్రి

ఎనిమిదేళ్ళ నికదుర్బిన రష్యాలో గల యల్టా ప్రాంతంలోని ఓ పాఠశాలలో ఐదోతరగతి చదువుతోంది. ఆ పసి ప్రాయంలోనే నిక ప్రముఖ కవయిత్రిగా పేరుపొందింది.

నిక కవయిత్రి కావడం హఠాత్తుగా అనుకోకుండా సంభవించింది. ఓరోజు నిక ఉన్నట్టుండి నిద్రనుండి మేల్కొన్నది. వాళ్ళమ్మని పిలిచి ఓ కాగితం, పెన్సిల్‌ను పక్కగా పెట్టుకోమన్నది. అద్భుతమైన కవితలను పల్లించడం మొదలెట్టింది అప్పటినుంచి నిక తల్లి కలం, కాగితన్ని ఎప్పుడూ సిద్ధంగా వుంచుతోంది

నిక కవితలు అప్పుడే కొన్ని సంపుటాలుగా వెలువడ్డాయి కూడా.

ఈ చిరుతప్రాయపు కవయిత్రి కవితలు చదివిన పాఠకులు ఎనిమిదేళ్ళ అమ్మాయి చక్కని పదజాలంలో ఇంత సులభంగా బరువైన భావాలను ఎలా వ్యక్తం చేయగలుగుతోందా అని ఆశ్చర్యపోతున్నారు.

ఇంత హఠాత్తుగా నికకి కవిత్వంలో ఇంత మేధాసంపత్తి ఎలా అబ్బిందా అనుకున్నారు చాలామంది. నిక కుటుంబీకులు సంగీతప్రియులు. వారి ఇల్లు చక్కని వర్ణచిత్రాలతో అలంకరింపబడి వుంటుంది. నిక మెదడు వాటి భావాలను గ్రహించి కవితలద్వారా వ్యక్తపరుస్తుండవచ్చని భావించారు చివరికి.

నిక వాళ్ళింట్లో ఎక్కడచూసినా పుస్తకాలు కనిపిస్తాయి. నిక అమ్మమ్మ పియానో బాగా వాయిస్తుంది. ఆమె మనమరాలి కవితలకు రాగాలు కట్టి పియానో మీద వినిపిస్తుంది. నిక కుటుంబంలో వాళ్ళందరికీ ఆమె కవితలు కంఠతా వచ్చు. నికకు జంతువులంటే చాలా ప్రేమ. ఆమె ఓ తాబేలును, కుక్కను ముద్దుగా పెంచుకుంటోంది.

"నా అంతట నేను కవితలు రాయడం లేదు. అదృశ్యశక్తి ఏదో నా చేత బలవంతంగా రాయిస్తోంది" అంటుంది నిక. "ఇంట్లోంచి బయటకువాగానే ప్రకృతి అందాలను ఆస్వాదించడంలో మునిగిపోతాను నేను. బహుశా అదే నా కవితల్లో బహిర్గతమవుతోందేమో'' అని తన విచిత్రాన్ని వివరిస్తుంది నిక.

ఎనిమిదేళ్ల ఈ కవయిత్రి గురించి ప్రముఖ రష్యన్ రచయిత ఒకరు "నిక



జన్మతహా కవయిత్రి. పెరిగిన తర్వాత కూడా ఆమె కవితలు రాస్తుందో లేదో చెప్పలేం. భవిష్యత్తులో కవిత్వాన్ని వదిలేసి చిత్రలేఖనాన్ని చేపట్టవచ్చు. కాని ప్రస్తుతం మాత్రం నిక కవిత్వపు దిశలో పయనిస్తోంది" అని వ్రాకుచ్చాడు. అనుకోకుండా మొదలైన ఈ కవిత్వ ప్రవాహం ఎన్నాళ్ళుంటుందో మరి!

## కథారచన కిటుకు

హృదయ తంత్రులను మీటే సంఘటనలు ఎదురైనపుడు దాన్ని కథగా రాసి పారెయ్యాలన్న ఉబలాటం కలగడం సహజం. వెంటనే కాగితాలు ముందేసుకుని



వీరోచితంగా కలం పట్టుకుని కూర్చుంటారు. కాని ఏం లాభం? కదలనని మొరాయించే బండిలాగా ఓ పట్టాన కలం కదలదు. ఆలోచనలకు రూపం ఏర్పడదు. ఈలోపల కథ రాయాలన్న ఆవేశం కాస్తా చల్లారిపోయి, తిన్నది అరిగిపోగా నీరసం ముంచుకువచ్చి ఏడుపు వచ్చినంత పనవుతుంది.

మీరు కూడా అలాగే నిరాశపడిపోకండి. కథలు రాయడానికి కొన్ని కిటుకులున్నాయి. వాటిని ఓ పట్టు పట్టారంటే కథారచయితగా వెలిగిపోవచ్చు. కథా రచయిత కాదల్చుకున్నవారు ఇతరుల కథలను చదవడం ఓ తప్పనిసరి అలవాటుగా మార్చుకోవాలి. ఏ కొంచెం సమయం దొరికినా ఇతర కథారచయితల కథలు చదువుతుండాలి. ఇది మొదటి మెట్టన్నమాట.

తరవాత చేయాల్సిన పని కథలేగాక మంచి నవలలు, కవితలు వగైరాలను కూడా మథించడం. ఎందుకంటే ఈ సాహిత్యం ప్రతిబింబించే వివిధ రకాల జీవిత సత్యాలు నిర్లక్ష్యం చేయరానివి. మీరు మంచి గ్రహణ శక్తినికలిగివుండాలి. చూసే, వినే. చదివే ప్రతివిషయాన్ని, అంశాన్ని గ్రహించి మనసులో నిలువచేసే సామర్థ్యం కలిగివుండాలి.

కేవలం సాహిత్యం చదవడమే కాదు వాటి గురించిన సమీక్షలను కూడా క్రమం తప్పక చదవాలి. మీరు రాయదలుచుకున్న కథలో పాత కథల్లో లేని సంఘటనల మీద ఆధారపడిన కథాంశం ఇమిడి వుండాలి. వీలయినంతవరకు మీ స్వంత ఐడియాలను, బుర్రను ఉపయోగించడం మంచిది. ఇతర కథారచయితల ఐడియాలను కాపీకొట్టడం ప్రారంభిస్తే మాత్రం ఇక అంతే సంగతులు.

మీరు గుర్తుంచుకోవలసిన మరో ముఖ్య విషయం కథా రచన ఆపకుండా చేస్తూనే వుండాలి. మధ్యలో కొన్నాళ్ళు అస్త్ర సన్యాసం చేస్తే మానసికమైన బద్ధకం ఏర్పడటం, పూర్వపు శైలి దెబ్బతినడం జరగవచ్చు. ఎంతగా రాస్తే అంతగా మీ స్వంత శైలి అభివద్ధి చెందుతుంది. సమకాలీన సంఘటనల గురించి కథలు రాసేటపుడు పాఠకులకు విచిత్రంగా కొత్తగా కనిపించే సంఘటనలు, పేర్లు చేర్చకండి. ఈ చిట్కాలు పాటించారా ఇక మీ కథారచనకు ఎదురన్నది లేదు ✻

ఈనాడు

# భాషాస్వరూపం

మాతృభాషలో మాట్లాడేటప్పుడు పామరులు కూడా తప్పులు పలకరుగాని రాసేటప్పుడు పండితులు కూడా తప్పులు రాయవచ్చు. ఎందువల్ల ?

మాట్లాడేటప్పుడు భాషకు హావభావాలు, అంగవిన్యాసం లాంటివి తోడ్పడతాయి. రాసేటప్పుడు ఈ సాధనాలుండవు. కనక విస్పష్టంగా, నిర్దుష్టంగా రాయాలంటే భాషకు ఒక ప్రమాణం ఉండాలి. పత్రికా భాషకు అలాంటి ప్రమాణం ఏర్పరచిన పుస్తకం ''ఈనాడు భాషాస్వరూపం''.

పత్రికల్లోనూ ఇతర వ్యావహారిక రచనల్లోనూ సామాన్యంగా కనిపించే తప్పులు పరిశీలించి అవి దొర్లకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు వివరిస్తూ ప్రముఖ భాషా శాస్త్రవేత్త డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ రచించిన పుస్తకమిది.

ఇది పత్రికా రచయితలకేకాక, ప్రజలకు అర్థం అయ్యేలాగా రాయాలని, తమ భావాలు స్పష్టంగా ఎదుటివారికి అందజేయాలనీ ఆశించే వారందరికీ ఉపయోగపడుతుంది.

వెల రు. 25.00

ఎం.ఓ. ద్వారాగాని, డి.డి.ద్వారాగాని ఈ మొత్తం పంపి ఈ పుస్తకాన్ని రిజిస్టరు పోస్టు ద్వారా పొందవచ్చు.

ప్రతులకు:

ఉషోదయా పబ్లికేషన్స్

ప్రయివేట్ లిమిటెడ్

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా,

హైదరాబాద్ – 500 004.

అరుణ కళ్లు మిలమిలలాడాయి. "ఎప్పుడొచ్చావే వూరి నుండి?" అంటూనే చేతిలోని పిండి గిన్నెను అక్కడే పడేసి చేయి కడుక్కోవడానికి లేచింది-శారదను చూస్తూనే.

"ఎప్పుడొచ్చావమ్మా శారదా? కులాసానా?" అంటూ స్వాగతం పలికింది సీతమ్మ.

"బాగానే వున్నాను పెద్దమ్మా! ఈ ఉదయం కోణార్క్‌కి వచ్చాను. సరేగానీ ఈ వడియాలు లేకపోతే పీడాబోయె నెత్తి మాడిపోతోంది. మరీ ఇంత ఎండలో పెడుతున్నారేమిటి?"

"మొదలుపెట్టడం పెందరాడేనమ్మా. అయ్యేసరికి ఈ వేళయింది"

ఇంతలో చేతులు పమిటకొంగుకి తుడుచుకొంటూ వచ్చింది అరుణ "లోపలికి పోదాం పదవే శారదా" అంటూ.

"అదేమిటే అరుణా... మోచేతి దగ్గర పిండి అలాగే వుంది. చేతులయినా శుభ్రంగా కడుక్కో. వచ్చినపిల్ల ఎక్కడికెడుతుందీ? ఏమిటో ఈ అభిమానాలు. ఆ మూడు ముళ్లూ పడేంతవరకే. ఆ తరువాత ఎవరెక్కడో?"

సీతమ్మకు తన బాల్యం కళ్ళముందు సినిమా రీలులా తిరిగింది. తనచిన్నప్పటి చదువు, ఆ కిష్టయ్య మాస్టారు కోదండాలు, గోడ కుర్చీలు, ఈతబెత్తం దెబ్బలు తలుచుకుంటేనే భయం. ఆయన తొడపాశం పెడుతుంటే పట్టపగలే ఆకాశంలో చుక్కలు కనపడేవి. ఈయన చదువూ వద్దు చట్టుబండలూ వద్దని ఆ ఇంటిదగ్గరా, ఈ ఇంటి దగ్గరా కాలక్షేపంచేసి బడి కెళ్ళకుండా ఓనమాలతోటే చదువుకి చుక్క పెట్టేసింది తను. పెండ్లయ్యాక భర్త రాఘవయ్య చదువు నేర్పుతాను అంటే కిష్టయ్య మాస్టారి తొడపాశం జ్ఞాపకానికి వచ్చి బెదిరిపోయింది. అయినా ఆషామాషీగానే తనకు తెలుగు చదవనూ, రాయనూ నేర్పాడు భర్త.

చిన్నప్పుడు చదువుకోకపోయినా చెలికత్తెలకు మాత్రం లోటులేదు తనకు. తద్దె వచ్చిందంటే తెల్లవారుఝామున లేవడం, పులిహోర, గోంగూర పచ్చడి, పొట్లకాయ కూర,గడ్డపెరుగుతో భోజనం, తరువాత పిల్లలంతా రాములవారి గుడి దగ్గర చేరి సీడాట, చెండాట, దాగుడు మూతలుతో ఎంత హాయిగా గడిపేవాళ్లు? మామూలు రోజుల్లో సైతం తెల్లారగట్టే లేచి గుడి దగ్గర కింద రాలిన బొగడ పూలు, పారిజాతం పూలు ఏరుకోవడానికి పోటీలుపడేవాళ్లు. సంక్రాంతి నెల పట్టారంటే ఇంక ఆవు పేడకు నానా తంటాలు పడేవాళ్లు. ఎవరెక్కువ గొబ్బిళ్లు పెడతారో అన్న పోటీ. చీకూ చింతాలేని రోజులవి. ఎప్పుడైనా పోట్లాడుకున్నప్పటికీ చంద్రావతి, నాగరత్నం తన ప్రాణంలో ప్రాణంగా మెలిగేవాళ్లు. నాగరత్నం తమ్ముడు చంటి కూడా కాస్త పెద్దయ్యే వరకు తమ బొమ్మలాటల్లో కలిసేవాడు. ఇప్పుడెక్కడున్నారో, ఏంచేస్తున్నారో...?

చంద్రావతి పెండ్లయ్యాక వాళ్ళత్తవారు నిజామాబాద్‌లో పొలాలు కొనుక్కొని అటువైపు వెళ్ళారు. బాగా ఆస్థి సంపాయించారన్నారు. నాగరత్నం సంగతి తెలియదు. అతనికి చెడు అలవాట్లున్నాయని తెలిసీ చాలా ఆస్థిపరులనీ, బోలెడు నగలు చేయిస్తారనీ ఇచ్చిచేసారు. తరవాత దానిని బాగా కొడతాడని విన్నది. నలుగురు పిల్లలు. పెద్దవాళ్లయి వుంటారు. ఇప్పుడు దాని పని ఎలా వున్నదో? మళ్ళీ





కలిసింది లేదు. తానేమో భర్తతోపాటు జిల్లా అంతా తిరుగుతూ ఇలా ఈ పెనమకూరు చేరుకుంది.

గతాన్ని నెమరువేసుకుంటూ వడియాల పని పూర్తి చేసింది సీతమ్మ!

* * *

షర్బత్ సిప్ చేస్తూ తీరుబాటుగా కూర్చున్నారు స్నేహితురాళ్ళిద్దరూ.

"ఏమిటే వురుము లేని పిడుగులా ఊడిపడ్డావ్! ఏమిటి కథ?" నింపాదిగా అన్నది అరుణ.

"నా కథలో కథానాయకురాలివి నీవేనే" అరుణ ముఖంలోకి సూటిగా చూస్తూ అన్నది శారద.

"అదేమిటేవ్! యూనివర్సిటీలో చదువుతున్నదానివి నీవు. పల్లెటూరి వాసిని నేను. నేనెట్లా హీరోయిన్నౌతానే!" నవ్వుతూ అన్నది అరుణ.

"పల్లెటూరిపిల్ల హీరోయినైతేనే సినిమా హిట్టవుతుంది" కళ్ళు పెద్దవి చేస్తూ అన్నది శారద.

"అబ్బ... సరేలేవే! అసలు విషయం చెప్పు"

"ఏమీ ఎరగని నంగనాచిలా ఆ ముఖం నువ్వూనూ" వేడిగా వున్నది శారద కంఠధ్వని

"ఏమిటీ నీ అరుపులు? ఇంకాస్త షర్బత్ తేనా?"

"నావి అరుపులా?"

విషయమేమిటో అర్థం చేసుకోలేని అరుణ మాటాడక వూరుకున్నది — కాస్త వేడి తగ్గితే తానే చెబుతుందిలే అని.

"మచిలీపట్నం పేరెప్పుడైనా విన్నారాండీ తమరు" వ్యంగ్యంగా వున్నది శారద కంఠం.

"ఓ.... అదా తమరు ఆవేశ పడటానికి కారణం. వినదమేమిటి — మెట్టినూరుగా చేసుకోబోతుంటే" కళ్ళు మూసుకొని నుదుటిని చేతితో రాసుకొంటూ అన్నది అరుణ.

"అయితే నేవిన్నది నిజమేనన్న మాట. పల్లెటూళ్ళలో వూరికే పుకార్లు లేస్తుంటాయి గదా! నీ నోటితో నువ్వు నే విన్నదంతా కల్పితం అని చెబుతావన్న ఆశతో వున్నాను. నాది దింపుడుకళ్ళెం ఆశేనన్న మాట" ఉసూరుమన్నది శారద.

"అప్పుడే ఈ సువార్త నీకెలా చేరిందే" రాని నవ్వుని ముఖాని కద్దుకుంటూ అన్నది అరుణ.

"విశేషాలుండాలేగాని వార్తలు చేరడానికేముంది. ఆఘమేఘాల మీద సరిహద్దులు దాటేస్తాయి"

"ఈ విషయం నిర్ధారించుకోవడానికేనా నీరాక?" ఆప్యాయతతో శారద నడుంచుట్టూ చేతులు వేస్తూ అన్నది అరుణ.

"పవర్ పాలిటిక్సులో కొట్టుమిట్టాడే పొలిటీషియన్ నీతివంతుడూ, నిజాయితీపరుడూ అయ్యాడంటే నమ్మడం ఎంత కష్టమో నీవు ఆస్థి అంతస్థుల కోసరం ఇలాంటి నిర్ణయానికొచ్చావన్నా నమ్మడం అంతే కష్టం"

"నేను డబ్బుకి దాసోహమన్నానని నీవెందుకు అనుకోవాలి?"

"విన్నదాన్ని బట్టి మరింకే మనుకోవాలే? అలాకాకుంటే మంచిదే గదా!" కాస్త ఆగి అసలు విషయంలోకొచ్చింది శారద.

"హేమవల్లి అనీ నా హాస్టల్ మేట్ సోషియాలజీ ఎం.ఏ చదువుతోంది.బందరు నేటివ్. ఎగ్జామ్స్ దగ్గర పడుతున్నాయని అందరం పూర్తిగా చదువులో లీనమై

పోయాం. మొన్న రాత్రి చదువుకొంటూ మధ్యలో కాస్త రిలీఫ్ కోసరం నేనూ, నా రూమ్‌మేటు సరళా, హేమవల్లి టెర్రస్ మీదికెళ్ళాం. సముద్రంలో దూరంగా మినుకు మినుకు మంటూ నక్షత్రాల్లా మెరిసిపోతున్న లైట్లతో కదిలివస్తున్న ఓడలు, సముద్ర కెరటాలు చేసేరొద, ఓడలకు దిక్కులను తెలపడానికి అటూ ఇటూ తిరుగుతూ వెలుతురును వెదజల్లే లైట్‌హౌస్ ... సుందర దృశ్యం. ఎన్నిమార్లు చూసినా మళ్ళీమళ్ళీ చూడాలనిపించే అపురూప దృశ్యం. అలా సముద్రాన్ని చూస్తూ కబుర్లలో పడ్డాం.

జూఆలజీ డిపార్ట్‌మెంటులో ఓ రీడరున్నాడు. 45 సంవత్సరాల వయస్సుంటుంది. అప్పటి వరకూ పూలరంగళ్ళా తిరిగి ఇప్పుడు ప్రేమలో పడ్డాట్ట పాపం పసవాడు. తన దగ్గరే పనిచేస్తున్న రీసెర్చి స్కాలరుని పెండ్లి చేసుకోబోతున్నాడు. ఆ ప్రస్తావన వచ్చినపుడు హేమవల్లి అన్నది - 'ఈ రోజుల్లో పెండ్లికొడుకులు ఏభయి ఏళ్ళ వాళ్ళయినా, అరవైఏళ్ళవాళ్ళయినా రెండో పెండ్లో,మూడో పెండ్లో..ఎవరయినా ఫరవాలేదు. పుష్కలంగా డబ్బు, ఓ కారూ, బంగ్లా వుండే బస్ గ్రాడ్యుయేట్లూ పోస్టు గ్రాడ్యుయేట్లూ కూడా క్యూలో నిలబడతారు పెళ్ళికుమార్తెలుగా. ఈడూ జోడూ-ప్రేమలూ అన్నీ కూడా డబ్బు ముందు బలాదూర్' అంది హేళనగా.

ఈ సమాజంలో నిజంగానే డబ్బుకున్న స్థానం అటువంటిది కనుక విని వూరుకున్నాను నేను. ఏం మాట్లాడలా.

నా రూమ్‌మేటు శైలూ మాత్రం అన్నది "ఏమిటోయ్... అంతగా ఢంకా బజాయించి చెబుతున్నావ్. స్వంత అనుభవంలా వుంది"

అరుణా....వింటున్నావా?" వెనక్కి తిరిగి స్నేహితురాలి ముఖంలోకి చూస్తూ ఆగింది శారద.

"ఊ...కానీ" కుతూహలంగా వింటోంది అరుణ.

"హేమవల్లికి దూరపుబంధువులట! ఆయన ఓ లీడింగు లాయరు. ఏభయి సంవత్సరాలదాకా వయస్సుంటుంది. అన్యోన్య దాంపత్యమేగానీ ఆయనకు పిల్లల్లేరు. పుడతారన్న ఆశకూడా లేదు. లోపం ఆవిడనుండేనట. ఇప్పుడాయనకు పున్నామ నరకం భయం పట్టుకొని మళ్ళా పెళ్ళికోసరం ప్రయత్నాలు చేస్తున్నారట. అయితే కొన్ని షరతులు పెట్టారు. చదువు సంస్కారం వున్న అమ్మాయి కావాలి. గుణవంతురాలయి వుండాలి. తమ కుటుంబాన్ని వీధిపాలు చేయకుండా వుండాలి. అలాంటమ్మాయి కావాలి అనడం తరువాయి చదువుకున్న అమ్మాయిలే అయిదారు సంబంధాలొచ్చాయట. ఊరికేనేకూడా కాదు పాతిక-ముప్పై వేల కట్నాలతో సహా. అందులో వాళ్ళకు అన్నిరకాలుగా నచ్చిన ఓ సంబంధం సెటిల్ చేసుకున్నారట...

మేము ఆసక్తిగా వింటున్నాముతప్ప మధ్యలో ఎవరం మాట్లాడలా.

మళ్ళా హేమవల్లే అన్నది-'మొన్న మా వూరెళ్ళినపుడు ఆ అమ్మాయి ఫోటో చూసాను. నా ప్రాణం వుసూరుమన్నది. చూసినకొద్దీ చూడబుద్ధేసేట్లుగా వున్నది. ఆ మొఖం తీరు, మంచి పరసనాలిటీ ఫేర్‌గా కూడా వుంటుందని చెప్పారు. విజయవాడలో చదివింది. ఫస్ట్‌క్లాస్ గ్రాడ్యుయేట్. బహుశా శారదగారికి తెలిసే వుండచ్చేమో. మీరూ అక్కడేగా చది

వింది. పేరు అరుణ.'

ఆ మూడక్షరాలు విన్న నా గుండె దడదడలాడింది. 'మా బాచ్‌లో ముగ్గురు అరుణలున్నారు. మీరు చెప్పే అరుణ ఎవరో. అయినా విజయవాడలో చాలా కాలేజీలున్నాయి. ఆ అమ్మాయి ఎక్కడ చదివిందో?' అని అన్నానే కాని నేనిక అక్కడుండలేకపోయాను. ఆ అమ్మాయి చేసిన వర్ణన నీకే సరిపోయేట్టుగా ఉన్నది. చదవడానికి పుస్తకంతీస్తే అక్షరం ముక్క బుర్రకెక్కడంలా. బుర్రనిండా తేనెటీగల్లా ముసిరిన ఆలోచనలు. ఆ రాత్రికి చదువుకి గుడ్‌బైచెప్పి మంచ మెక్కేసా. ఎప్పటికి నిద్రపట్టిందో. మరునటి రోజు క్లాసుకెళ్ళినా నిన్ను గురించిన ఆలోచనలే. నీవేకళ్ళముందు ప్రత్యక్షం. ఇంతలో ఆడబోయిన తీర్థం ఎదురైనట్లు యూని వర్శిటీకి సెలవులిస్తున్నట్లు నోటీసొచ్చింది. హాస్టల్లో విద్యార్థులమధ్య ఏవో గొడవ లొచ్చాయట. అదింకా యూనివర్సిటీ మొత్తం దావానలంలా అంటుకుపోతుం దేమో అని నిరవధికంగా మూసివేసారు. అమ్మయ్య అనుకొని నేను ఇంటికి వచ్చే సాను. ఇంటికి రాగానే అమ్మను నీ విషయం గురించే అడిగితే నిజమేనన్నది. నాకు ఏమనుకోవడానికి పాలుబోలా. నెల క్రితంవరకూ నీకు ఉద్యోగ ప్రయత్నం తప్ప ఏ ఆలోచనా లేదుగదా! ఆఘమేఘాలమీద ఇటువంటి నిర్ణయం ఎందుకు తీసుకోవాల్సొచ్చింది?"

బాధగా వున్నది శారద స్వరం.

"కొన్ని కొన్ని విషయాలు అలానే అనుకోకుండా జరిగిపోతుంటాయ్ శారదా. ఇంకోమూడు సంవత్సరాల సర్వీసున్న నాన్న అర్జెంటుగా వున్నపాటున రిటైరవుతాడని ఊహించామా?" ఎంతో జీవితానుభవాన్ని గడించిన వేదాంతిలా నిర్లిప్తంగా మాట్లాడింది అరుణ.

"మోకాలికీ, బట్టతలకు లంకెపెట్టకు. నీ పెండ్లి నిర్ణయానికీ, రిటైర్‌మెంటుకీ సంబంధం ఏమిటి?"

"ఆ బాదరాయణ సంబంధమేమిటో చెబితే నీకర్థమయ్యే విషయం కాదులే శారదా. ఆర్థికపరమైన ఇబ్బందులెలా వుంటాయో నీకేమాత్రం తెలియదు. ఇందులో నిన్ను తప్పు పట్టడంలా. ఆ బాధలేవో అనుభవించేవాళ్ళకు మాత్రమే అర్థమవుతాయి"

"నన్ను మరీ అంత ఆగర్భ శ్రీమంతు రాలిని చేయకే. నేనూ నా చిన్నప్పుడు జామకాయ కాకుండా ఆపిల్‌కాయ తింటే ఎంత బాగుండు అనుకున్నరోజు లున్నాయి. దానికేమిటిగానీ రిటైరైనా ఏం ఫరవాలేదు. ఉద్యోగులకొచ్చిన నష్టమేమీ లేదు. ఏవేవో బెనిఫిట్సు వుంటాయి. చాలానే డబ్బులు వస్తాయని అంటు న్నారు" సంశయంగా అన్నది శారద.

"బోలెడు వస్తాయా? అలాంటి ప్రచారమే జరుగుతోందనుకో. మరయితే రిటైరయ్యే ఉద్యోగులంతా మేము యాభై ఎనిమిది సంవత్సరాలు పూర్తయ్యేవరకు ఉద్యోగాల్లోనే కొనసాగుతామని ఎందుకు గోల పెడుతున్నట్లు? ఎందుకు కోర్టుల కెడుతున్నట్లు? జీతమే ప్రధానాధారం కానివాళ్ళ విషయం అవతలపెట్టు. మా విషయంలోనే చూడు. నాన్న ఉద్యోగ జీవితకాలంలో ఓ ఇల్లైనా ఏర్పాటుచేసు కోలేకపోయారు. తమ్ముడి ఇంజనీరింగ్ పూర్తికాలా. చెల్లి చదువు అలానే వున్నది. బి.ఇడి. టీచరుగా రిటైరవుతున్న నాన్నకు రిటైర్‌మెంటు బెనిఫిట్సు ఓ ముప్పైవేలు రావచ్చు. కాస్తో కూస్తో అప్పులాటేసి



చతుర ... 2

కుంటాను. ఇప్పుడు చేతిలోకి డబ్బొస్తుంది కాబట్టి తరువాత సంగతి ఏమైనా ఓ 20-25 వేలు ఖర్చుపెట్టి నన్ను వదిలించేసుకోవాలనుకొంటున్నారు. కాదన్నా వినరు. నా పెండ్లి, ఉన్న అప్పుతీరిస్తే ఇంక ఏం మిగుల్తుంది? హళ్ళికి హళ్ళి, సున్నకు సున్న"

"మరో మూడు సంవత్సరాలు కొనసాగినంత మాత్రాన ఈ సమస్యలన్నీ పరిష్కారమవుతాయంటావా?"

"కాకపోవచ్చు. కానీ తమ్ముడి చదువు ఓ కొలిక్కి వస్తుంది. చెల్లి పోలిటెక్నిక్ అయిపోతుంది. ఈమధ్య కాలంలో నాకేదైనా ఉద్యోగం దొరక్కపోతుందా అన్న ఆశతో వున్నాం"

"అయితే నిన్నిప్పుడు పెండ్లికి తొందరపెట్టడం దేనికి? ఏదో ఉద్యోగానికి ప్రయత్నం చెయ్యొచ్చుగదా! మెరిట్టున్న దానివి"

"మెరిట్! ఎందుకే ఈ మెరిట్? ఫస్ట్‌క్లాస్ గ్రాడ్యుయేట్లు, పోస్టుగ్రాడ్యుయేట్సూ కొల్లలుగా వున్నారు. వడ్డించే నాథుడుంటేనో, ముడుపు చెల్లించుకోగలిగితేనో మెరిట్‌తో పనేముంది? సరేగాని పెండ్లికి తొందరపెట్టడమంటున్నావేమిటి? పొరపాటున కూడా ఈ భావం అమ్మా నాన్నల దగ్గర వ్యక్తం చెయ్యకు. అమ్మానాన్నలకీ సంబంధంతో ఏలాంటి ప్రమేయం లేదు. వాళ్ళకిష్టం లేదుకూడా. ఈ సంబంధం తీసుకొచ్చింది మామయ్య. అన్నివిధాలా ఇష్టపడి ఒప్పుకున్నది నేను" కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడింది అరుణ.

"ఏం? లాయరుగారంత సవమన్మధులా లేక ఆయన సిరిసంపదలు నిన్ను మైకంలో పడేసాయా?" హేళనగా అన్నది శారద.

అరుణ కొంతసేపటివరకు ఏం మాట్లాడలా. స్నేహితురాలిపై నుండి చేతులు తొలగించి మంచంపై లేచి కూర్చున్నది. ఎంతో మనస్థయిర్యంగల అరుణ కళ్ళలో చిప్పిల్లిన నీటి పొరను చూసింది శారద.

"అరుణా! నిన్ను బాధపెట్టి హేళన చెయ్యాలనేది నా వుద్దేశ్యంకాదు. నీది తొందరపాటు నిర్ణయమేమో! నీ నిండు జీవితం, బంగారు భవిష్యత్తు బలైపోతుందేమో అన్న బాధ తప్ప" అంది శారద.

"సరేనే శారదా! నీ సలహాను పాటించి నా నిర్ణయాన్ని పునరాలోచిస్తాను గానీ నాకు ఓ వరుణ్ణి నువ్వుగానీ, మరెవరైనా గానీ కుదిర్చిపెట్టగలరా? అతగాడు గ్రాడ్యుయేటు అయివుండాలనే నియమం కూడా లేదు. తెలివితేటలుండి నన్ను నన్నుగా అర్థం చేసుకుని వివాహానికి ఒప్పుకునే సహృదయుడైతేచాలు. నా వివాహాన్ని గురించి నాన్న ఓ నాలుగైదువేలు మించి ఖర్చుపెట్టడం నాకిష్టంలేదు. ఆలోచించుమరి"

మౌనం వహించడం శారద వంతైంది ఈసారి. కాసేపటికి అరుణే అన్నది- "ఏమే... మాట్లాడవ్! తెల్లవారి లేచి పేపరు తీయడంతోటే క్రమం తప్పకుండా అనుదినం మనం చూస్తూన్నదేమిటి? కోడళ్ళపైన, భార్యలపైన కిరసనాయలు పోయడాలు, నిప్పంటించడాలు, చావగొట్టడం, కాకుంటే ఆత్మహత్యలు-ఇవన్నీ వేటి కోసరం... కట్నం కోసరమే గదా? కాకపోతే ఫ్రిజ్ కావాలనో, స్కూటరు కావాలనో-ఏవేవో కోర్కెలు తీర్చుకోవడానికి ఎదురుగా కనిపించే సాధనం భార్య. కొన్ని సంవత్సరాలు కలిసి కాపురంచేసి




బిడ్డలను కన్నాక కూడా భార్యాభర్తల మధ్య కనీస ప్రేమానుబంధాలు లేక పోగా ఆజన్మ శత్రువుల్లా భార్యల్ని చంపడమంటే అంతకు మించిన పైశాచికత్వం ఇంకేముంటుంది? మన సభ్యత, నాగరికత, వైవాహిక వ్యవస్థ సంబంధాలు ఏ స్థాయిలో ఉన్నాయో ఆలోచించు"

"నీ ఉపన్యాసం ఆపవే బాబూ! ప్రతిదానికీ సమాజం అంటూ ఆవేశపడిపోతావ్. కేవలం బిడ్డల కోసరం మనసా వాచా తననే నమ్ముకున్న కట్టుకున్న భార్యను కాదని ఇంకో పెండ్లికి సిద్ధపడటం ఎంతవరకు సమర్థనీయం?"

"సమర్థనీయం కాదు... నిజమే. పైగా నీచమూ, హీనమూ కూడా. ఆ హేయమైన పనిలో భాగస్వామిని కావలసివచ్చిన నా పరిస్థితికి నేను బాధపడుతున్నా కానీ నీవు కూడా నేటి మన సామాజిక స్థితిగతులను గురించి స్థిమితంగా ఆలోచించు. ఇక్కడ ఈయన బిడ్డల వ్యామోహంలో ఈపనికితలపడ్డాడు. కానీ అన్నీ సవ్యంగా వున్న వాళ్లుకూడా కేవలం ధనాకాంక్షతో ఎన్ని తప్పుడు పనులకు ఒడిగట్టడంలేదు? మన సీనియర్ వనజను పెళ్లాడటానికి సిద్ధపడ్డ ఇద్దరు బిడ్డల తండ్రి ఆ సాంబశివరావు వ్యవహారమేమిటి చెప్పు? 50 వేలు కట్నం తీసుకొని ఇష్టపడి పెండ్లి చేసుకొని ఆ కట్నం డబ్బుతో కాంట్రాక్టులు, వ్యాపారాలు చేసి లక్షలార్జించాడు. ఇరవై సంవత్సరాల తరువాత ఇప్పుడు భార్య పిచ్చిదై పోయిందా? ఆవిడతో కలిసి తిరగడం ఇతగాడికి నామోషీనా? కన్న బిడ్డలచేతే 'మా అమ్మ పిచ్చిది' అనిపించి తను మళ్ళీ పెళ్ళికి తయారుకావడం అబద్ధమేమీ కాదుకదా! ఇంతేనా? ఇంకా ఎన్నిరకాల పాట్లు. చదువుకొనే రోజుల్లోనే కట్నాల కక్కుర్తితో వివాహాలు చేసుకోవడం, పెద్ద వుద్యోగాలొచ్చాక వాళ్ళ నెలాగయినా వదిలించుకొని స్టేటస్‌కి తగ్గ అమ్మాయిలు కావాలనుకోవడం ఎన్ని చూడటంలా? వీటిలో నీచం కానిదేది చెప్పు. నేనూ మొండికేశానే! ఈ ఆప్యాయతలూ, అనురాగాలూ ఒట్టి బూటకం. ఎన్ని రంగులు పులిమి ఎంత అందమైన మాటల్లో వర్ణించినా మన సమాజంలోని అన్ని సంబంధాలూ డబ్బు చుట్టూనే పరిభ్రమిస్తున్నాయి. అన్నీ ఆలోచించే ఈ నిర్ణయానికొచ్చాను"

శారదకు ఏం మాట్లాడటానికీ తోచక పొడిగా అన్నది "నీ, నా మధ్యగల స్నేహానుబంధం దేనిచుట్టూ తిరుగుతోంది?"

"పిడివాదం చెయ్యకు. అన్ని రూల్స్‌కి మినహాయింపులుంటాయి. ప్రేమానురాగాలతో కాపురాలు చేసుకుంటున్న వాళ్లు, కట్నాల ప్రసక్తి లేకుండా పెండ్లి చేసుకుంటున్న వాళ్ళు అసలే లేరంటావా?"

"ఏమ్మా! స్నేహితురాళ్ళ ముచ్చట్లయ్యాయా? శారదా... నీకు అరుణ తన నిర్వాకం చెప్పేవుంటుందనుకుంటానమ్మా. మేం ఎంత చెప్పి ప్రయోజనం లేకుండా వుంది. పైగా ఏమంటోందో చూడమ్మా. తననెవ్వరూ సరిగా అర్థం చేసుకోవడం లేదంట...తనకందుట్లోనే సుఖముందట. ఇంతకాలం పెంచి పెద్దజేసి ఇప్పుడు దాని బతుకుల్లోనిప్పులు పోస్తున్నామన్న బాధ మాది. ఇది మంచికే వచ్చిందో చెడుకే వచ్చిందో? అన్నింటికీ ఆ శ్రీమన్నారాయణమూర్తే వున్నాడు. వాడిదే భారం" వేదాంతంలో పడింది సీతమ్మ.



"వీన్ని గురించి ఈరోజు కొత్తగా అనుకునేదేముంది పెద్దమ్మా...జగమొండి! వాదించి గెలవలేం" మంచం మీది నుండి లేస్తూ అన్నది శారద.

"లేస్తున్నావేమిటమ్మా...కూర్చో. ఈ పూట నీ భోజనం ఇక్కడే. అరుణ ఓ యింటిదయ్యాక నీవు మాత్రం ఎందుకు కనబడతావ్"

"భోజనం చేయకుండా ఇప్పుడెక్కడికి వెళుతుందిలే కానమ్మా, మొన్న కావేసిన ఫోటోలు వచ్చే వుంటాయి చూడు. పెళ్ళి మేగజైన్ చూస్తూ కూర్చోవే శారదా! నేనిప్పుడే వచ్చేస్తాను" అంటూ లేచింది అరుణ.

"నేనూ వస్తాను పదవే" అరుణను వెంబడించింది శారద.

* * *

"మా ఎగ్జామ్స్‌కి, నీ పెండ్లికి క్లాష్ రాకుండా వుంటేనే మళ్ళీ రాక" వీడ్కోలు పుచ్చుకొంటూ అన్నది శారద.

"ఎవరికీ ఏ ఇబ్బందీ కలిగించదలుచుకోలేదే. నా పెండ్లికి పురోహితుడు సరిచూస్తారు. సమయానికి నీవు వూరిలో వుండే [illegible] దొరుకుతాయంతే" చిన్నగా నవ్వుతూ అన్నది అరుణ.

అది బలవంతపు నవ్వులా అనిపించింది శారదకు. అరుణ చేతిని వదిలేస్తూ "ఇంక వస్తానే" అని వెనుదిరిగి చూస్తూ చూస్తూ ఇంటిదారి పట్టింది శారద.

* * *

పెండ్లైపోయి అత్తవారింటి కొచ్చింది అరుణ. గడప లోపల ముందుగా కుడి కాలు పెట్టమన్నారు ముత్తైదువలు. భర్త శేఖర్ మేనత్త ధనలక్ష్మి కూడా ముందు కుడికాలే పెట్టి వుంటుందని మనస్సులోనే అనుకున్నది అరుణ. వాళ్ళు చెప్పినట్లే చేసింది. అరుణతోపాటు మేనత్త కూతురు సరళ కూడా వచ్చింది. ఇద్దరూ చిన్నవాళ్ళే. అంతా కొత్త కొత్తగా వుంది. అరుణ భర్త శేఖర్‌కి తల్లితండ్రీ చనిపోయి అయిదారు సంవత్సరాలైంది. ఒక్క సంవత్సరం వ్యవధిలోనే ఇద్దరూ పోయారు. శేఖర్‌కి ఇద్దరు తోబుట్టువులు మాత్రం వున్నారు. అరుణవున్న రెండు రోజులూ శేఖర్ తోబుట్టువులతోపాటు అతని పినతల్లి, మేనత్తాకూడా వున్నారు. శేఖర్ పెద్ద చెల్లి ధనలక్ష్మిది విజయవాడ పక్కనే ఓ పల్లెటూరు. ధనలక్ష్మి పెండ్లప్పుడు వాళ్ళకున్నది నాలుగైదెకరాల భూమి. అత్తవారిచ్చిన కట్నం డబ్బు తమ దగ్గరున్నది ఇంకొంత కలిపి వడ్డీలకిచ్చి ఏడెనిమిది సంవత్సరాల్లోనే బాగా కూడబెట్టారు. ఇద్దరూ మగపిల్లలే కావడంతో వాళ్ళ చదువుల కోసరం విజయవాడలోనే కాపురం పెట్టేసారు. చిన్నచిన్న కాంట్రాక్టులు, కోట్లవాళ్ళకు ఎక్కువెక్కువ వడ్డీలకు డబ్బులివ్వడం, వీటికి తోడుగా కొద్ది కాలంలోనే విజయవాడ పరిసర గ్రామాలలో ఇళ్ళ స్థలాలకు, పొలాలకు అద్దూఆదుపూ లేకుండా ధరలు పెరిగి పోవడంతో లక్షలార్జించేసాడు.

అయితే పిల్లలు చదువుల్లో పెద్దగా పైకొచ్చింది లేదు. నానా తంటాలూపడి డిగ్రీలు పుచ్చుకున్నారు. ఆ తర్వాత చేసే పనేంలేక రాజకీయ రంగ ప్రవేశం చేసారు.లక్షలున్నాయి కాబట్టిభవిష్యత్తులో ఎమ్.ఎల్.ఎ. అయి, ఆపైన అధికార రాజకీయ పరమపదసోపాన పటంలో నిచ్చెన లధిరోహించవచ్చు. ధనలక్ష్మికి తమ సంపదా, గొప్పతనం చెప్పు కోవడానికే ఎక్కడి టైమూ చాలదు. తాము

పూటకు ఎన్ని లీటర్ల పాలు పోయించుకుంటారో, ఎన్నికూరలొండుకుంటారో, భర్త హైదరాబాదు వెళితే ఎంతెంత ఖరీదైన చీరలు తెస్తారో – ఇదే సొద. ఈ మధ్యనే రామగుండంలో ఏవో కాంట్రాక్టులు చేస్తే నాలుగయిదు లక్షలు మిగిలాయట. భర్తతో పాటు తాను కూడా తిరుపతిలో గుండుచేయించుకొనివచ్చింది.

ఆవిడ పరిసరాల్లోకి వస్తోందంటేనే అరుణకు భయం. ఆవిడకు 'ఊ' కొట్టడాన్ని మించిన శిక్ష ఇంకేమీ వుండదేమో. శేఖర్ రెండవ చెల్లెలు కృష్ణకుమారి. వీళ్ళది చల్లపల్లి పక్కనే ఓ పల్లెటూరు. నాలుగెకరాల పొలం మాత్రం వున్నది. ఆవిడ భర్తకు ఇల్లూ వాకిలీ పొలంపుట్రా ఏమీ పట్టదు. తినడం, పేకాట, పోసుకోలు కబుర్లు. ఇద్దరూ కూతుళ్ళే. పెద్దమ్మాయికి పెండ్లైపోయింది. ఇంక చిన్నపిల్ల పెండ్లి కెదిగివున్నది. ఆ పిల్లను శేఖర్ కిచ్చి పెండ్లి చేస్తే తనపని పైలా పచ్చీసుగా వుంటుందని సమయమొచ్చినప్పుడల్లా శేఖర్ బుర్రలో రెండో పెండ్లిని గూర్చిన ఆలోచనలు పాతుకొనేలా తన శాయశక్తులా కృషి చేసాడు. అయితే కథ అడ్డం తిరిగేసరికి ఇక ఎలాగో తంటాలు పడి బావమరిది నుండి వీలైనంత ఆర్థిక సహాయం పొందడం మినహా చేసేదేమీ లేదనే నిర్ధారణకొచ్చాడు. ఆ చిన్నాడపడుచే ఇంటిలో ఆపనీ ఈపనీ అందుకొంటుంది. అరుణ అజమాయిషీ కనుక్కోవడం కూడా ఆవిడ వంతే. మొదటి భార్య లక్ష్మి ఆ రెండు రోజులూ అరుణ వున్న పరిసరాలకే రాలేదు.

పరామర్శ కొచ్చిన ఇరుగు పొరుగు వూరికే వచ్చిచూసి లక్ష్మిని, అరుణను పోల్చిచూడటం జరుగుతోంది. ముందు అరుణ పరామర్శ. తరువాత లక్ష్మిని. అరుణ రాక కారణంగా లక్ష్మి బాధపడకుండా ఎలా వుంటుందన్న నిర్ధారణతో లక్ష్మిపట్ల సానుభూతి ప్రకటించడం వాళ్ల పని.

“ఆ కడుపున ఓ కాయకాస్తే అసలు లక్ష్మికి లోటేవిటి? ఈ ఇంటి సిరీ సంపదా అంతా ఆవిడది కాదూ?” అంటూ వ్యాఖ్యానాలు.

వచ్చినవాళ్లు అరుణ మెడ తడిమి చూడటం, “ప్లీడరుగారు చిన్నావిడకు పెద్దగా నగానట్రా ఏమీ చేయించినట్లు లేరే! పెట్టుకోదుగాని లక్ష్మికిలేని నగలేమున్నాయ్రా, వడ్డాణం, జంట కాసుల పేరు... ఒకటనేముంది అన్నీ వున్నాయి” అంటూ వ్యాఖ్యలు.

రెండు రోజులూ ఎలా గడచిపోయాయోగాని అరుణకు ముళ్ళకంచెపై కూర్చున్నట్లున్నది. వేటికీ నోరువిప్పక శిలాప్రతిమలా వుండిపోయింది. మానసికంగా మాత్రం ఒకటే మథనపడిపోయింది. తాను నగలూ, చీరెలకోసరం మాత్రమే ఈ పెండ్లి చేసుకున్నదా? ఇంకోవిధమయిన ఆలోచనలకు తావే లేదన్నమాట. తాను తప్పు చేయలేదుకదా? భవిష్యత్తంతా కత్తిమీద సామేనేమో! ఏమయినా పరిస్థితులను ఎదుర్కొని సానుకూలం చేసుకోవల్సిందేతప్ప కత్తికి తల వంచిన తర్వాత కత్తివేటుకు భయపడి ప్రయోజనమేముంది? తన భయాందోళనలను మనస్సులోనే తొక్కిపట్టి ఎలాగో స్థిమితపడింది.

* * *

కూతురు అరుణ అత్తింటి వాతావరణం ఎలా వున్నదో తెలుసుకోవాలన్న ఆత్రుత సీతమ్మది. అరుణ లేకుండాచూసి




సరళను అడిగింది.

అంతా బాగానే వున్నారు; మొద టావిడ మాత్రం అసలు కలవలేదంటూ ఒక్కముక్కలో తేల్చిచెప్పేసింది సరళ.

ఆ సమాధానం సీతమ్మకు తృప్తిగా అనిపించలా. అరుణనడగడానికి జంకు. ముఖంచూసీ, నడతచూసీ గ్రహించ వలసిందే. కవులు వర్ణించే నవవధువులా మధురిమలు నింపుకొని కలలుగనే కను దోయితో, ఎరుపెక్కిన చెక్కిళ్ళతో ముఖం కళకళలాడకపోయినా అరుణ ఎంతో మామూలుగా ప్రత్యేకమయిన దేమీ జరగనట్లుగానే వ్యవహరించింది. పెండ్లికివచ్చిన కరుణ, సుధాకర్‌లు వెళ్ళి పోయారు. ఉన్న నాలుగు రోజులూ కరుణ బావకు దూరం దూరంగానే వున్నది. స్వభావరీత్యా కరుణ కొత్తవాళ్ళతో అంత త్వరగా కలిసిపోలేదు. సుధాకర్ మాత్రం బావగారితో బాగానే కలిసి పోయాడు. స్వతహాగా పొలిటిక్సుపట్ల అభిరుచిగల సుధాకర్ కోర్టులు, కోర్టుల కొచ్చే కేసులు, భూకమతాలు, గరిష్ట పరిమితులనుండి మినహాయింపులు పొంద డానికి భూస్వాములు పడేపాట్లు, కోర్టులు ప్రజలకు ఎంతవరకు న్యాయాన్ని కలుగ జేస్తాయి–ఇటువంటి విషయాలను గురించి వివరాలు తెలుసుకుంటూ, తన కాలేజీ వివరాలు చెబుతూ బావగారికి సన్నిహితు డయిపోయాడు.

భర్త శేఖర్‌కు కావలసినవన్నీ స్వయంగా చూసుకోవడం, సన్నిహితంగా మసులుకోవడం, అతని సాన్నిధ్యంలోనే ఎక్కువకాలం గడపడం తెలిసి సీతమ్మా రాఘవయ్యలకు గుండెలపైనుండి ఎంతో భారం దింపుకున్నట్లయ్యింది.

అరుణా శేఖర్‌ల మధ్య వయసులో పాతికసంవత్సరాలకు పైగానే వ్యత్యాస ముంది. శేఖర్ తీరు వున్న వయస్సుకి చాలా తక్కువగా కనిపిస్తుంది. దాంతో చూసేవాళ్ళెవరికీ వాళ్ళిద్దరి దాంపత్యం ఎబ్బెట్టుగాలేదు. దాంతో కేవలం కుటుంబ శ్రేయస్సు దృష్ట్యానే అరుణ ఈ పెండ్లికి ఒప్పుకోలేదని తల్లీ తండ్రీ తృప్తిపడ్డారు.

ఈడూ జోడూ అయిన ఏ నిరు ద్యోగినో చేసుకుంటే చూసేవాళ్ళకు చూడముచ్చటగా చిలకా గోరింకలా అని పించినా అనుభవించడానికి ఏముంటుంది?

క్షణక్షణం జీవనపోరాటం. ఓ సినిమా చూడాలన్నా, ఓ మంచి చీరె కొనుక్కోవా లన్నా పెద్ద తంటేగదా!

జరిగినదాన్ని సమర్థించుకోవడానికి చేసుకొనే ఆత్మవంచన ఇది. చేసింది తప్పు అని ఓ పక్క మనస్సు మూలుగుతోంటే దాన్నిఏవో సాకులతో జోకొట్టి తమను సమర్థించుకోవడానికియత్నించడం మానవ నైజంలో కనుపించే ఓ బలహీనత.

తనకొచ్చే 30 వేలలో మూడువేలు అప్పుతీర్చి సుధ చదువైపోతే ఇంక కరుణ పెండ్లి. ఆపైన వచ్చే పెన్షనుతో తనూ, భార్యా ఎలానో జీవితాన్ని నెట్టివేయచ్చు. అరుణే కనుక ఈరీతిగా తనను ఒడ్డున వేయకపోతే వచ్చిన డబ్బుకాస్తా అరుణ పెండ్లికే హరించుకుపోయేది. ఆపైన తన కుటుంబం ఒడ్డునపడ్డ చేపలా ఇంక ఆలో చించలేకపోయాడు రాఘవయ్య. వ్యవధి లేకుండా ఆకస్మికంగా రిటైర్‌మెంటు వార్త విని గుండెఆగి చనిపోయినవాళ్లు ఎంతమందిని గురించి పేపర్లలో చదవ లేదు?

అరుణ సంతోషంగానే కనిపిస్తున్నా తండ్రిగా రాఘవయ్యకు తెలుసు అరుణ నైజం. మిన్నువిరిగి మీదపడ్డా తొణకదు

బెణకదు. ఏమయినా అరుణకు జరిగినది అన్యాయమే అన్న విషయం రాఘవయ్య మనసుని తొలుస్తూనేవున్నా ఏం చెయ్యగలడు? పాపం, రిటైరయిన బడిపంతులు రాఘవయ్య.



## 2

భూకంపాలు, పెనుతుఫానులు, యుద్ధాలు, విప్లవాలు నాగరిక సమాజం తలవంచుకోవల్సినరీతిలో జరుగుతున్నా... మూకుమ్మడి మానభంగాలు, కట్నాల కోరలలో చిక్కుబడిపోతున్న అబలల ఆక్రందనలు ... ఎన్ని విషాదాలు జరిగిపోతున్నా వాటితో తనకేమీ నిమిత్తం లేదన్నట్లు యధాలాపంగా, చిద్విలాసంగా దొర్లుకుపోయేది కాలం. హేమంతం, గ్రీష్మం, శరత్ గతించింది. ఆకులు రాల్చిన వృక్షాలు చిగుళ్ళు తొడిగాయి. కలకోయిల కూజితాలు, మల్లెల సౌరభాల సకలాడంబరాలతో శోభాయమానంగా ప్రవేశించింది వసంతం. అయినా ఇంత పటాటోపంతో ఏతెంచిన వసంతం సైతం అరుణ మీద తన ప్రభావాన్ని ఇసుమంతైనా చూపలేకపోయింది. మానసికమైన చిన్నచిన్న గాయాలతో అరుణ జీవనరథం కుంటినడకతో సాగిపోతోంది.

అధునాతనమైన అన్ని హంగులతో కూడిన విశాల భవనం. చక్కని పూలతోట. అరుణకిష్టమైన ఎన్నో రకాల గులాబీలు. కారు.మంచి మంచి పుస్తకాలు, చదువుకోవడానికికావలసినంత సమయం. అయినా ఇవేవీ అరుణ వంటరితనాన్ని పోగొట్టలేకపోయాయి.

చదువుకునే రోజుల్లో అరుణ కలలుగన్న జీవితం ఎమ్మేస్సీ ఫస్ట్‌క్లాసులో పాసవుతాననీ, లెక్చరరో, పెద్ద ఆఫీసరో అవుతాననీనూ. సామాజిక స్పృహ గలిగి అభివృద్ధికర భావాలు కలిగిన వ్యక్తితో వివాహం జరిగి జీవితం హాయిగా జోరుగా హుషారుగా సాగిపోతుందనుకునేది. కాని జీవితం ఇటువంటిమలుపును తీసుకున్నది.

ఇంటిలోనే వుండిపోయే పని పిల్ల భాగ్యం వుంది. కనుక అరుణకు ఇంటిలో పెద్దగాపనేమీ వుండదు. ఏవో చిన్న చిన్న పనులు ఇల్లు సర్దుకోవడంలాంటివి తప్ప. డబ్బు వ్యవహారాలు అసలు పట్టించుకునేదిగాదు. ఇరుగు పొరుగుతో బాతాఖానీ ఎప్పుడూ అలవాటులేదు. ఎంతగా పుస్తకాలతో కాలక్షేపం చేసినా జీవితం మందకొడిగా నత్తనడకతో ఏవిధమైన ఉత్సాహం,వుద్వేగం లేకుండా వ్యర్థమయిపోతోందన్న బాధ. ఏదైనా వుద్యోగం వుంటే ఇంత నైరాశ్యం వుండదు.

ఇదే భావం భర్త దగ్గర వ్యక్తం చేస్తే "ఉద్యోగాలెక్కడ కుప్పలు పోసుకోనున్నాయి? నీకెలాగూ బైపొచ్చు. అంత మోజుగా వుంటే నాకు పర్సనల్ అసిస్టెంటుగా పనిచెయ్యి. రూల్స్ ప్రకారం పని, జీతం. నీవు ఎక్కడో పని చెయ్యడం, అక్కడాఫీసరుచేత సతాయింపు–ఆ బాధలేమీ ఉండవు" అని తేల్చేసాడు శేఖర్.

శేఖర్‌కి అంతుపట్టనిది అరుణ మనస్తత్వం. ఏదేనా సందర్భవశాత్తు అత్త






# ఈ ఉగాది పండగతో శుభారంభం చేయండి

20%
రిబేటు
24·3·84 నుండి
31·3·84
వరకు

**ఆప్కో**
**చేనేతలు**

సుందరమైన డిజైనులలో సంప్రదాయానికి
అద్దంపట్టే అందమైన ఆప్కోవస్త్రాలు
మిమ్ములను ముగ్ధులను చేస్తాయి.
ఆప్కో వస్త్రాల విస్తృతశ్రేణి- షర్టింగులు,
డ్రెస్ మెటీరియల్స్, చీరలు, తయారీ దుస్తులు
మరియు గృహోపకరణ వస్త్రాలు.




దీ ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కోపరేటివ్ సొసైటి లిమిటెడ్
హైదరాబాద్-500029

kiron/apco/84ul

గారింటికెళితే అక్కడ తనతో ఎంతో అనురాగంతో నవ్వుతూ తుళ్లుతూవుండే మనిషి తమ ఇంటికి వచ్చీరావటంతోనే వేరే మనిషా అన్నంతగా మారిపోతుంది. తను చొరబడడానికి వీలులేని తనదైన ఓ చిన్న లోకాన్ని సృష్టించుకుంటుంది. తనకు తానుగా ఎంతగా కల్పించుకొని కబుర్లలో పెట్టాలన్నా 'ఆ ... ఊ'లే సమాధానం. శేఖర్ విసిగిపోయాడు. తాను చేయగలిగిందేమీ లేదు. ఓపికగా వేచిచూడటం మినహా తామిద్దరినీ సన్నిహితపరచగలిగింది కాలమొక్కటే! బలవంతంగా ఏభార్యాభర్తలూపరస్పరాను రాగాన్ని పొందలేరన్న నిజం తెలిసిన వాడు శేఖర్.

తన భర్త రెండవ వివాహం చేసుకునే ఆలోచనను వారినోటా వీరినోటా ఎంత కాలంగానో వింటూనే వున్నా లక్ష్మి దానిని గురించి పెద్దగా పట్టించుకుని తల బద్దలు కొట్టుకున్నది లేదు. లోకులు పలుగాకులని తన మనసుకి తానే సర్దిచెప్పుకున్నది. తమ బంధం ఒక్కనాటిదిగాదు. పాతికేళ్లుగా పెనవేసుకుపోయిన బంధం. తమ దాంపత్య జీవితంలో పిల్లలు లేక పోవడమనే లోటు మినహా ఏ ఇతర బాధా లేదు. ఎట్టి పరిస్థితులలోనూ తన భర్త తనను దూరం చెయ్యడు అని గట్టిగా నమ్మింది లక్ష్మి.

తన భర్త నోటివెంబడే రెండవ పెండ్లి ప్రసక్తి విన్నప్పుడు భూకంపం వచ్చి తను అఘాతంలో పడిపోయినట్లు, పెను తుఫానుకి చిగురుటాకులా తల్లడిల్లి పోయింది. మామూలు మనిషి కావడానికి చాలాకాలమే పట్టింది. లక్ష్మికి పూర్తిగా ఇష్టమయితేనే భర్త శేఖర్ రెండవ వివాహం చేసుకుంటానన్నాడు. అయినా తను మూర్ఖంగా వద్దని అడ్డంపడితే భర్తకు మానసికంగా దూరమవుతానేమో నని భయపడింది. ఇప్పటి నీ స్థానానికి ఎటువంటి భంగం కలుగదని భర్త ఇచ్చిన వాగ్దానాన్ని పూర్తిగా విశ్వసించ లేకపోయినా భర్తను పూర్తిగా కాదనలేక పోయింది. కర్మ సిద్ధాంతాన్ని నమ్మిన లక్ష్మి తన తలరాత ఎలా వుంటే అలా జరుగుతుందన్న నిర్లిప్తతతో భర్త వివాహానికి సమ్మతించింది.

దండన బలప్రయోగాలు లాభం లేదనుకున్నప్పుడు, కర్మ సిద్ధాంతాన్ని అడ్డంపెట్టుకుని 'సహనశీలి', 'త్యాగశీలి' అన్న కితాబులిచ్చి అనాదిగా పురుషుడు స్త్రీని దగాచేసి తన పబ్బం గడుపు కొంటూనే వున్నాడు. శాస్త్రీయంగానూ, వైజ్ఞానికంగానూ సమాజం రాకెట్ వేగంతో పురోగమిస్తున్న దశలో సైతం స్త్రీ బానిస బంధనాల నుండి విముక్తిని పొందలేక పోగా బూజుపట్టిన పాత భావాలకు దాసురాలై సమస్త బాధలకు వారసురాలిగానే మిగిలిపోయింది.

అయిష్టతను మనసులోనే అణచివేసి బయటకు తన సమ్మతిని తెలిపినా, పెండ్లి దగ్గరపడుతున్నకొద్దీ తన భర్తకు పూర్తిగా దూరమైపోతానేమోనన్న బెంగ, ఆందోళనలతో రాత్రుళ్లు సరిగా నిద్ర పట్టక విపరీతమైన మానసిక వేదనకు గురైంది. తను రెండో పెండ్లికి అంగీకారాన్ని తెలియజేసి వుండవలసిందికాదు. చేతులు కాలాక ఆకులు పట్టుకొని ఏం ప్రయోజనం? తను గట్టిగా కాదని కోర్టుకెక్కే పరిస్థితి వస్తుందనుకుంటే ఈ పెండ్లి జరిగివుండేదికాదు. ఇలా మథన పడిపోవటంతో మనిషి బాగా నీరసపడి పోయి పెండ్లి జరిగిన వెంటనే లక్ష్మికి

 

ఫిట్సు రావడం మొదలు పెట్టాయి. మానసికమైన ఆందోళనకు గురికావడం వలన మాత్రమే ఈవిడకిలా ఫిట్సొస్తున్నాయి తప్ప వేరే అనారోగ్యం ఏమీలేదు; మందుల కంటే మానసికమైన విశ్రాంతి అవసరమని డాక్టరు చెప్పడంతో లక్ష్మి కొద్ది కాలం పుట్టింటికెళ్ళింది. అయితే పెనం మీది నుండి పొయ్యిలో పడినట్లయింది లక్ష్మికిది. తమ ఇంటివద్ద లేనిపోనివి ఊహించుకొని మాత్రమే భయపడ్డది. ఇక్కడ పుట్టింటివద్ద ఆ విషయం మరిచిపోనీకుండా ఒకటే సూటిపోటీలు. తల్లి నుండి అన్నవరకు అందరూ సతాయింపే.

'ఎవరి మాట విన్నావు కనక. మొగుడి మాటే వేదమయింది. అందుకే అనుభవించు' అన్న ధోరణిలో వున్నది వాళ్ళ ప్రవర్తన. అరుణ తనతో ఆప్యాయంగా వుండడానికే ప్రయత్నిస్తున్నట్లు తనకనిపించినా అదంతా కపట నాటకమనుకొని తనే దూరదూరంగా తప్పుకొని తిరుగుతూ సమయం చిక్కినపుడల్లా పుల్లవిరుపుమాటలంటూ ఆవిడ బాధ పడేట్లు ప్రవర్తించింది. వీళ్ళకంటే అరుణ వెయిరెట్లు నయం. వీళ్ల అరుణను 'అది ఇది' అంటూ ఈసడింపుగా మాట్లాడుతుంటేనూ, భర్తను కూడా నీచంగా చిత్రిస్తుంటేనూ ఇక అక్కడ నాలుగు రోజులకు మించి వుండలేక పోయింది లక్ష్మి. కష్టమో సుఖమో తన ఇల్లే తనకనుకొని బందరు వచ్చేసింది.

మానసికంగా స్థిమితపడడానికి తన వంతు ప్రయత్నం చేసింది ఇన్నాళ్లూ. జీవితాంతం ఒకే ఇంటిలో మసలవలసిన వాళ్ళు తాము. కక్షలు కార్పణ్యాలు పెంచుకునే కంటే కలివిడిగా వుండటమే సుఖం అన్న ఆలోచనలు బుర్రలోకొస్తున్నా, అరుణతో కలివిడిగా వుండాలంటే కష్టంగా వుండేది. ఆవిడ ముఖం చూడాలంటేనే వెగటు. ఏమైనా అరుణ మాత్రం అరమరికలు లేకుండా ఆప్తురాలిగా లక్ష్మితో కలిసిపోవడానికి చేతనైనంతగానూ ప్రయత్నం చేసింది.

తన స్థానాన్ని, అధికారాన్ని ఇతరులు తీసుకుంటారన్నా లేక ఇతరులతో పంచుకోవాలన్నా బాధపడటం; ఆ స్థానాన్ని అందుకోబోయే వ్యక్తిపట్ల శత్రుత్వం వహించటం మానవసహజం. ఆ వాస్తవాన్ని అర్థం చేసుకోగలిగిన అరుణ తనూ అదే పద్ధతిలో కాక ఓపికగా సామరస్యంగా లక్ష్మికి దగ్గర కావచ్చనుకున్నది. అరుణ విషయం మినహాయిస్తే లక్ష్మి ఇరుగూ పొరుగూ అందరితో ఎంతో కలుపుగోలుగా తలలో నాల్కలా వ్యవహరించేది. ఎవరితో ఏ పొరపొచ్చాలు వుండేవికావు. కాని ప్లీడరుగారింట్లో వచ్చిన మార్పుపట్ల మాత్రం అందరికీ ఎక్కడలేని కుతూహలం. లక్ష్మి,అరుణలు ఎలా వుంటారు? సవతులనేవాళ్లు పోట్లాడుకోకుండా వుండటం ఎక్కడైనా సాధ్యమయ్యే పనేనా? ప్లీడరు చిన్న భార్య మోజులో లక్ష్మిని అలక్ష్యం చేస్తూనే వుండి వుంటాడు. లక్ష్మి ఎంతగా కుమిలిపోతోందో?...అని ఆరాలు.

అరుణ నెల నెలా... అనే ఆసక్తి ఇంకొందరికి. ఈ రకపు అమ్మలక్కలం తీరూ తెన్నూ లక్ష్మికి గిట్టదు. అందుకే లక్ష్మి ద్వారా కూడా ఏ ఆసక్తికర విషయాలు తెలియకపోవడంతో అమ్మలక్కలకు ఆ ఇంటి వ్యవహారాల్లో కాలక్షేపం లభిస్తుందన్న ఆశ సన్నగిల్లిపోయింది. ఆ ఇంటి మీది నుండి తమ దృష్టిని మళ్ళించేశారు. అయినా ఏవో

చిన్న చిన్న విసుర్లు.

"పెళ్ళయి సంవత్సరం దాటుతున్నా ఈ పెళ్ళానికి పిల్లలు లేరేమిట్రా" అని వ్యాఖ్యానాలు.

లోకం ఎవరి బతుకు వాళ్ళను బతక నియ్యదు.

ఏమైనా లక్ష్మికి ఫిట్సు క్రమ క్రమంగా అవే తగ్గిపోయాయి ఏమందూ మాకు లేకుండానే. ఆరోగ్యంతోపాటు మానసికంగా కూడా కుదుటపడింది.

* * *

ప్రాక్ దిశన పైపైకి వస్తున్న సూర్య బింబం. అరుణారుణ కాంతులు గదిని ప్రకాశవంతం చేస్తున్నాయి. పెరటిలోని సంపెంగ పొదనుండి వీస్తున్న పరిమళాలు గదిలో పలుచగా వ్యాపించి మనస్సులను ఆహ్లాదపరుస్తున్నాయి. శేఖర్, అరుణ, లక్ష్మి కాఫీ తాగుతూ పేపరు చూస్తూ అందరూ ఒకేచోట కూర్చొనున్నారు.

"హైదరాబాదు శివార్లలో బందిపోట్ల దోపిడీ"

"పది సంవత్సరాల బాలిక రేప్"

"రాత్రి తొమ్మిదిన్నర ప్రాంతాల్లో రిక్షాలో వెళుతున్న యువతి అపహరణ యత్నం"

"తొమ్మిది లోపున సైతం ఆడవాళ్ళు వంటరిగా రోడ్డుమీద తిరిగే పరిస్థితి లేకపోవటం ఎంతన్యాయం" అరుణ గొంతులో బాధ.

"ఏమయ్యిందంట?" లక్ష్మి ప్రశ్నించింది.

"స్నేహితురాలి ఇంటినుండి రిక్షాలో ఇంటికి వెడుతున్న ఓ అమ్మాయిని కాస్త నిర్మానుష్యంగా వున్న చోటుచూసి కారులో వెంటాడుతూ వస్తున్న ఇద్దరు కుర్రాళ్ళు రిక్షాను ఆపి ఆ అమ్మాయిని బలవంతాన తమ కారు ఎక్కించడానికి ప్రయత్నం చేస్తుంటే ఆ అమ్మాయి గట్టిగా కేకలు వేసిందట. సమయానికి ఓ ముగ్గురు మనుషులతో కూడిన ఆటో అటు వచ్చిందట. ఆటోలో వాళ్ళు దిగి ఆ అమ్మాయిని పట్టుకోబోతున్నవాడిని పట్టుకున్నారట. కారు లోపల వున్నవాడు ఉడాయించేసాట్ట. పట్టుబడ్డ వాడిని మాత్రం మెత్తగా తన్ని పోలీసులకు అప్పజెప్పారట"

"ఏం పోయేకాలం? వెధవల్ని నిలువునా పాతిపెట్టాలి. అంబోతుల్లా తిని పనీ పాటూ లేక ఊరిమీద పడటం. మరీ ఈమధ్య కాలంలోనే ఇలాంటి విపరీతాలు పెచ్చు మీరిపోతున్నాయి" లక్ష్మి కంఠంలో అసహ్యం.

"ఇటీవలి కాలంలో మనదేశంలో సైతం పాశ్చాత్య నాగరికత వాసనలు ప్రబలుతున్నాయి. చాలా కూల్ డ్రింక్ షాపుల్లో వీడియో సినిమాలని చూపెడుతున్నారు. పైకి ఏదో సినిమా పేరు చెప్పడం, లోపలేమో ఆ సినిమా మధ్యలో బ్లూ ఫిలింస్ చూపటం. ఇలాగే కుర్రకారు చెడిపోతున్నారు" పేపరు తిరగేస్తూనే అన్నాడు శేఖర్.

"బ్లూ ఫిలింస్ అంటే?" వెర్రిమొహం వేసింది లక్ష్మి.

"నీ మొహం. నీకదీ తెలియదు. ఒకసారి ఆ బ్లూఫిల్మ్ అంటే ఏమిటో చూపే ఏర్పాటు చేస్తాలే" నవ్వుతూ అన్నాడు శేఖర్.

లక్ష్మికి అదేమిటో అగమ్యగోచరంగా వుండి అరుణవైపు చూసింది.

"నాకూ తెలియదక్కా. నగ్నంగా వున్న ఆడవాళ్ళ బొమ్మల్నీ, మరి మగవాళ్ళవి కూడానో వాటిలో చూపుతా

రట" అంది అరుణ.

"ఛీ...ఛీ! అదేం పోయేకాలం. వాటిలో ఆనందమేమిటి?" వంటిమీద గొంగళి పురుగులు పాకుతున్నట్లుగా వళ్లు జలదరించింది లక్ష్మికి.

"ఏమానందమో వాళ్ళకే తెలియాలి. దేశం కోసరం, ప్రజాశ్రేయస్సు కోసరం సర్వస్వం ప్రాణాలతోసహా త్యాగంచేసే మహా పురుషులూ వున్నారు. రూపాయి డబ్బుల కోసరం ఎంతటి నీచాతి నీచమైన పనులు చేయడానికి వెరవని మనుషులూ వున్నారు" అసహ్యించుకుంటూ అన్నది అరుణ.

"ఆడపిల్లల్ని కిడ్నాప్ చేసే కేసుల్లో పేపర్లకెక్కేవెన్ని? ఆడపిల్లల వ్యవహారం అరిటాకు ముల్లుసామెత. కప్పెట్టుకునే గొడవలే కొల్లలు"

"పొద్దుగూకితే ఆడపిల్ల బయట అడుగుపెట్టడమంటే భయమయితేఎలా?"

"కాస్త జనసమ్మర్దం తక్కువగా వుండేచోటయితే పట్టపగలు అని మాత్రం ఏముంది. ఆమధ్య మన వీధిలోనే లెక్చరరుగారి తల్లి సాయంకాలమప్పుడు బజారునుండి వస్తుంటే ఎవడో స్కూటరు మీద పోతూ పోతూ మెడలో గొలుసు లాక్కుపోలా. అరాచకం మరీ పెచ్చుమీరిపోతోంది"

ఇంతలో బెల్ మోగింది. శేఖర్ బయటకు వెళ్లాడు.

"మనం వంటిమీద ఇంతింత బంగారంతో బయటకు వెళ్లడం భయమే అరుణా" చేతి గాజులు సవరించుకుంటూ అన్నది లక్ష్మి.

అరుణ నవ్వేసింది — నిజమేనక్కా అంటూ.





పక్కగదిలో నుండి అమ్మాయి, ఎత్తుకుపోవడంలాంటి మాటలు వినబడటంతో అరుణ చేతిలోని పేపరు లక్ష్మికిచ్చి ఇవతలకొచ్చి ఆసక్తిగా వాళ్ళ మాటలు వినడం మొదలెట్టింది. వాళ్ళ సంభాషణ వల్ల అరుణ అర్థం చేసుకున్నదాన్నిబట్టి ఆ ఇద్దరు కుర్రాళ్ళమీద పోలీసులు ఓ అమ్మాయిని బలవంతంగా ఎత్తుకుపోవడానికి ప్రయత్నం చేస్తూ పట్టుబడినట్లు కేసు పెట్టారట. ఆ కేసు నుండి బయటపడడానికి శేఖర్ వద్దకొచ్చారు.

"ఎటెంప్ట్ జరిగిన మాట వాస్తవమే గదా?"

"స్పాట్ లోనే పట్టుపడ్డాం"

"ఆ అమ్మాయి మీకింతకు ముందే తెలుసా?"

"ఆ దారిన వెడుతుంటే అప్పుడప్పుడూ ముఖం చూడ్డం మినహా పరిచయం లేదు"

వివరాలు తెలుసుకున్నాడు శేఖర్.

"జరిగింది ఏమైనా మీరు కోర్టులో మాత్రం ఆ అమ్మాయికీ, మీకూ ఇంతకు ముందే పరిచయం ఉన్నట్లూ, సినిమాలకూ షికార్లకూ కలిసి తిరిగేవారమనీ, ఆరోజు కూడా యధాప్రకారం ఆ అమ్మాయి ఇష్టపూర్వకంగా మీ కారెక్కబోతుంటే ఎవరో తెలిసిన వాళ్లు కనబడటంతో గొడవ చేసిందనీ, ఇందులో మా బలవంతమేమీ లేదనీ చెప్పాల్సుంటుంది" శేఖర్ లాయరుగా సలహాలిస్తున్నాడు.

ఆ సంభాషణ వింటున్న అరుణ లావాలా ఉడికిపోయింది. ఎంత ప్లీడర్ వృత్తయితే మాత్రం ఇంత న్యాయమా? తనే అయితే ఆ వచ్చిన వెధవల ముఖం చూడడానికి కూడా ఇష్టపడదు.

ఆఫీసు రూములోకెళ్ళి ఆ వచ్చిన వెధవల్ని బయటకు నడవండనాలన్నంత

కోపం వచ్చింది గాని బలవంతాన తమా యించుకున్నది అరుణ.

కొంత సేపటికి వచ్చినవాళ్ళెళ్లి పోయారు. అందుకోసరమే కాచుకూర్చున్న అరుణ రయ్యిన బాణంలా దూసుకొచ్చింది శేఖర్ దగ్గరకు.

"ఏమండీ! ఏమిటిమీరు వాళ్ళకిస్తున్న సలహా?" అపరకాళిలా వున్నది అరుణ.

"ఏమిటీ! కేసంతా విన్నావా?" తాపీగా అన్నాడు శేఖర్.

"ఇంత దారుణమా?"

"దారుణానికేముంది? నాదగ్గరకొచ్చిన కేసుల్ని గెలిపించుకోవడం నా వృత్తి ధర్మం"

"మోసగాళ్ళను, కేడీలను, రౌడీలను రక్షించడమా వృత్తిధర్మం?"

"నాదగ్గరకొచ్చిన కేసుల్ని నేను గెలిపించుకోవాలి."

"కేసులు, గెలుపు ఓటములు మినహా సమాజంలో ఓ వ్యక్తిగా సమాజ శ్రేయస్సు, న్యాయం, అన్యాయం ఇవేమీ మీకక్కరలేదన్నమాట" అరుణ పెదవులు అదురుతున్నాయి.

"ఇలా ఆలోచించడం ప్రారంభిస్తే నేనింక బోర్డు తిప్పుకుని ఇంట్లో కూర్చోవలసిందే"

"అదేనయం. అన్నెం పున్నెం ఎరుగని అమ్మాయిమీద అంతలేసి అభాండాలు వేయడానికి మీకు నోరెలా వచ్చింది? ఆ అమ్మాయే గనుక ఈ వెధవలకి చిక్కివుంటే ఏం జరిగుండేది? తమ అవసరం తీరాక గొంతుపిసికి ఏ కాలవలోకో దొర్లించి వుండేవాళ్ళు" ఆయాసపడిపోతోంది అరుణ.

"దానికి బాధ్యులం మనం కాదుగా. తెల్లారిలేస్తే అలాంటివి ఎన్ని జరగడం లేదు?" ఉక్రోషంగా అన్నాడు శేఖర్.

"అంటే ఇది మీకు సాధారణ విషయంగా అనిపిస్తోందన్నమాట"

"జరిగింది దారుణం, దుర్మార్గం, అన్యాయం అని నీతోపాటు నేనూ గొంతు చించుకుంటాను ... కాని ప్రయోజనం? లాయరుగా నా విధి నేను నిర్వహించాలి. నేను చేయకపోతే ఆ పని ఇంకొకడు చేస్తాడు. సమాజంలో నేరప్రవృత్తి పెరగకుండా, అఘాయిత్యాలు జరగకుండా చూడాల్సిన బాధ్యత ప్రభుత్వానిదేగాని మనది కాదు"

"అంటే నేరప్రవృత్తి పెరగకుండా చూడాల్సిన బాధ్యత సమాజంలో బాధ్యత కలిగిన పౌరులుగా మనకు మాత్రం లేదా?"

"సరే ... ఈ వాదోపవాదాలు సాయంత్రం తీరుబాటుగా చేసుకోవచ్చు. నాకు కోర్టుకి టైమయిపోతోంది" విసుక్కున్నాడు శేఖర్.

"ఏమయినాసరే ఈ కేసు మీరు ఒప్పుకుంటేమాత్రం ఆ జులాయివెధవల్ని మించిన నేరస్థులు మీరవుతారు" అరుణ ఆవేశపడుతూనే వున్నది.

శేఖర్ అక్కడినుండి లేచి స్నానానికి వెళ్ళిపోయాడు.

వీళ్ళిద్దరి వాదోపవాదాలు వింటూ ప్రేక్షకురాలిగానే వుండిపోయింది లక్ష్మి - ఏం మాట్లాడడానికీ తోచక. అరుణ మాట్లాడినదాంట్లో న్యాయమున్నట్లనిపిస్తోంది. 'ఏమయినా ఏనాడయినా ఒక్క క్షణం తాను భర్త వాదించే కేసుల్లో న్యాయాన్యాయాలను గురించి ఆలోచించిందా? భర్త పేరుమోసిన లాయరు, డబ్బు బాగా సంపాయించగలడు అని మాత్రమే అభిప్రాయపడుతూ

వచ్చింది. అరుణ ఎంత బాగా మాట్లాడింది?' మనస్సులోనే మెచ్చుకోలుగా అనుకున్నది లక్ష్మి. అనుకోవడం వరకూ బాగానే ఉన్నది. కాని భర్త న్యాయ మార్గంలో నడిచి డబ్బు సంపాదనలో వెనుకబడిపోతే! డబ్బులేనిరోజున తమకు సమాజంలో ఈ గౌరవం, పలుకుబడి వుంటాయా?

కోటు తొడుక్కుంటూ మనస్సులోనే 'ఈ అరుణ అసలే గుణాల మారి మనిషి. ఒకటే ఆవేశపడిపోతోంది. ఆడవాళ్ళ మాటలు పట్టించుకొంటూపోతే ప్రాక్టీసుచేసినట్లే. ఏమైనా ఈ కేసును మాత్రం తాను డైరక్టుగా టేకప్ చెయ్యకుండా జూనియర్‌కి అప్పగించేస్తే పోతుందేమో' అనుకుని కారు వద్దకు నడిచాడు శేఖర్.



3

రమ రాక అరుణకు ఆనందాన్నిచ్చింది. తనకు కాస్త కాలక్షేపం దొరికిందని సంతోషించింది. అరుణను చూసిన రమకు మాత్రం విడ్డూరంగా అనిపించింది. ఏమిటీ వికారివేషం... ఈవిడా. చేతికి రెండేసి చొప్పున మాత్రం బంగారుగాజులు, మెడలో ఒకే పేట సూత్రపు గొలుసు! పెదవి విరిచింది. ఏమయినా అందగత్తె అని మాత్రం అనుకోకుండా ఉండలేకపోయింది. లక్ష్మి అక్క సరస్వతి కూతురు రమ. సరస్వతికి రమతోపాటు ఇంటర్ చదివే ఇంకో అమ్మాయి ఉమ, టెన్త్ చదివే అబ్బాయి శ్రీకాంత్ వున్నారు. ప్రతి సెలవులకు ఎవరో ఒకరు వంతులవారీగా పిన్నిగారింటికి రావడం అలవాటు. సరస్వతివాళ్ళది అవనిగడ్డ. అవనిగడ్డ వాళ్ళకు మచిలీపట్నం పెద్ద టవునుకిందే లెక్క. రమ బి.కాం. ఫైనలియర్ చదువుతోంది.

సాయంత్రం టీతాగి ఆరుబయట పూలమొక్కలమధ్య తీరిగ్గా కూర్చుని కబుర్లలో పడ్డారు అరుణా, రమలు. సాయంత్రాలు రంగు రంగుల చంద్రకాంత పూలనుచూస్తూ కాలక్షేపం చేయడం అరుణకెంతో ఇష్టం. పసుపూ, ఊదా, చుక్కలతో కూడిన తెలుపు పూలంటే మరీ మరీ ఇష్టం.

"బి.కాం. అయ్యాక ఏం చేయాలనుకుంటున్నారు?"

"ఏముంది చేయడానికి ... ఇంటిలో కూర్చోవడమే" నవ్వేసింది రమ.

"పోస్ట్ గ్రాడ్యుయేషన్‌గాని, ఉద్యోగ ప్రయత్నంగాని ఏమీ చేయరా?"

"పోస్టుగ్రాడ్యుయేషన్‌కి సీటు రావాలి. వచ్చినా వూరొదిలి వెళ్ళాలి. ఇంక ఉద్యోగమంటారా? నాకు వుద్యోగం చేయాల్సిన ఖర్మేం పట్టింది?" గొంతులో అంతులేని అహం కొట్టొచ్చినట్లు ధ్వనించింది.

"ఉద్యోగం చేయటం ఖర్మంటారా? మనిషన్న తరువాత ఏదో పని చేయాలి గదా! ఎంత ఆడవాళ్ళమయితే మాత్రం పంటింటికే పరిమితమయిపోవడంలో ఏం ఆనందముంటుందంటారు?" విస్మయంగా అడిగింది అరుణ.

"ఉద్యోగం చేయనంత మాత్రాన

వంటింటికే పరిమితం కావాలనెక్కడుంది? ఇంటిపనీ, వంటపనీ పనివాళ్ళే వుంటారు. చేతినిండా పుష్కళంగా డబ్బుండాలే గాని లైఫ్ ఎంజాయ్ చేయడానికి ఎన్ని మార్గాలు లేవు? ఫ్రెండ్స్, పార్టీలు, క్లబ్బులు, సినిమాలు ఒకటేమిటి...గాలిలో ఎగిరే పక్షుల్లా విహరించొచ్చు" ఎదురుగావున్న అరుణను కూడా మరిచిపోయి పరవశత్వంతో చెప్పుకుపోతోంది రమ.

రమ ముఖంలోకి అలా చూస్తుండిపోయింది అరుణ. రోజంతా రెక్కలు ముక్కలు చేసుకున్నా డొక్కలు నిండని అభాగ్యులు కోకొల్లలుగా వున్న ఈ దేశంలో కొద్దిమందికి మాత్రం చింతాకంత పని లేకుండా పైలా పచ్చీసుగా గడిపేసే హరిపిల్లులాంటి జీవితాలు

"మీకిక్కడ పిన్నికి లాగానే ఇల్లే కైలాసమా? ఏమైనా ఇతర వ్యాపకాలున్నాయా?"

"ప్రస్తుతానికి పుస్తకాలు మినహా ఏం లేదు. కాని త్వరలోనే ఓ చిన్న వ్యాపకం కలిగించుకోబోతున్నా. మనకిక్కడకు దగ్గర్లోనే ఓ కాన్వెంటు స్కూలుంది. మీరూ చూసే వుంటారు. దాన్లో ఓ టీచరు పెండ్లి చేసుకు వెళ్ళిపోయిందని తెలిసి ఆ పోస్టుకి అప్లయి చేశాను. ఇంటర్వ్యూ చేసారు. నవంబరు ఫస్టుకి చేరమన్నారు" అరుణ ముఖంలో ఏదో సంతోషం చిందులు వేసింది.

"ఏమిటీ ... పంతులమ్మ ఉద్యోగం చేయడానికి బాబాయి ఒప్పుకున్నారా?" కళ్ళు చిట్లిస్తూ అన్నది రమ.

"ఏమ్మా ఒప్పుకోకపోవడానికి దీన్లో తప్పేముంది. కల్లాకపటం తెలియని అమాయకపు పిల్లలు, వాళ్ళ చిలిపి అల్లరి చూస్తూ పాఠాలు చెప్పడాన్ని మించిన ఆనందం ఇంకేముంటుంది?" అరుణ పరవశంగా అంది.

"ఏమో బాబూ...పంతులుద్యోగం పరమబోర్"

"లోకోభిన్నరుచి అన్నారు పెద్దలు. పదండి లోపలికి పోదాం. వర్షం వచ్చేట్టుంది. మబ్బులు కమ్ముకొస్తున్నాయి" అరుణ లేచింది.

ఇద్దరూ లోపలకొచ్చేసారు.

"అబ్బ! ఇలా మబ్బు పట్టినప్పుడు తినడానికి వేరుసెనక్కాయలు, చదువుకోవడానికి మంచి నావెల్సు వుంటే..." ఆశగా అన్నది రమ.

"రెండూ వున్నాయి. నాదగ్గర చాలా నావెల్సున్నాయి. మీ క్కా వ ల్సిం ది తీసుకుని ఆపైన వేరుసెనక్కాయలు తింటూ చదువుకొందురుగాని"

"ఇవేం పుస్తకాలు బాబూ! ప్రస్తుత రచయితల, రచయిత్రుల పుస్తకాలేమీ లేవా?" విసుగ్గా అడిగింది రమ కాసేపు ఆ పుస్తకాలన్నీ కెలికి.

"వీళ్ళు ఇప్పటివాళ్ళుగాదూ?"

"ఏమో వీళ్ళ రచనలెప్పుడూ నేను చదవలేదు. నాకేదైనా కాస్త లైట్ రీడింగ్-ఈమధ్య వెరైటీగా వస్తున్నాయి చూడండి దెయ్యాలు, భూతాలు, మంత్ర తంత్రాలు, చేతబళ్ళు అలాంటి పుస్తకాలు కావాలి"

"ఆ క్షుద్ర సాహిత్యం, శవసాహిత్యం నాదగ్గర అస్సలు లేవు" కిందబడ్డ పుస్తకాలు పదిలంగా సర్దుకొంటూ వుసూరుమన్నది అరుణ.

వట్టిచేతులతోనే అక్కడినుండి వెళ్ళిపోయింది రమ.

'ఈవిడతో ఇంకా ఏదో మంచి

కాలక్షేపం అవుతుందనుకుంటే ఇదేం మనిషి?' అనుకున్నది అరుణ.

ఇంకో నాలుగు రోజులు గడిచేసరికి రమ మరీ తలనొప్పిలా తయారయింది అరుణకు. సమయం,సందర్భం లేకుండానే అరుణ పట్ల పల్లెటూరి మనిషన్నట్లుగాను, ఏమాత్రం అధునాతనత్వం, నాగరికత తెలియని మూర్ఖురాలన్నట్లుగా పరోక్షంగా హేళనగా మాట్లాడుతుండేది.

'ఇంటికి వచ్చిన చుట్టం తనకన్నా చిన్నది అని చూస్తుంటే తనని మరీ చిన్నచూపు చేస్తోంది. ఈ రమకు తనంటే దేనికింత అక్కసు? మొదట్లో అమ్మక్క తనపట్ల మధురంగా వున్నా ఏనాడూ తన మనసు గాయపడేట్లు మాట్లాడింది లేదు. ఏమిటి ఈ మనిషి?' ఆలోచనలో పడింది అరుణ.

కొందరి బుర్రలు కొన్ని విషయాల్లో పాదరసంలా పని చేస్తాయి. ఎంత తెలివైనవాళ్లూ కూడా కొన్ని విషయాల్లో ట్యూబ్‌లైటులానే వుంటారు.

అరుణ తగలాటం లేకుండా వుంటే పిన్నిగారి ఆస్తిపాస్తులెక్కువ భాగం తమకే దక్కేదిగదా అన్నదుగ్ధ రమకు. ఈ అంతరార్థమే అరుణకర్థంగాని పజిల్.

ఈ చికాకుతో కొంతా,వుద్యోగంలో చేరితే మరలా అనుకున్నప్పుడల్లా వెళ్ళడానికి కుదరదు అని కొంతా ఓసారి పుట్టింటికెళితే బాగుండుననిపించింది అరుణకు.

* * *

అనుకోని అరుణ ఆగమనం తల్లికి మహదానందాన్నిచ్చింది. కొద్దిరోజులుగా



ఆవిడ ఆరోగ్యం అంత బాగుండటంలా. కీళ్ళనొప్పులతో బాధపడుతోంది. దసరా సెలవులకు కరుణ ఇంటిపట్టునే ఉన్నా చదువు ఆఖరి సంవత్సరంలో వున్నది. దాన్ని తన అపసోపాలతో విసిగించడం

దేనికిలే అని ఇంటిపనులు ఎలాగో నెట్టుకు వస్తోందిగాని నీరసంగానే వుంటోంది. అరుణ రాకతోటే సగం బాధ మాయమయినట్లయింది.

"ఏంటమ్మా! మరీ చిక్కిపోయినట్లున్నావ్? నాకో ఉత్తరమన్నా రాశావు కాదు" బాధగా అన్నది అరుణ.

"ఉత్తరాలు రాసి దూరంగా వున్న వాళ్ళనందరినీ బాధ పెట్టడానికి ఏమంత ముంచుకుపోయిందే? పాత రోగమే. కీళ్ళనొప్పులు. కాస్త బలహీనత వస్తే బయటేస్తుంది. అదే సర్దుకొంటుందిలే అని వూరుకున్నాం" అతి సాధారణంగా అన్నది సీతమ్మ.

"మంచిపని చేసావ్. నీకుతోచకపోతే నాన్నైనా ఎలా వూరుకున్నారు?"

"మీ నాన్నకెక్కడతీరుబాటుంటోందే. ఆ ట్యుటోరియల్ కాలేజి ఉద్యోగంతో వుయ్యూరుచుట్టూతిరగటమే సరిపోతోంది. నా సంగతి సరేలే. ఏమిటి నీవుకాస్త చిక్కినట్లే అనిపిస్తున్నావ్?"

"నీ కళ్ళకు అలాగే అనిపిస్తుందిలే. ఏమే కరుణా ... ఇప్పుడన్నా నీవు అమ్మకు కాస్త పనిలో సాయం చేయ గూడదటే" చెల్లెల్ని మందలింపుగా అన్నది.

"అమ్మ ఎందుకో వూరికూరికే విసుక్కుంటోందనుకున్నాను గాని అమ్మకు వంట్లో బాగుండటం లేదని నాకు తెలియదక్కా. నేనొచ్చి ఓ వారం కూడా కాలా" సంజాయిషీ ఇచ్చింది కరుణ.

"నీవు వచ్చావుగా. కాస్త విశ్రాంతి దొరుకుతుంది. అదే తగ్గిపోతుందిలే" అని తల్లి వద్దంటున్నా వినక డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళింది అరుణ. మామూలు వాతపు నొప్పులేనని ఇంజక్షన్ చేసి ఏవో బిళ్ళలిచ్చారు. నాలుగు రోజులపాటు రోజూ వచ్చి ఇంజక్షన్ చేయించుకోవాలన్నారు.

రెండు రోజులకే సీతమ్మకు నొప్పులు తగ్గాయి.

"ఈ కాస్త భాగ్యానికి నీవు అంతగా ఎందుకుబాధపడినట్లమ్మా. వెంటనేడాక్టరుకి చూపించుకొనుంటే ఈ అనవసరపు హైరానా వుండేది కాదుగదా!"

"ఏమోనే అరుణా! వయస్సు మీద బడుతోంది. ఏనొప్పులూ రాకుండా ఎలా వుంటాయి. ప్రతిదానికీ మందులంటూ ఎక్కడ కూర్చుంటాం. వస్తుంటాయ్ పోతుంటాయ్"

ఆ నైరాశ్యమే అరుణకు మంట. నిండా యాభైయ్యేళ్ళు లేవు. పెద్దతనం వచ్చేసింది, ఇంకేం చేయలేమన్న నిస్పృహ.

"యాభై సంవత్సరాలంటే ఎంత వయస్సమ్మా. నీ ఆరోగ్యాన్ని గూర్చి నీవు సరైన జాగ్రత్తలు తీసుకుంటే ఇంకో ఇరవయి సంవత్సరాలు ఢోకా లేకుండా ఆరోగ్యంగానే వుండగలవు" అంది అరుణ.

అరుణ పెనమకూరు వచ్చాక శారదను కలిసినా యోగక్షేమాలు తెలుసుకోవడం తప్ప మనసువిప్పి మాట్లాడుకున్నది లేదు. ఇంటివద్దే సరిపోయింది, కొద్దిరోజులలో అమెరికా వెళ్ళబోతున్న శారదకు బిజీ ఎంగేజిమెంట్స్.

ఆరోజు సాయంత్రం స్నేహితురాళ్ళిద్దరూ అవకాశం కల్పించుకొని తీరుబాటుగా పెరట్లో చెట్లమధ్య కిందనే కూర్చొని కబుర్లలో పడ్డారు. వాతావరణం చల్లగా హాయిగావుంది. అరుణ మనస్సు కూడా ప్రశాంతంగా హాయిగా వున్నది. తన అత్తవారింట్లో ఇంతకంటే పొందిగ్గా అందంగా పెంచబడిన పూలమొక్కల మధ్య కూర్చున్నా ఒక్కోసారి మనస్సు కెంతో చికాకుగా వూపిరి సలపనట్లు




అనిపించేది. మనిషి సుఖ సంతోషాలకు బాహ్య పరిస్థితులతోపాటు మానసికమైన తృప్తి చాలా అవసరం.

అమెరికా వెళ్ళే సందర్భంగా చేసుకుంటున్న ఏర్పాట్లు, కొనుక్కుంటున్న చీరెలు సారెలు వగైరా చెప్పుకుపోతోంది శారద ఫుల్‌స్టాప్ లేకుండా.

''మనదేశాన్ని, తల్లిదండ్రులను, తోడబుట్టినవాళ్ళను - అందర్నీ వదిలి అమెరికా వెళ్ళిపోవడం అంత సంతోషాన్నిస్తోందా శారదా?'' అరుణ నవ్వుతూనే అడిగింది.

చదువుకున్న ప్రతిఒక్కరూ అవకాశం దొరికితే చాలు అమెరికాలో రెక్కలు గట్టుకు వాలాలని, అక్కడ సంచులతో డబ్బులు కూడబెట్టుకోవచ్చని తహతహలాడుతున్న ఈరోజుల్లో అదేం ప్రశ్న అనుకుంది శారద!

''ఏమే అలా అడుగుతున్నావ్? విదేశాలకు వెళ్ళడమంటే థ్రిల్లింగేగదా! అందునా సంపన్న దేశం, సకల సౌకర్యాలూ సమకూర్చగల దేశం అది. అమెరికాను భూలోక స్వర్గమే అంటారు గదా!''

"ఏమోనే! పత్రికల్లో చదవేదాన్నిబట్టి అంత భూతలస్వర్గంలా ఏమీఅనిపించదు. అక్కడా దరిద్రం, నిరుద్యోగం, భద్రతా రాహిత్యం అన్నీ వున్నాయంటున్నారు. జీవన పోరాటంలో ఉరుకులు పరుగులు పెడుతుంటారు''

"ఆడా మగాఅందరూ ఎవరిపనుల్లోవారు వాయువేగంతో పరుగులు తీస్తుంటారట. ఆ మాట నిజమేనటకాని, అక్కడ ఇక్కడ మనకిమల్లే ఊడుపులు కడుగుళ్ళు, వంటా గింటా ఇటువంటి బాధలేమీవుండవుట. ఆ దేశంలోవారి నిరుద్యోగంతో మనకేమిటి? మనపని మనది" అంది శారద సమర్థించుకుంటూ.

"అదికాదే! మరీ ఆర్థిక పరిస్థితి బాగుండనివాళ్ళు ఏ దేశమయితే ఏమిటి? ముందు మన పరిస్థితి బాగుపడాలి అని ఆలోచించడం సబబేగాని మన దేశాన్ని వదిలిపోవాల్సిన పరిస్థితి మీకేమిస్తే? శ్రీవారు డాక్టరు. వెనుక కావలసినంత స్థిరాస్థి.మనదేశంలోనే ప్రాక్టీసు పెట్టుకొని మనవాళ్ళకే వైద్యం చేయచ్చుగదా? అందునా డాక్టరు వృత్తిరోగం నయమయినప్పుడు రోగి ముఖంలో కనుపించేతృప్తి. డాక్టరు బాబు దేవుడు అని మన్నించే పరిస్థితి అక్కడుంటుందా?"

"డాక్టరుగా ప్రాక్టీసు పెరగడం, నిలదొక్కుకోవడం నీవనుకున్నంత సులువు కాదే బాబూ... చాలా రిస్కు తీసుకోవాలి. అక్కడ ఇలాంటి చికాకులేమీవుండవు"

"రిస్కు తీసుకున్నా మనదేశం, మన ప్రజలు, మన సమాజం-మంచైనా చెడ్డైనా మనవాళ్ళ మధ్య అది తృప్తికదా! డబ్బు సంపాదన మినహా అక్కడ మనకు గుర్తింపేముంటుంది? మనం ఎవరమో ఏమిటో మంచీచెడూ ఎవరిక్కావాలి?"

"అక్కడకు వెళ్ళిన వాళ్ళంతా అక్కడి జీవితం అద్భుతం, రంగులకలల అంటున్నారు గదా! అదీ చూద్దాం. కాకుంటే అప్పుడే తిరిగి వచ్చేసెయ్యొచ్చు. కాని అమెరికా వెళ్ళి తిరిగి వస్తున్నవాళ్ళె వళ్ళా కనపడ్డంలా? ఇంకసరేగాని అమెరికా టాపిక్కు వదిలేసి నీకబుర్లేమిటి చెప్పు? ఇంతవరకూ మనకి మనసు విప్పి మాట్లాడుకోవడానికే కుదర్లేదు"

"ఏమున్నాయే కబుర్లు ప్రత్యేకం నీకు చెప్పడానికి? ఏ వుద్యోగమో చేస్తుంటే

అందులోని సాధక బాధకాలు, మంచి చెడ్డలూ చెప్పచ్చు. ఇప్పుడేమున్నాయే చెప్పడానికి? తిండి, నిద్ర, కాలం గడవక అవస్థ పడడం - యాంత్రిక జీవనమై పోయింది. ఏమైనా మనిషి పరిపూర్ణ ఆరోగ్య వికాసాలతో కాలం గడపాలంటే ఒక నిర్దిష్టమైన అభిరుచి కలిగిన ఏదో వ్యాపకం వుండాలే బాబూ. కాలం గడవక పోవడాన్ని మించిన శాపం మనిషికి ఇంకేమీ వుండదేమో. మనం చదువు కున్న రోజులే జీవితం మొత్తానికి అపు రూపమైనవే"

"సరేగానీ మన క్లాస్‌మేట్ లావణ్య కథానాయిక అయిపోయింది తెలుసా?"

"ఏం చేసిందిట. ఆమధ్య ఓసారి నేను విజయవాడ వెళితే సిటీబస్సులో కలిసింది. బి.ఇడి. ట్రైనింగై ఏదో స్కూల్లో వర్క్ చేస్తున్నానని చెప్పింది"

"లావణ్య పనిచేస్తున్న స్కూల్లోనే ఇంకో తెలుగు పండిట్ ముస్లిమ్ యువ కుడు-ఇద్దరి మధ్యా పరిచయాలు పెరిగి వివాహం చేసేసుకున్నారు"

"అచ్చా...మంచి పనిచేసింది. చదువు కునే రోజుల్లోకూడా చాలా చొరవగానూ, ధైర్యంగానూ వుండేది"

"తను చేసింది మంచిపనేనంటావా?" కళ్ళు పెద్దవి చేస్తూ అన్నది శారద.

"మంచికాక ఏమిటే. ఇద్దరూ చదువు కున్నవాళ్ళు. తమకాళ్ళపై తాము నిల బడ్డారు. ఒకరికొకరు నచ్చారు. ఇంతకు మించి ఇంకేం కావాలి? తల్లిదండ్రులు కట్నకానుకలు సమకూర్చలేక అమ్మా, నాన్న ఇంకా నా పెండ్లిని గురించి ఆలో చించటం లేదసుకొంటూ బాధపడుతూ పుసూరుమంటూ కాలం గడపాలా?"

ఉద్రేకంగా అన్నది అరుణ.

"ఏమోనే బాబూ! నీ అంత ప్రోగ్రె సివ్‌గా నేనాలోచించలేనే. మన ఆలోచనలు, అలవాట్లు, సంస్కృతి అన్నీ భిన్నంగా వుంటాయి. ఇతర మతస్థులతో జీవితంలో పాలూనీళ్ళలా కలవాలంటే సులువేనా అని?"

"ఏమే! ఒకే మతస్థులు, తమ కులస్థుల లోనే వివాహాలు చేసుకుంటున్న వాళ్ళంతా పాలూ నీళ్ళలా కలిసిపోతున్నారా? బతికి నంతకాలం తన్నుకు చస్తున్న వాళ్ళ నెందర్ని చూడటం లేదూ! అయినా ఇద్దరూ డిగ్రీలు పుచ్చుకున్న వాళ్ళు. ఒక రితో ఒకరు సర్దుబాటు చేసుకోలేకపోతే ఎందుకీ చదువులు? అందుకే డాక్టర్లు, ఇంజనీర్లు, పి.హెచ్.డి.లు సైతం పెళ్ళి కోసరం అమ్మానాన్నల వంక చూడటం"

"మనమిద్దరం స్నేహితులం కావ డమే విడ్డూరం అరుణా! మన ఇద్దరి ఆలోచనా ధోరణులూ ఉత్తర దక్షిణ ధృవాలు. సరేగాని ఇంతకూ నీవు మీ ఇంటి వ్యవహారాలు చెప్పావు కాదు. మొదటావిడ నీ పట్ల ఎలా వుంటుంది? నిన్ను ఆగర్భ శత్రువులా చూడదుగదా!"

"అబ్బే, అలాంటిదేంలేదే. ఆవిడ స్వత హాగా మంచి మనిషేనే. కానీ ఆవిడస్థానంలో మనం వుంటే ఏం చేస్తాం అని ఆలోచిస్తే ఆవిడ బాధ అర్థమవుతుందే. న్యాయంగా పూర్తిగా తనకు దక్కాల్సిన స్థానాన్ని ఇంకొకరితో పంచుకోవాలంటే కష్టమే గదా! ఏమైనా సంధికాలంలో వున్నాం. ఇద్దరం సర్దుకుపోగలం" ధైర్యంగా అన్నది అరుణ.

"ఏమైనా నీది ప్రత్యేకమైన మన స్తత్వమే అరుణా. శ్రీమంతుల ఇంటిని మెట్టినా మెడలో ఆ మాంగల్యం మినహా పెండ్లికి ముందు ఎలావున్నావో ఇప్పుడూ





"అలానే వున్నావు ఏ ఆభరణాలు లేకుండా. అప్పటి వాయిల్ చీరలే" అరుణను పరిశీలనగా చూస్తూ అన్నది శారద.

"ఏమే! నన్ను కూడా ఓ మోపెడు నగలు తగిలించుకోమంటావా ఏమిటి కొంపతీసి" నవ్వుతూ అంది అరుణ.

"వుండవే...నీ హాస్యాలూ నీవూను. ఈ వూరిలో ఇంకా ఎన్నాళ్లుంటావ్?"

"ఇంకో నాలుగయిదు రోజులకంటే ఎక్కువ వుండనే"

"నా అమెరికా ప్రయాణం ఇంకోనెల వున్నది. అప్పటివరకూ వుండవన్న మాట. అయితే నే వెళ్ళేముందు లెటర్సు రాస్తాను. అప్పుడు రావే. మచిలీపట్నం నుండి ఇక్కడకు రావడం ఎంత భాగ్యం గనుక. మరలా మనం ఎన్నాళ్ళకు కలుసుకుంటామో?"

"రావడానికి ప్రయత్నం చేస్తానే. వచ్చే నెలలో మా ఇంటి దగ్గర్లోనే ఓ స్కూల్లో టీచరుగా చేరబోతున్నా"

"ఓసి పిడుగా. శ్రీవారొప్పుకున్నారటే?"

"ఏం! ఎందుకొప్పుకోరూ? వుద్యోగం చేయడం తప్పా?"

"తప్పనికాదే బాబూ! ప్రయివేటు స్కూలు వాళ్లు జీతాలేమిస్తారు? రెండొందలిచ్చేరు...కాకపోతే మూడొందలు. అందుకోసరం వెట్టిచాకిరీ చేయాలిగదా?"

"అదీ చూద్దాం ఎలా వుంటుందో. చీకటి పడిపోయిందే ఇంకవస్తాను. నీవు అమెరికా వెళ్లాక మాత్రం అక్కడి విశేషాలతో ఉత్తరాలు రాయాలమ్మాయ్" అంటూ స్నేహితురాళ్ళిద్దరూ ఒకరి చేయి ఒకరు పుచ్చుకొని లేచారు.

అరుణ ఇంటి ముఖం పట్టింది.

* * *

భర్త నుండి వుత్తరం వచ్చింది అరుణకు – లక్ష్మి రమను తీసుకొని తన పుట్టింటికి వెళ్లాలనుకుంటోందనీ, అరుణను వెంటనే రమ్మనీనూ.

అరుణ వున్న వారంరోజులూ కరుణకెంతో హాయిగా వుంది. తనకిష్టమయిన పిండివంటలుచేసి పెడుతుంది. అమ్మలాగా చిర్రుబుర్రులాడదు. ఇంటి వాతావరణమే మారిపోయినట్లయింది.

"అక్కా! నీవింకో నాలుగు రోజులుండవే. అప్పటికి నా సెలవులు కూడా అయిపోతాయి. అమ్మ పూర్తిగా కోలుకుంటుంది. మందూమాకూ కంటే నువ్వు కళ్ళముందు తిరుగుతుంటేనే అమ్మరోగం కాస్తా మంత్రం వేసినట్లు తక్కున మాయమయింది" అంది.

అరుణ నవ్వింది.

"ఏమే అక్కా...వుండవా?"

"ఇంకో రెండు రోజులుంటాన్లేవే. అమ్మేదే రమా? ఏం చేస్తోంది?"

"నాన్న నీళ్లు తెచ్చిపోస్తుంటే అమ్మ తొట్టె బిందెలపై కడిగి పెడుతున్నట్లుంది దొడ్లో"

"ఆ ట్యుటోరియల్ కాలేజీ పనికి తోడు ఈ ఇంటి చాకిరీ గూడాను. ఇంటి ముందు పంపు వేయించుకుంటే ఈ నీటి మోత తప్పుతుంది."

నీళ్ళ పని అయిపోవడంతో వంటికి పట్టిన చమట తుడుచుకొంటూ కూతుళ్లున్న దగ్గరకే వచ్చారు రాఘవయ్య, సీతమ్మ. అరుణ కూర్చున్న మంచంపైనే వెనకగా కాసేపు పడుకున్నాడు రాఘవయ్య అలసట తీర్చుకోవడానికన్నట్లు. ఎదురుగా గడప మీద కూర్చున్నది సీతమ్మ.

"పెన్షనూ, చేలో తిండిగింజలూ

పస్తున్నాయి. నువ్వు ట్యుటోరియల్ కాలేజీలో ఆ హెచ్చీవద్యకు చేయకపోతే ఇల్లు గడవదంటావా నాన్నా?" అరుణ గొంతులో బాధ.

"ధరలు చుక్కల్ని చూస్తున్న ఈ రోజుల్లో పెన్షను నాలుగు వందలు ఏ మూలకొస్తాయే! సుధ చదువు పూర్తయి లక్షణను ఓ ఇంటిదాన్ని చేసేంతవరకు తప్పదు. ఆ తరువాత ఇంక మనిష్టం. ఓపికుంటే చెయ్యడం, లేకుంటే ఏదో చదువుకుంటూ విశ్రాంతిగా గడిపెయ్యొచ్చు"

"మీలో ఇంత పనిచేసే ఓపిక లేదు. చీకూచింతా లేకుండా విశ్రాంతి తీసుకొంటూ కాలం గడపండని ప్రభుత్వం వారు రిటైర్ చేస్తే వాస్తవంగా జరుగుతోందేమిటి? ప్రయివేటు యాజమాన్యాల కింద అంతకు ముందుకంటే రెట్టింపు చాకిరీ. ఏం బతుకులో?"

"ఈ స్కూల్లో చేరాక మీ నాన్న ఆరోగ్యం కూడా ఇదివరకటిలా లేదు. దగ్గొకటి పట్టుకున్నది" నెమ్మదిగా అన్నది సీతమ్మ.

"ఈ చాకిరీకి తోడు పౌనుపంటూ నిద్ర కూడా పాలవీ తగ్గించకమ్మా. సుధ చదువు ఇంకెన్నాళ్ళలే. ఓ సంవత్సరం"

"అరుణా! నాకంటే తప్పదు. నీ కేంపట్టిందమ్మా ఆ కాన్వెంటుద్యోగం?"

"నాదేముందిలే నాన్నా. కాలక్షేపం కోసం. కష్టమనిపిస్తే మానేస్తాను"

"సరే నీ ఇష్టం. కరుణా... రేడియో పెట్టమ్మా! ప్రాంతీయ వార్తల టైమయింది" మంచం మీద నుండి లేస్తూ అన్నాడు రాఘవయ్య.

వంటింట్లోకి దారితీసింది సీతమ్మ.

* * *

అరుణ పట్ల తనకంత అనుకూలత లేకపోయినా పదిరోజులు అరుణ లేకపోయేసరికి లక్ష్మికేమిటో ఇంట్లో వెలితిగానే అనిపించింది - తోడుగా రమ వున్నప్పటికీ.

నిజానికి అరుణ రాక లక్ష్మికి తెలియకుండానే ఆమె మనసులో ఆనంద కెరటాన్ని రేపింది. తాను అరుణకు ఎంత దూరంగా వుండాలని ప్రయత్నించినా అరుణ తన నిర్మలమైన సరళ స్వభావంతో ఆకట్టుకుంటోంది. ఆలోచనల్లో పడిపోయింది లక్ష్మి.

పనిపిల్ల భాగ్యానికి అరుణంటే వల్లమాలిన అపేక్ష. ఓరోజంతా అరుణ వెనుకాలే తిరిగింది.

అరుణ వచ్చిన రెండు రోజులకి రమకు సెలవులు అయిపోవడంతో రమను వాళ్ళింటికి పంపినట్లూ వుంటుంది, తమ పుట్టింటికి వెళ్ళి చాలా రోజులైంది వాళ్ళను చూసినట్లూ వుంటుందని బయలుదేరింది లక్ష్మి.

గేటువరకూ సాగనంపింది అరుణ.

"త్వరగా వచ్చేసెయ్యండక్కా. ఇంత పెద్ద ఇంట్లో నాకొక్కర్తెకూ ఏమీ తోచుపోదు" నెమ్మదిగా అన్నది అరుణ.

లక్ష్మి, రమ కారెక్కారు. అరుణ, శేఖర్ లు వెనుతిరిగారు.

"నాకంటే నీకు లక్ష్మి అపురూపమనుకుంటాను అరుణా" నవ్వుతూ అన్నాడు శేఖర్.

"ఏం ... మేమిద్దరం ఎప్పుడూ దెబ్బలాడుకొంటుంటే తగువు పెద్దది చేసి, ఒకరి వకాల్తా పుచ్చుకోవాలనుందా?" వ్యంగ్యంగా అన్నది అరుణ.

"ఓ...నీకూ జోక్సు విసరడం తెలుసన్నమాట. ఒట్టి బుద్ధావతారానివి





మాత్రమే అనుకొంటున్నాను ఇప్పటి వరకూ"

"అక్క నాకెప్పటికీ అప్పురాలే. అక్కకు నావలన కలిగిన హాని ఏం చేసీ సరిచెయ్యలేనిది" బాధతో అన్నది అరుణ.

కాసేపలా మౌనంగా ఆలోచనలో పడిపోయింది. ఎంతకాలం గడిచినా అరుణ శేఖర్‌పై అనురాగాన్ని పెంచుకోలేకపోతోంది. మనసా వాచా తననే నమ్ముకున్న లక్ష్మి కష్టం సుఖం ఏమీ ఆలోచించకుండా కేవలం బిడ్డల కోసం మళ్ళీ పెళ్ళికి తయారుకావడం ఎంత అమానుషం. అతని పట్ల తనకు గల ఈ భావాన్ని ఎంతగా పోగొట్టుకోవాలని చూసినా అప్పుడప్పుడూ మనస్సులో బుస్సుమంటూనే వుంటుంది. బిడ్డలు లేకపోతే ఏం మునిగిపోయింది. లోకం గొడ్డుబోయిందా? ఎన్ని వ్యాపకాలు లేవు? ఓమంచి పని కోసం తన శక్తియుక్తులను, ధనాన్ని వెచ్చించటంలో ఎంత తృప్తిని పొందచ్చు. అందరూ ఆడపిల్లలే పుడితే ఆ నెపం భార్య మీద వేసి భార్యను వేధించి చంపే మూర్ఖశిఖామణులున్న పుణ్యభూమి ఇది. ఒకవేళ తనకీ బిడ్డలు కలక్కపోతే...? పనికిమాలిన ఆలోచన! తనూ సృష్టికి ఓ ప్రాణిని తోడు చేయబోతున్న లక్షణాలు కనపడుతున్నాయ్. చాకలి అప్పుడే మొదలెట్టింది "అమ్మాయి గారూ...నాకు మంచి జరీ చీరె పెట్టాలె"

"నోర్మూయ్యవే" అన్నదరుణ అప్పుడు.కానీ ఈ సంగతి లక్ష్మక్కకింకా తెలియదు. శేఖర్‌ని కాస్త ఏడ్పించాలని పించింది.

"ఒకవేళ నాకు పిల్లలు పుట్టకపోతే ఇంకో చక్కని కన్నెపిల్లను నన్నే వెతకమంటారా?" భర్తవంక ఓరగా చూస్తూ అన్నది అరుణ.

ముఖం గంటు పెట్టుకొని మరోమాట లేకుండా అక్కడినుండి వెళ్ళిపోయాడు శేఖర్.

తాను తప్పుగా మాట్లాడిందా! అయినా ఈమాత్రం చురకలంటించడం పెద్ద తప్పేం కాదులే అనుకొంటూ ఆలోచనలో పడిన అరుణ కళ్ళు మూసుకొని అలా కుర్చీలో కూర్చుండిపోయింది.

ఓ కప్పు శేఖర్‌కిచ్చి రెండోకప్పుతో అరుణ దగ్గరకొచ్చింది భాగ్యం. కప్పు అరుణ చేతికందించి పక్కనే కింద చతికిలబడింది.

ఏదో చెప్పాలనుకున్నట్లుంది. నీళ్లు నములుతూ తటపటాయిస్తోంది.

"నువ్వూ టీ తెచ్చుకోకపోయావటే భాగ్యం. అక్కయ్యావాళ్ళు లేరుగదా!పాలు మిగిలిపోతాయి"

"ఒద్దులేగండమ్మగారూ. నేనెప్పుడూ ఈణ్నే వుంటానా? ఈడ అలవాటైతే ఆపైన ఏంగావాల?"

"ఏమే! నీకెప్పుడూ ఇక్కణ్నే వుండాలనుందేమిటి?"

"వుంటే మాత్రం ఎట్టాకుదురిద్దిలెండమ్మగోరూ?"

"ఏమంట"

"మా మావ విజయవాడలో రిషాలాక్కొంటుంటాడు. ఆడికి నన్ను మనువియ్యాలని" పమిట కొంగు వేలుకి ముడేసుకొంటూ సిగ్గుపడిపోయింది భాగ్యం.

అమాయకమైన ముఖంలో అంతులేని ఆనందం.

"కోరుకున్న మొగుడు. అదృష్టపంతురాలివే భాగ్యం"



"అమ్మగోరూ! మీరూ చదువుకున్నారే గందా! రమమ్మగారు మీకంటే ఎక్కువ చదుంకున్నారా? ఆ మిడిసిపాటేటమ్మగోరూ. నేను కూసింతసేపు తీరిగ్గా అగపడితే చాలు ఏదో పనెట్టేపోరు. ఆమెగోరికాడ ఎవరు పన్జేత్తారోగాని అల్లపనిగోయిందా. మినస్లో చెరకుపిప్పే"

"ఏమేవ్... ఈ చాడీలు ఎప్పటినుండి మొదలెట్టావ్" భాగ్యం నోటికి బ్రేక్ వేసింది అరుణ.

"చాడీలు కాదండమ్మగోరూ! నిన్నమాటే అది" లచ్చపమ్మగారు ఎప్పుడన్నా తిట్టినా గాని ఎట్టా పెడతారు? తిని లేవనగూడదమ్మగోరూ నా అదృష్టం ఇద్దరమ్మగోర్లూ మంచోరవటం. మూత్తం దాగదమ్మా మా పనోళ్ళపాట్లు. రగత మాంసాలు పిండుకోవాలనుకునేవారే ఎక్కువ"

"ఇంక చాల్లే నీకబుర్లు. ఈ కప్పు తీసుకెళ్ళి అయ్యగారేం చేస్తున్నారో చూసి అంట్లుబయట వేసుకో"

ఖాళీగా కూర్చున్న అరుణ బుర్రలో ఏవేవో ఆలోచనలను రేపెట్టి వెళ్ళింది భాగ్యం.

దేశ ప్రజల్లో మండుటెండల్లో సైతం రోడ్లమీద తారుపోస్తూ, మట్టిపనిచేస్తూ, ముక్క రాయికొడుతూ రక్త మాంసాలు కరిగించుకున్నా కడుపు నిండని అభాగ్యజీవులు, ఏపూట పని లేకపోతే ఆపూటే పస్తులుండే గర్భ దరిద్రులు కోకొల్లలు. చాలీచాలని జీతాల వాళ్ళు, ఆరుగాలం పనిచేసినా పంట చేతికొచ్చేసరికి ఏ వానదేవుడు గాలిదేవుడు ముంచేస్తాడో అన్న భయం. అదీ గట్టెక్కితే చేతికొచ్చిన పంటకు ధర వుండదు. పెట్టుబడికోసరం చేసిన అప్పుల బాధ - ఇచ్చి పోను వచ్చే ఆదాయం గొర్రెతో



బత్తెడు సామెత. అయినా తాము సుఖంగానే బతుకుతున్నట్లు ఇతరులకు కనిపించాలనే భేషజాలతో మానసికంగా బాధపడే మధ్యరకం జీవులు మరికొందరు. ఇదెక్కడి సాంఘిక న్యాయం? ఏ కష్టం చెయ్యనివాడు పట్టు పరుపుల మీద సకల సౌకర్యాలు అనుభవించడం, ఆరుగాలం కష్టించేవాడు పస్తుండటం ఇంతకుమించిన అనాగరికత, అసభ్యత ఇంకేముంటుంది? మనుషులను వాజమ్మలుగా తయారుచేసే ఖర్మసిద్ధాంతం నుండి బయటపడి ఈ భూమిమీద పుట్టిన ప్రతిజీవీ సుఖంగా బతికేదీ, ప్రకృతి సంపద యావత్తూ ప్రజలందరికీ దక్కేదీ ఎన్నడో? తను మాత్రం ఏం నిర్వాకంచేసింది? కుటుంబ పరిస్థితనో ఇంకోటనో జీవితంతో రాజీ పడిపోయింది తప్ప జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కొని తను కోరుకున్న పద్ధతిలో జీవించగలిగిందా?

పెదవులపైన నిర్లిప్తతతో కూడిన ఓ చిరునవ్వు వెలిగింది.

* * *

ముద్ద ముద్దగా ఏదో మాట్లాడుతూ తూలి పోతున్న చక్రధర్ని డ్రైవరు బలవంతాన పట్టుకొని అతి ప్రయాసతో లోపలికి తీసుకొచ్చాడు.

పాలేరు వెంకన్న కారులో నుండి బుడ్లు, సిగరెట్ పాకెట్లు తెచ్చి లోపల పెడుతున్నాడు. అన్నపూర్ణ మజ్జిగ గ్లాసుతో భర్త గదిలోకెళ్ళింది.

హాలులో ఆడుకొంటున్న అయిదేళ్ళ మధు, మూడేళ్ళ అపర్ణ బితుకు బితుకు మంటూ అత్త లక్ష్మి వడిలో చేరారు. అప్పుడే స్నానం ముగించి లోపలికొచ్చిన సుభద్రమ్మ కూతురు లక్ష్మి పక్కనే కూర్చొని "ఒసేవ్ అపర్ణా.... మధూ మీ ఇద్దరిలో నా కుంకుమ భరిణా, అద్దం ఎవ్వరు తెచ్చిపెడతారో వాళ్ళు బంగారు కొండలు" అంది.

నాయనమ్మ నోటిలో మాట నోటిలో వుండగానే అత్త వడినుండి మధు రివ్వున తూనీగలా దూసుకుపోయాడు. అపర్ణ పరుగెడుతున్న తమ్ముణ్ణి చూస్తూ అలా నిలబడిపోయింది.

"ఒరేయ్ బాబూ. పరుగెట్టకు...పడిపో తావ్. నెమ్మదిగానే వెళ్ళి తీసుకురా. వాడు నిజంగా బంగారమేనే! ఇది వున్నది చూడు-వట్టిముంగి. అన్నీ అమ్మ బుద్ధులే" పమిట కొంగుతో చెవుల్లోని తడి తుడుచు కొంటూ అన్నది సుభద్రమ్మ.

"ఈ చాల్లే వూరుకోఅమ్మా. ఎవ్వరైనా వింటే నవ్విపోతారు. మన చక్రి చేష్టలకు అన్నపూర్ణ గాబట్టిగాని మరొకరైతే ఎంత యాగీ చేసేదో? వాడేడిపించేదిగాక నువ్వా సూటిపోటీలంటుంటే, మనిషి కిక ఓదార్పు లభించేదెక్కడా? మరీ బరి తెగించినట్లున్నాడు. ఇంతకుముందు ఇంటిలోనే తప్ప ఇంత పబ్లిగ్గా లేదు కదూ!"

"అనండే తల్లీ... అందరూ నన్నే అనండి. బిడ్డల్ని కన్నాంగాని ఆళ్ళ రాతల్ని కననేదుగా?వాడేమంచాడైతే ఇంత మందితో ఇన్ని మాటలు పడే గ్రహచారం నాకేమిటి?" ముక్కు చీదేసింది సుభద్రమ్మ.

"ఇప్పుడు నేనేమన్నానమ్మా! వాడూ ఇంటిపటున సరిగ్గా వుండక, మనమూ తనను కాస్త మన మనిషిగా చూడకపోతే తనేమైపోతుంది"

"ఏమిటోగాని వాడిని ఏ పెద్దమ్మోరు పట్టుకొని ఏడిపిస్తోందో? మరీ విచ్చల విడైపోయింది. పంట చేతికి రావడం




ఆలస్యం. అందినంత వరకు పట్టుకొని వెళ్ళిపోవడం, అవి కాసినీ అయిపోయాకే ఇంటిముఖం చూడడం. రైసు మిలు ఆదాయం పుణ్యమా అని ఈ ఇంటిగుట్టు రట్టుగాకుండా వుంటోంది. మీ నాన్న దారి వేరు. ఆయనకేవ్యసనాలున్నా వ్యాపారం అశ్రద్ధ చెయ్యరు. పీడికేమీ పట్టదు. పేకాట, తాగటం, తగలెయ్యడం"

"అత్తా! నాన్న అమ్మను కొడతాడు గూడా" అత్తా, నానమ్మల సంభాషణ ఆ పసిమనసుకు ఏమర్థమయిందో తనూ గొంతు కలిపింది అపర్ణ. కుంకుమ భరిణ, అద్దం తీసుకొచ్చిన మధు అద్దంలో తన ముఖం చూసుకొంటూ నిలబడ్డాడు.

"ఆ తండ్రీ తాతల నడతను చూస్తున్న పసివాడు వీడెట్లా తయారవుతాడో" మధును ఒడిలోకి తీసుకొంటూ అన్నది లక్ష్మి.

"వాడిని నీవైనా తీసుకెడతావన్న ఆశ వుండేది. అతగాడికి ఇప్పుడు పెండ్లి కావలసొచ్చె"

ఆడలేక మద్దెల ఓడన్నట్లు తల్లి తన కొడుకు నిర్వాకానికి ఇతరుల మీద పడటం లక్ష్మికి వళ్ళు మండింది. తన భర్త, ఈ పెండ్లికి ముందర ఎప్పు డొచ్చినా వీళ్ళ తననూ ఆయన్నూ కూడా ఎంతో అపురూపంగా పువ్వుల్లో పెట్టినట్లు చూసేవాళ్ళు. అటువంటిది ఈమధ్య ఎప్పుడు నాలుగు రోజులు వుండి పోదా మని వచ్చినా ఏదో గొడవే. సూటిపోటి మాటలు. ఈ పెండ్లి మూలంగా తను కష్టాలపాలవుతానన్న బాధకంటే వీళ్ళకు తమ ఆస్తి దక్కకుండాపోతోందే అన్న దుగ్ధే ఎక్కువగా వున్నట్లున్నది. లక్ష్మి పైకి ఏమీ అనలేకపోయినా లోపల్లోపలే వుడికిపోయింది. పైకిఏమాటన్నా పోట్లాటే అవుతుంది.

"ఇంక మనం భోంచేద్దాంలే" బొట్టు సరిజేసుకొని లేస్తూ అన్నది సుభద్రమ్మ.

"అన్నపూర్ణ రాదూ?"

"ఆవిడకిప్పుడెక్కడా. ఆ వచ్చిన బాదట్లాపడి నిద్రబోతాడు. సాయంత్రం ఎప్పుడు లేస్తాడో ఏమో? అప్పటివరకూ అదంతే"

లక్ష్మి బరువుగా వూపిరి పీల్చింది. శేఖర్ మనస్సులో మెదిలాడు. ఆ పెండ్లి ఒక్కటీ తన బతుక్కి శాపం కాకపోతే ఆయనతో తానెప్పుడూ బాధపడిందిలేదు. ఆయన దినచర్య ఎంతో క్రమపద్ధతిలో వుంటుంది. ఈ సత్రవ కొంపకూ, తన ఇంటికీ ఏమైనా పోలికుందీ? తాను వచ్చి నాలుగు రోజులయింది. ఇంతవరకు తండ్రి దర్శనంకాలేదు. ఆయనేదో వ్యాపారపు లావాదేవీల్లో రాజకీయ నాయకుల చుట్టూ తిరుగుతుంటాడు.

తల్లితో భోజనానికి లేచింది లక్ష్మి. పిల్లలిద్దరూ తమ ఆటలకెళ్ళిపోయారు.

* * *

ట్యూషన్‌మాష్టారొచ్చేటయిమయిందని హోంవర్కు మొదలెట్టిన మధు పక్కనే కూర్చున్నది లక్ష్మి, వాడి రైటింగు చూస్తూ.

"సిక్సు పేజెస్ హోంవర్కు రాయాలతా ఏమనుకొంటున్నావో" కళ్ళు పెద్దవి చేస్తూ చెప్పాడు మధు.

"అమ్మయ్యో... అన్ని పేజీలే" తనూ ఆశ్చర్యం నటిస్తూ వాడిని వుబ్బేసింది లక్ష్మి.

"ఒరేయ్... అంతా ఇంగ్లీషులోనే రాస్తున్నావ్. తెలుగేదిరా?"

"ఛీ! మాకు తెలుగు చెప్పరు. అంతా ఇంగ్లీషే" దొరలా పోజు పెట్టాడువాడు.

"ఏడిసినట్టే వుంది. తెలుగు లేకుండా ఏం చదువు" నుదురు చిట్లించింది లక్ష్మి.

"అదంతే! నీకేం తెలీదు" అనేసి హోంవర్క్‌లో లీనమయ్యాడు వాడు. పసివాడి బుర్రలో సైతం తెలుగంటే చిన్న చూపు. ఇంగ్లీషు అంటే గొప్ప.

"అక్కా...రేపే ప్రయాణమంటున్నావట. ఇంకో నాలుగు రోజులుండెళ్ళచ్చుగా." క్రాపు దువ్వుకొంటూ లక్ష్మి దగ్గర కొచ్చాడు చక్రధర్.

"వచ్చి వారంపైనయ్యింది. వెళ్లాలిరా"

"ఏం ఇంటి దగ్గర బావగారు ఎదురు చూస్తుంటారా?"

ఆ పలికే తీరులో వ్యంగ్యంవున్నట్లనిపించింది లక్ష్మికి.

"నీకు లాగా ఇల్లు పట్టకుండా తిరగడానికి అందరికీ కుదరద్దా" పెడసరంగా అంది లక్ష్మి.

తన పని పేరు. లౌక్యం ఉపయోగించకపోతే వ్యవహారం బెడిసి కొట్టేట్లుందనుకున్నాడు చక్రధర్.

"నువ్వొచ్చిన దగ్గరి నుండీ నేనింటి దగ్గరే లేను గదక్కా! అందరం కలిసి నాలుగు రోజులుండచ్చుగదాని"

"నేనుంటే మాత్రం నీకు ఇంటి పట్టున వుండటానికి తీరుతుందటరే... బయట ఎన్ని రాచకార్యాలు? అయినా నేను వెళ్ళిపోవాలి" పొడిగా అన్నది లక్ష్మి.

ఇంక అసలు విషయం ప్రస్తావించాడు చక్రధర్.

"తప్పనిసరిగా నాకో పదివేలు కావాలక్కయ్యా. బావగారి దగ్గర వుండకపోతాయా? అరటి గెలలు పొందాను మార్కెట్టుకి తోలంగానే మీ డబ్బు మీకు అణా పైసలతో తెచ్చిస్తాను"

"డబ్బు గొడవలు నాకు పెట్టద్దురా. మీ బావను నువ్వే అడుగు"

అక్క మధ్యవర్తిత్వం లేకుండా తను నేరుగా బావనడిగి ప్రయోజనం వుండదని చక్రధర్‌కి తెలుసు. ఉక్రోషం ముంచుకొచ్చిందతనికి. దాంతో అవసరం కోసరం తగిలించుకున్న ఆప్యాయత ముసుగుని తొలగించేశాడు.

"పిల్లా పీచూ లేకుండానే ఇంత పిసినిగొట్టులా అయ్యావ్. ఇంక వాళ్లుకూడా వుంటే ఓ పూట భోజనమైనా పెట్టవేమో" అంటూ వెనుతిరిగాడు చక్రధర్.

గుడ్లనీరు గక్కుకున్నది లక్ష్మి.

ఏ రక్తస్పర్శా లేకపోయినా ఆ అరుణ పిళ్ళకన్నా ఎంత నయం అనుకుని ఆ సాయంత్రమే ఇంటికి ప్రయాణమైంది.

* * *

శేఖర్ ఇంటివద్ద వున్నప్పుడు కూడా అరుణ ఏవో పనులు కల్పించుకొని తన వ్యాపకంలో తానుండేది. లక్ష్మి వున్నప్పుడయితే మరీ తొలిరోజుల్లో అరుణ శేఖరున్న ప్రాంతాలకు వెళ్ళడానికే తానేదో తప్పు చేస్తున్నదానిలా జంకేది. కాలం గడిచేకొద్దీ లక్ష్మి పూర్వం లాగానే శేఖర్ అవసరాలు చూసుకోవడంతో అరుణకు తనదంటూ ప్రత్యేకమైన దినచర్య అలవాటయ్యింది.

బయటపడకపోయినా శేఖర్‌లో అరుణకు బాగా సన్నిహితం కావాలన్న కోర్కె ఉంది. కాని అటువంటి భావం వ్యక్తం చేసినపుడు అరుణ ముఖంలో కనిపించే తీవ్రత అతనిని దూరంగా నిలబెట్టేది.

లక్ష్మి లేనప్పుడైనా అరుణ తనకు





దగ్గర కావాలన్న తపన శేఖర్‌ది. లక్ష్మి ఊరెళ్ళి అప్పుడే నాలుగురోజులైపోయింది.

ఆరోజు ఆదివారం. ఓ సినిమావాళ్ళు చదువుకున్న స్త్రీలకు ప్రత్యేకంగా ఓ ప్రీవ్యూ ఏర్పాటుచేసి ఫామిలీస్‌ని ఆహ్వానించారు. ఆ ఇన్విటేషన్ అరుణకిచ్చి వెళదామన్నాడు. ఆ సినిమా చూడాలనుంది గనుక వెంటనే ఒప్పేసుకుంది అరుణ.

సాయంత్రం అయిదు గంటలయ్యేసరికి సిద్ధంగా వుండమని చెప్పి బయటకెళ్ళాడు శేఖర్.

హిప్పీ క్రాపు, మీసాలు, ప్రత్యేకమయిన దుస్తులతో మనిషి బాగానేవున్నా వికారపు వేషంతో శేఖర్ అటువెళ్ళగానే ఇటు వూడిపడ్డాడు వి.ఐ.పి. సూట్ కేస్‌తో ఓ యువకుడు.

అరుణ కతనెవరో తెలియదు.

"ఎవరు కావాలండీ?"

"శేఖరన్నయ్య ఇంట్లో లేరాండీ?"

"ఇప్పుడే బయటికెళ్ళారు కూర్చోండి" అని కుర్చీ చూపించి లోపలికి దారి తీసింది అరుణ.

"ఏమండోయ్.... అట్లావెళ్ళిపోతారేమిటి ఎవరో ఏమిటో అడక్కుండానే?"

వెనక్కితిరిగి ప్రశ్నార్థకంగాచూసింది అరుణ అతనివైపు.

"నేను, శేఖర్ అక్క చెల్లెళ్ళ పిల్లలం. వెరసి అన్నదమ్ములం. ఇంజనీరుని. ప్రస్తుతం రూర్కెలాలో జాబ్"

సూట్ కేస్ హాలులోపెట్టి కుర్చీలో కూర్చుని బూట్లు విప్పటం మొదలెట్టాడతను.

ఓ నిమిషం అలా నిలబడి లోపలికి వెళ్ళింది అరుణ. 'ఈవిడ చక్కగా వుంటుందని విన్నాడుగానీ ఇంత కుందనం బొమ్మలాగా ఉంటుందనుకోలేదు. పైగా గ్రాడ్యుయేటు కూడా నంట. ఏ దిక్కుమాలినవాడి కూతురో. అన్నయ్యదే అదృష్టం' స్వగతంలో అనుకొంటూ పెదాలు తడుపుకున్నాడు.

భాగ్యం టిఫిన్ తీసుకొచ్చి టిపాయ్ మీదుంచింది.

"ఏయ్... నీ పేరు ధనమో, భాగ్యమో ఏదో అనుకుంటాను"

"భాగ్యమండీ"

"లక్ష్మి వదిన కన్పించదే?"

"ఆరు అమ్మగోరింటికెళ్లారుబాబూ"

'ఏమిటో కథ' తనలో తానే అనుకొని "నువ్వు పెద్దదానివయ్యావ్. ఇంకా పెళ్ళిగిళ్ళీ ఏమీ..."

ఈ బాబుగోరు రెండు సంవత్సరాలకు ముందెప్పుడో వచ్చిన జ్ఞాపకం.

మారుపలక్కుండా టీ తేవడానికి లోపలికెళ్ళింది.

టీ తాగి సూట్‌కేస్‌లో బట్టలు తీసుకొని బాత్‌రూమ్‌లోకి సరాసరి వెళ్ళిపోయాడు.

ఇవాళ్టికింకేం సినిమా. ఏరి కోరి వ్యవసాయం చేస్తే కాడీ మేడీ దొంగలెత్తుకుపోయారుట. "ఈ పూటకు కూరగాయలేమున్నాయే భాగ్యం? చెట్లకు టొమాటోలు, వంకాయలు వున్నట్లున్నాయి. కోసుకురా" అని కాసిని బియ్యం చేటలో పోసుకుని కెలుకుతూ కూర్చున్నది అరుణ. నోట్లో వేసుకుందామంటే ఒక్క గడ్డయినాలేదు.

"నాకింకో కప్పు టీ కావాలొదినా" టవల్తో తల తుడుచుకుంటూ అరుణ కూర్చున్న దగ్గరకొచ్చాడు.

అతని పేరు రమేష్!

"అలానే" బియ్యపు చేట అక్కడే

వుంచి వంట గదిలోకెళ్ళింది అరుణ. ఈయనెప్పుడొస్తారో ఏమో?

ఫ్లాస్కులో టీ కప్పులోపోసి రమేష్ కిచ్చి,హాలులో వున్న గోడగడియారంకేసి చూసింది. అయిదుకాబోతోంది.అమ్మయ్య అనుకున్నది.తనకు బాగా పరిచయస్తులైతే తప్ప బంధువులయినా కొత్తవాళ్ళతో కలివిడిగా వుండలేదు అరుణ.

అతనికి టీ యిచ్చి వంటింటిలోనే తారట్లాడుతోంది అరుణ. "చుట్టాలొచ్చారు బాబుగోరూ" గట్టిగా వినపడింది భాగ్యం గొంతు.

గట్టిగా ఊపిరి పీల్చింది అరుణ.

"ఏరారమేష్...ఏమిటిరాక ఓ ఉత్తరం ముక్కయినా లేకుండా"

"రావాల్సొచ్చిందన్నయ్యా"

"ఏమిటిరా అంత అర్జంటుపని" తానూ కుర్చీలో కూర్చుంటూ అడిగాడు శేఖర్.

"నాకు అర్జంతరంగా రావాల్సిన పనేముంటుందో ఊహించుకోలేవా అన్నయ్యా"

"ఏ పిల్లనో చూడటానికి వచ్చుంటావ్. బెండకాయ ముదిరినా,పెళ్ళికొడుకు ముదిరినా పనికిరావని సామెత అందుకేనా?"

"కరెక్టుగానే ఊహించావ్‌గాని సామెతను మాత్రం ఉపసంహరించుకో. రోజులు మారాయి. చచ్చూ పుచ్చూ సరుకుకూడా లక్షల్లో ఖర్చైపోతుంటే ఇంజనీర్ని, ఉద్యోగిని..."

"చాల్చాలుబాబు....పిల్ల దేవూరంట?"

"గుడివాడ. నాన్న నిన్ను తీసుకొని పిల్లను చూడ్డానికి వెళ్ళమంటే ఇలా వచ్చాను"

"పోనీలే. మూడు పదులు నిండాకైనా పెళ్ళిమీద మనసైంది. కట్నమెంతట?"

"రెండుకు పైగా అన్నారు"

"ఏం చదివిందట?"

"డిగ్రీ ఫైనల్ ఇయరులో వున్నదట. ఏదో పెళ్ళిలో అమ్మా నాన్న ఆ పిల్లను చూశారట. వాళ్ళకు నచ్చింది. రేపు చూడటానికి వస్తున్నట్లు నాన్న వాళ్ళకు వుత్తరం రాశారు. మనకు అడ్రసు ఇచ్చారు"

"సరే అలానే వెళ్దాం. అమ్మా, నాన్నా అంతా బాగున్నారా?"

"ఆహ... అంతా బాగానే వున్నారు"

"అరుణా...సినిమాకు రెడీయేనా?'' గట్టిగా కేకవేశాడు శేఖర్.

''ఇంకోరోజు వెళ్ళచ్చులెండి" ముక్తసరిగా అన్నది అరుణ.

"అబ్బే!మానుకోవడందేనికి? ముగ్గురం వెళదాం''

"నేను తెలుగు సినిమా జూసి ఎన్నాళ్ళయిందో? తప్పక వెడదాం'' వత్తాసు పలికాడు రమేష్.

బయలుదేరక తప్పలేదు అరుణకు.

* * *

కోర్టునుండి నాలుగ్గంటలకే వచ్చేస్తానని, అప్పుడు గుడివాడ వెళదామని చెప్పి కోర్టుకెళ్ళాడు శేఖర్.

శేఖర్ 10 గంటలకే భోజనం చేసి కోర్టు కెళ్ళడంతో శేఖర్ వెళ్ళాక అరుణకు పనేమీ వుండదు.

అరుణను జిడ్డులా పట్టుకున్నాడు రమేష్. ఎంత ముక్తసరిగా సంభాషణ తుంచివేసినా ఏదో మాట్లాడుతూనే వుంటాడు. అతనికేవో మాగజైన్సిచ్చి తను తన గదిలోకెళ్ళినా వదినా వదినా అంటూ ఒకటే పొలికేకలు.




విషయము లేకుండా పట్టి పనికి మాలిన కమ్మ కబుర్లతో గంటలు గంటలు సటం కొందరికి ప్రత్యేకత.

చెత్త ట్లాడటం, వినడం రెండూ అలవాటలే అరుణకు.

ఎంపూ సినిమాల కబుర్లు. తాము చదువుసే రోజుల్లో ఆడపిల్లల్నెలా ఏడిపినాళ్ళో, ఆడవాళ్ళ డ్రెస్సింగుని గురించి పట్టి పనికిమాలిన సంగతులు.

నివేష భాషలూ, మాట తీరూ వల్ల అటపట్ల అరుణకసలు సదభిప్రాయం లే. అతని చూపులు కూడా ఏమిటో చిగా వున్నాయి. ఈరోజు ఆ పెండ్లి పుల తతంగం కాస్తా అయిపోతే రేపు పోతాడు. ఒక్కరోజు....రోజులో డా సగమైపోయింది. ఇంకొక్కపూట.

పుస్తకం తీసినా తననసలు చదవ స్తేనా? పది పేజీలయినా తరగకుండానే ాయంత్రమయింది. శేఖర్ వచ్చేశాడు. అరుణ తేలికగా వూపిరి పీల్చింది.

కాఫీ టిఫిన్లయ్యాయి. అరుణను కూడా బయలుదేరమన్నారు. పెండ్లిచూపులూ పెద్దరికాలూ తనకు చేతకావనీ, చేసుకునే మనిషీ, అతనికి తోడొకరూ వుండగా ఇంకా తనెందుకనీ ససేమీ రానన్నది.

అన్నాతమ్ములిద్దరూ ప్రయాణ మయ్యారు. రమేష్ మేకప్ చూసిన అరుణకు వింతగా అనిపించింది. మగ వాళ్ళు కూడా ఇంత మేకప్ చేసుకుంటారు గాబోలు. ఆలోచనల్లో నిలబడి పోయింది అరుణ. కారు బయలుదేరిన శబ్దమయింది

* * *

డైనింగుహాల్లో టిఫిన్‌చేస్తున్న అన్న దమ్ముల సంభాషణ వంటింట్లో కాఫీ కలుపుతోన్న అరుణ చెవుల్లో పడుతూనే వుంది.

"చదువుకున్నవాడివి.... ఏమిటిరా ఆ చెత్త ప్రశ్నలూ నువ్వూనూ. వంటొచ్చా? హాబీలేమిటి ? ఎటువంటి సినిమాలు చూస్తారు? ... ఏం ప్రశ్నలా? ఆఫీసరు నిరుద్యోగి నడిగినట్లు తలాతోకా లేకుండా"

"మరేమడగమంటావ్? ఆ అమ్మాయిలో చొరవా, చురుకుదనం తెలుసుకోవాలంటే ఆ అమ్మాయిని పలికించాలి గదా! నిన్ను తోడు తీసుకెళ్ళడం దండగ. ఒక్క మాట అడిగావా ? అసలు నీవా పిల్లను చూశావా అని నా అనుమానం. ఆ పిల్ల ఏ రంగులో వుంటుందో చెప్పన్నయ్యా?"

"నిజంగానే నేనా పిల్లను చూడలేదురా! చేసుకునేది నువ్వు. వాళ్ళిచ్చే కట్నం నీకు నచ్చింది. కొసరగా కారును కూడా బేరమాడుకున్నావ్. ఆ అమ్మాయికి వంటొస్తే నీకెందుకు,రాకపోతే నీకెందుకు? వంట రాకపోతే మానేస్తావా? నేను లక్షలు తెచ్చుకుంటోంది నీకు వంట చెయ్యడానికి కాదు అని ఆ అమ్మాయి చెప్పుంటే నేను నిజంగా సంతోషించి వుండేవాడిని"

"నీ పెండ్లికి నేవేమీ అడగలేదా అన్నయ్యా! వదినా...ఒక్కసారి మీరిలా రండి. అన్నయ్య బండారం బయట పెడుదురుగాని"

కాఫీ సిద్ధం చేసి చేతిలోకి తీసుకున్న అరుణ కప్పులు కింద పెట్టేసింది రమేష్ పిలుపుతో.

"పాలు నేను చూస్తుంటానుగాని భాగ్యం - ఈ కాఫీలు నీవిచ్చిరావే"

కాఫీ కప్పులు భాగ్యం తీసుకెళ్ళింది.

"అన్నయ్యా! ఏమైనా నీవు వదినను నాలుగ్గోడల మధ్య బంధించేస్తున్న ట్లున్నావ్. మోడరన్ కల్చర్ మహిళా



సంఘాలు, సొసైటీలో తిరగడం ఏ! వున్నట్లు లేదు. ఆ, పూలు తప్ప మాటలు రావేమో అన్నట్లున్నది"

"నేను బంధించడమేమిటిరా? ఎవరితీరు వాళ్ళది. మీ వదినకు మహిళా సంఘాలు పెట్టి గ్రాంట్లు కొట్టెయ్యాలన్న కోర్కె లేదేమో" నవ్వుతూ అన్నాడు శేఖర్.

"ఏమైనా లాయరువన్నయ్యా .... మాట తప్పించెయ్యగలవ్"

కాఫీలు పూర్తిచేసి ఆఫీసు గదిలోకెళ్ళిపోయారు.

* * *

'ఇతగాడు ఈరోజు కూడా ఊరెళ్ళడో ఏంఖర్మ' శేఖర్ కొట్టుకెడుతోంటే సినిమా మాగజైను తిరగేస్తూ కూర్చున్న రమేష్‌ని చూసి మనసులోనే అనుకున్నది అరుణ. లక్ష్మక్కొచ్చినా బాగుండు... వెళ్ళి వారం రోజులు దాటింది.

'లక్ష్మి ఊరెళ్ళిన ఈ కాసిని రోజులైనా అరుణతో కాస్త ఫ్రీగా గడపొచ్చను కుంటే ఈ రమేష్‌గాడు తగులుకున్నాడు. ఈలోపున లక్ష్మి రానే వచ్చేస్తుందేమో'



కోర్టుకెళ్తూ అనుకున్నాడు శేఖర్.

* * *

అరుణ మీదుగా పొయ్యిపక్కన వున్న అగ్గిపెట్టె అందుకున్నాడు రమేష్.

"వంట నువ్వెందుకొదినా! భాగ్యం చెయ్యదూ?"

అరుణకు వళ్ళుమండింది. "అగ్గిపెట్టె కావాలంటే భాగ్యం ఇవ్వదూ?"

"నీక్కాబోయే అమ్మాయికి వంటా వార్పూ అన్నీ రావాలి. ఊరి ఆడవాళ్ళు వంటలుమానేసి బాతాఖానీ కొట్టాలా?"

"అయితే ఉపయం మా కబుర్లన్నీ నీ చెవిని పడ్డాయన్నమాట" సిగరెట్టు ముట్టించుకుంటూ అన్నాడు.

అరుణ వంటింట్లోనుండి బయటి

కొచ్చేసింది.

"భాగ్యం... ఎక్కడ చచ్చావే?"

"అదేందమ్మగోరూ! మీరేగా గదులు తుడవమంది? అయినాఅమ్మగోరి నోటంట ఈ మాటలేంది?" తుడిచేపని ఆపి అరుణ వున్నచోటికొచ్చింది.

"ఏం లేదులే వెళ్ళు. నీపని నువ్వు చూసుకో" కసురుకుంది.

"ఏందో ఇవాళమ్మగోరు..." అనుకుంటూ వెళ్ళిపోయింది.

'ఈ వెధవకు తనంటే ఏమిటో అలుసుగా వున్నట్లుంది. ముసలిమొగుడు పెళ్ళాన్ననేమో!' మనస్సంతా చికాగ్గా వుంది. అరుణ చిర్రుబుర్రూ చూసిన రమేష్ డ్రాయింగు రూంలోకి తోక ముడిచాడు.

ఎప్పుడూ లేంది కోర్టుకెళ్ళిన రెండు గంటలకే అరుణ శేఖర్‌కి ఫోన్ చేసింది. తనకు వంట్లో అంత బాగుండలేదనీ, వీలుంటే ఇంటికొచ్చెయ్యమని. ఇటువంటి బలహీనతలు అరుణకిష్టం వుండవు కానీ ఏమిటో అనీజీగా వుంది. ఎవరో తోడు కావాలి.

ఓ గంట గడిచాక హడావిడి పడుతూ ఇంటికొచ్చాడు శేఖర్. వస్తే ఏముంది–కాస్త చికాగ్గా వున్నట్లుంది తప్ప బాగానే వుంది. పైగా బట్టలకు గంజిపెట్టిఆరేస్తోంది.

"ఈ ఎండలో దేనికి వంట్లో బాగుండలేదని? హాస్పిటల్ కెళదాం... బయల్దేరు."

"హాస్పిటల్ కక్కరలేదండి. కాస్త చికాగ్గా వుండి ఫోన్‌చేసాను."

"అయితే ఏంలే. ఓసారి డాక్టరుకి చూపించుకొంటే నష్టమేముంది"

ఇదెక్కడి చావురా బాబూ. ఇంక ఈయన వదిలిపెట్టరు. వెళ్ళకతప్పదు. డాక్టరు ఏ వళ్ళునొప్పులకో రెండుబిళ్ళలిస్తే తెచ్చుకోవచ్చులెమ్మని బయలుదేరింది అరుణ.

* * *

డాక్టరు చెప్పిందివిని చందమామవచ్చి చేతిలో పడ్డట్టు ఎలాగో అయిపోయాడు శేఖర్. మనసు దూదిపింజలాఅయి గాలిలో పల్టీలు కొడుతోంది. డాక్టరు నిర్ధారించడమంటే ఏ మూడోనెలో కావచ్చు.

ఇంటికొచ్చేటపుడు అరుణ ఒక్క మాట మాట్లాడలా. ముఖంలో ఏ భావం వ్యక్తం కాలా.

శేఖర్ ఇంక ఆ రోజుకి కోర్టుకెళ్ళలా. ఇంటివద్దనే వుండిపోయాడు. బుర్రలో తెంపులేని ఆలోచనలు. తను చేసినపని తప్పో వప్పో జరిగిపోయింది. పుట్టబోయే బిడ్డలయినా తనకూ, అరుణకూమధ్య అనుబంధాన్ని పెంచగలరనుకున్నాడు. లక్ష్మి త్వరగావస్తే బాగుండు. తను అందరిలాంటిది కాదు. ఈ వార్తవిని తప్పక సంతోషిస్తుంది. భర్త సంతోషమే తన సంతోషమని భ్రమించే పాతకాలపు భావాలకు ప్రతినిధి లక్ష్మి.

మరుసటి రోజుకూడా ఇంటివద్దనే వుండమన్నది అరుణ. సంతోషంగా ఒప్పుకున్నాడు శేఖర్.

ఆ రోజు ఉదయం కాఫీ తాగాక ఊరికి బయలుదేరాడు రమేష్. అరుణతో నీవూ లక్ష్మాదినా తప్పకుండా పెండ్లికి రెండు రోజులు ముందుగానే రండనిచెప్పి, అన్న దగ్గరకూడా వీడ్కోలు పుచ్చుకున్నాడు.

అరుణను గ్రహణం విడిచినట్లయింది.

"వంట్లో ఏదో కొంచెం అనీజీగావుండి మిమ్మల్ని వుండమన్నాను తప్ప నాకిప్పుడొంట్లో అంతా సరిగానే వుంది. మీరు కోర్టుకెళ్ళండి" అన్నది అరుణ.

క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్




అనుకొని ఈ గడబిడంతా అరుణ మారిన శారీరక స్థితినుండి ఏర్పడిందేననుకొని స్థిమితపడ్డాడు శేఖర్.

* * *

లక్ష్మి రాగానే చూసింది భర్త ముఖంలో అంతులేని ఆనంద రేఖలు! తను అంతటి ఆనందాన్ని కలిగించలేకపోయింది. ప్రస్తుత ఘటనతో తనకు ఆనందమో, చికాకో... ఏమిటో తనస్థితి తనకే అర్థం కావటంలా. అరుణ తనను కించపరచదు గదా! ఓ ధర్మ సందేహం. అన్నీ తన అనుమానాలే తప్ప అరుణ ఎప్పటిలానే వుంది. ఏ మార్పూ వున్నట్టులేదు. లక్ష్మి బుర్రలో ఒకటే ఆలోచనలు. వూరినుండి వచ్చిరావడంతోటే లక్ష్మిని హడావుడి పెట్టేసింది భాగ్యం.

రోజులు గడుస్తున్నా అరుణ దిన చర్యలో, ప్రవర్తనలో ఎలాంటి మార్పు లేదు. లక్ష్మి అరుణపట్ల కఠినంగా వుండ లేకపోయింది. ఏ జన్మలో చేసుకున్న పాపమో ఈ జన్మకిలా అయింది. ఇంకా పాపం మూటగట్టుకోవడం దేనికి? "వాళ్ళమ్మా వాళ్ళకు తెలిపారా?" భర్త నడిగింది లక్ష్మి.

"అరుణేమైనా రాసిందేమో నాకు తెలియదు" అన్నాడు శేఖర్.

"మీరు రాయండి వాళ్ళకు"

"అలానే"

లేడీ డాక్టరు దగ్గర కెళదామంటే "ఇప్పుడిప్పుడే దేనికక్కయ్యా..నావంట్లో బాగానే వున్నది గదా. ఇంకొన్నాళ్ళు పోయాక చూపించుకోవచ్చులే" అన్నది అరుణ.

ఓసారి చూపించుకుంటే పోయేదే ముంది వెళదామని బలవంతపెట్టి తీసు కెళ్ళింది.

తనకు వంట్లో బాగానే వున్నదనీ, కాన్వెంటులో చేరాలని తనకెంతో కోర్కెగా వుందనీ లక్ష్మినీ, భర్తనూ బలవంతపెట్టి వప్పించింది. తనకెప్పుడు కష్టంగా అని పిస్తే అప్పుడు ప్రిన్సిపల్‌కి కొంతముందు గానే తెలియజేసి మానేస్తానంది. ఇంక పదిరోజుల్లో తను స్కూల్లో జాయిన్ కావాలి. చేరడం దగ్గర పడుతున్నకొద్దీ అరుణ ఊహల్లో ఆడుతూ పాడుతూ గంతులేసే, చిదిమితే పాలుగారే బుగ్గలతో పసిపాపలు; కల్లా కపటం తెలియనివాళ్ళు చిలిపి అల్లరి ఊహలు మనస్సుకెంతో ఆనందాన్నిస్తున్నాయ్. అది కాన్వెంటు గదా! ఖరీదైన పిల్లలుంటారు అనుకుంది అరుణ.

* * *

విషయం తెలుసుకున్న సీతమ్మ ముందుగా రాఘవయ్య తనువెళ్ళి చూసొస్తా నన్నా వినకుండా తానే రెక్కలు గట్టుకువాలింది. ఊరు దగ్గరకొచ్చే కొలదీ గడసరితనం తెలియని తన బిడ్డ ఏం కష్టాలు పడిపోతోందో అని ఒకటే మథనపడింది.

తన ఊహలు ఎంత నిరాధారాలో ఒక్కరోజు లక్ష్మి తీరుజూసి అబ్బుర పడింది సీతమ్మ. అరుణ కంటేగూడా ఆ అమ్మాయే తనపట్ల ఎక్కువ శ్రద్ధ చూపింది. అరుణ పెండ్లయ్యాక సీతమ్మ ఇక్కడకు రావడం ఇది రెండవసారి. మొట్టమొదటిసారి శేఖర్‌కి సుస్తీచేస్తే చూడ డానికొచ్చి ఓరోజు మాత్రం వుండివెళ్ళి పోయింది. అప్పుడు లక్ష్మి ఏదోలా ముభావంగా వున్నట్లనిపించింది. ఏమైనా ఒక్కరోజులో మనిషి తీరూతెన్నూ ఏం తెలుస్తుంది? ఈసారి మాత్రం లక్ష్మి సీతమ్మ కూతురా అన్నట్లు ఆ కబుర్లూ ఈ కబుర్లతో కాలగమనమే తెలియనట్లు

ప్రవర్తించింది.

అరుణను తన వెంట తీసుకెళతానన్నది సీతమ్మ.

"మీరు కూడా వున్నారుగదా. ఇక్కడ ఏదో ఒక వేడుక చేసి తరువాత తీసుకెడుదురు" అన్నది లక్ష్మి.

అలాగే కానివ్వమన్నది సీతమ్మ.

ఛీ ఛీ అల్లాంటివేమీ వీలుకాదు; తన కిష్టంలేదన్నది అరుణ. సీతమ్మతో వెళ్ళడానికి మాత్రం అక్కడి నుండి వచ్చి ఇరవై రోజులు కాలేదు. కొంత కాలం పోయాక వస్తానని, తండ్రినోసారి వచ్చి వెళ్ళమన్నది.

ఇంకొకరైతే ఎంత పొంగిపోతారో! ఏమిటో విడ్డూరపు మనిషి అనుకున్నది లక్ష్మి అరుణను గురించి.

సీతమ్మ వంటరిగానే ప్రయాణమైంది.



తొమ్మిదిన్నర అయ్యేకావడం బస్సులూ, రిక్షాలు దిగి బిలబిలమంటూ పిల్లలు. వీపులమీద మోయలేని పుస్తకాల భారం, ఇంకో చేతిలో కారియరు. యూనిఫాం. మాటలు సరిగారాని రంగురంగుల దుస్తుల్లో లోయర్ కె.జి. పిల్లలు.

మిస్ మిస్ అనే పిలుపుకి విరామం ఉండదు. ఈ వాతావరణం మొదట్లో అరుణకి ఆహ్లాదంగానే వున్నది. ఉదయం 9 గంటలు మొదలు సాయంత్రం నాలుగున్నర వరకు పిల్లలతో బిజీబిజీగా కాలక్షేపం. సంవత్సరం పైగా తన్నావహించిన స్తబ్దత . వదిలినట్లయింది. అరుణకు 4, 5, 6 క్లాసులకు మాథమేటిక్స్‌తోపాటు ఫస్ట్‌క్లాస్ వాళ్ళకు ఇంగ్లీషు కూడా. క్లాస్‌కి వచ్చి రావడంతోటే పని మొదలవుతుంది. హోంవర్క్ చూడటం, చేయని వాళ్ళను దండించటం—క్లాసులో టీచర్ ఖాళీగా ఉండటమనే సమస్యే ఉండదు. విద్యార్థులచేత వర్కు చేయించటం, చదివించటం, చెప్పించడం, అందరి నోట్సులూ కరెక్ట్ చేయడం ఏదో పని వుంటూనే ఉంటుంది. మధ్య మధ్యలో ప్రిన్సిపల్ విజిట్స్. టీచర్సు పనెగ్గొట్టి కాలక్షేపం చేస్తున్నారేమోనని తనిఖీలు.

ఇక్కడ టీచర్సు ప్రాణానికి మే నెల ఎండల్లో రామగుండంలోనో, భద్రాచలంలోనో వున్నట్లుగానో, ఓ పెద్ద బండరాయి నెత్తినబెట్టినట్లో వుంటుంది. పిల్లలతో ఆడుతూ పాడుతూ స్వేచ్ఛా వాతావరణంలో హాయిగా పాఠాలు చెప్పడంకంటే-ఎక్కడ తనిఖీకొస్తారో, ఏం చివాట్లు తినాల్సొస్తుందో, ఇంతోటి ఉద్యోగం ఎక్కడ వూడుతుందో అని ప్రాణాలు వుగ్గబట్టుకొని తమ విధి నిర్వహణ చేస్తారు. ఇంత గాడిద చాకిరీ చేస్తే వాళ్ళిచ్చే జీతం ఏ ముష్టి మూడొందలో వుంటుంది. కొంతమందికి అంతకంటే తక్కువ; ఏ కొద్దిమందికో మరి కాస్త ఎక్కువ. కట్టు బానిసత్వాన్ని నిర్మూలించామని ఘనంగా చెప్పుకుంటున్నారు పాలకులు. నిరుద్యోగ మహమ్మారి విజృంభణ పుణ్యమా అని తామున్న స్థితిలో ఇంకేమీ చెయ్యలేక

ఈ ఊడిగానికి బానిసలు కావటాన్ని మించిన కట్టుబానిసత్వం ఇంకేముంటుంది? వీళ్ల క్వాలిఫికేషన్సేమయినా తక్కువా అంటే అందరూ గ్రేయిన్డ్ గ్రాడ్యు యేట్సే. కొందరు పోస్టుగ్రాడ్యుయేట్స్ కూడా. ఏ కొద్దిమందో డిగ్రీలు లేని వారున్నారు.

ఉద్యోగభద్రత వుండి తగిన జీతాలు వున్నప్పుడు శ్రమించడం వేరు. ఇంత తక్కువ జీతాలకు ఇంత గొడ్డుచాకిరీ కిమ్మనకుండా చేయడం ఎలా సాధ్యపడు తోంది అని చూసేవాళ్ళ కనిపిస్తూం టుంది. కానీ ఏం చేస్తారు? బ్రస్తీ బతు కులు. గవర్నమెంటు వుద్యోగాలు ఎండ మావుల చందం. కనీసం ఏ ఇంటి అద్దెకో, పాలకో అయినా ఈ డబ్బులు సరిపెట్టి తండ్రికో, భర్తకో వేణ్నీళ్ళకు చన్నీళ్ళలా తోడ్పడచ్చన్న బాధ్యత.

కాన్వెంటు మానేజిమెంట్సు శక్తి లేక ఇంత అన్యాయానికి ఒడిగడుతున్నారా అంటే ధైర్యం, ఓపికా ఉండి కాన్వెంట్ పెట్టాలేగాని అంతకు మించిన లాభ సాటి వ్యాపారం ఇంకోటి ఉండదు. సంవత్సరం మొదట్లో డొనేషన్సు వందల నుండి వేలల్లో. ఇంక జీతాలు ఒక్కో విద్యార్థి నుండి నెలకు రూ. 30 నుండి రూ. 50 వరకు. ఒక్క నాలుగు సంవత్స రాలు కాన్వెంటు నడుపగలిగితే ఆపైన సంవత్సరానికి లక్షలలోనే నిఖరాదా యాలు. బిల్డింగ్సు అంతస్థులు లేచి పోతుంటాయి. టీచర్సు జీతాలు మాత్రం ఎక్కడేసిన గొంగళి అక్కడే.

ఇంత తక్కువ జీతాలకు పనిజేసినా ప్రభుత్వ, పంచాయతీరాజ్, మున్సిపల్ స్కూల్స్‌లోకంటే ఈ కాన్వెంట్స్‌లోనే ఉన్నత విద్యాప్రమాణాలుంటున్నాయి. అందుకే స్థోమతున్నవారిని గురించి ఆలోచించాల్సింది లేదు. కాన్వెంటు చదువులు భారమైన మధ్యతరగతి చాలీచాలని జీతగాళ్లు సైతం ఎలాగో తంటాలుపడి ఇక్కడికే పిల్లలను పంప డానికి మోజుపడుతున్నారు. అక్షరాలు దిద్దటం మొదలుబెట్టిన దగ్గర్నుండి ఒక్కో బిడ్డ కింద సంవత్సరానికి వేల రూపా యల ఖర్చు.

ప్రైవేటు విద్యాసంస్థలు వ్యాపార సంస్థల్లా తయారయ్యాయని గొంతు చించుకోవడాలు తప్ప ఉచిత విద్య నందించే ప్రభుత్వ పాఠశాలలకు కాకుండా తల్లిదండ్రులు ఈ స్కూళ్ళకే ఎందుకు ఎగబడుతున్నారు. లోపం ఎక్కడుంది అని ఆలోచించాల్సిన బాధ్యత పాలకులపై ఎంతైనా ఉన్నది. ఎంత సేపూ ఉన్నత విద్య, కళాశాలలు, యూని వర్సిటీల వ్యాప్తిని గురించిన ఆలోచనలే తప్ప బాలబాలికలకు ఎలిమెంటరీ ఎడ్యు కేషన్ పునాది అని ఆలోచించరు. ఈ పునాది పటిష్టంగా వుంటే పైచదువులు పిల్లలకు భారంగావు. అప్పుడే ఉన్నత విద్యా ప్రమాణాలు సాధించబడుతాయి. ఎలిమెంటరీ స్కూలులో చేరిన విద్యా ర్థులు ఎంత శాతం హైస్కూలుకొస్తు న్నారు? ఇక్కడి నుండి ఎంత శాతం కాలేజీలకు ఆపై చదువులకు పోతున్నారో పరిశీలిస్తే మన చదువుల పునాది ఎంత లోపభూయిష్టంగా ఉన్నదో అర్థమవు తుంది.

సెవెంత్ క్లాస్ లోపు పిల్లలంతా 11, 12 సంవత్సరాలకు లోపువాళ్ళే. కల్లా కపటం తెలియని అమాయకత్వంతోనే వుంటారు. అయినా కూడా ఈ వయస్సు లోనే అంతస్థుల తేడాలు చూపించు

కోవటం, హోదాలున్నవాళ్ల పిల్లలు జట్లుగా ఏర్పడడం చేస్తారు. మాకు సినిమా హాలుంది మిస్, మాకు సిటీ బస్సుంది మిస్, మా నాన్న కాంట్రాక్టర్, మా నాన్న డాక్టర్, మా నాన్న ఫారిన్‌లో ఉన్నారు... అంటూ ఎంతెంత బడాయిలో! పిల్లల్లో మన స్తత్వం అరుణకు బాధగా అనిపించేది. సమాజ ప్రభావం పిల్లలపైబాల్యంనుండీ ముద్రించ బడుతుంది.

రీసెస్ బెల్ కొట్టడం ఆలస్యం పోలో మంటూ బైటకెళ్ళడం. దాహమైనా కాక పోయినా పంపుల దగ్గర రద్దీ. ఐస్‌క్రీం బండి చుట్టూ పిల్లలు. పచ్చి మామిడికాయ ముక్కలు, సీమ చింతకాయలు, జామ కాయలు వాళ్ళకిక్కడున్నగిరాకీ మరింకె క్కడా వుండదు.

ఏమైనా చీకూ చింతాలేని బాల్యం జీవితం మొత్తానికే అమూల్యమయినది.

తప్పనిసరి పరిస్థితుల్లో తప్ప బంది ఖానాలాంటి ఇలాంటి చోట్ల ఎక్కువ రోజులు పనిచెయ్యడం అసాధ్యమని పించింది అరుణకు. అందుకే ఇక్కడి టీచర్సు ఎప్పుడూ ప్రవహించే నీటివాటం. వివాహాలు చేసుకొనో, తండ్రులకు ట్రాన్సఫర్లయ్యో పోయేవాళ్ళు పోతూంటే వచ్చేవాళ్ళు వస్తూంటారు. కోట్ల సంఖ్యలో నిరుద్యోగసైన్యమున్న ఈ దేశంలో కొత్తవాళ్ళకు కొదవేముంది.

విద్యాభ్యాసం సవ్యంగా సాగడానికి ఉపాధ్యాయునికి, విద్యార్థికి మధ్య ఓ అవగాహనుండాలి. కానీ ఈకాన్వెంట్సులో మాత్రం సంవత్సరం పొడవునా పోయేవాళ్ళు పోతుంటే వచ్చేవాళ్ళు వస్తుం టారు.





అరుణ పనిచేస్తున్న ఈ స్కూలులో మూడు నాలుగేళ్లుగా కదలక పనిచేస్తున్న వాళ్ళు కొంతమందున్నారు. శైలజ రెండు సంవత్సరాలైంది చేరి, ఆవిడకు పుట్టింటి వాళ్ళుపెండ్లికి బంగారు గాజులు చేయిస్తా మన్నారు. తరువాత పరిస్థితులు తారు మారు కావడంతో చేయించలేక పోయారు. అత్తవారు శైలజను పుట్టింటికి పంపిం చేసారు. ఇక ఆ గాజులను సమకూర్చు కునేదెన్నటికో, భర్తను చేరుకునేదెన్న టికో? కాసనీ కాసినీ డబ్బులు కూడబెట్టినా ఆ బంగారంధర శైలజకు అందీ అంద కుండా మాయలేడిలా పరుగులు పెడు తోంది.

సుధది ఇంకోరకపు కథ. సుధ తండ్రి గుమాస్తా. నలుగురాడపిల్లలు, ఇద్దరు మగబిడ్డలు. ముగ్గురమ్మాయిలూ డిగ్రీలు పుచ్చుకొని నాలుగో అమ్మాయి డిగ్రీ అందుకోబోతోంది. మగపిల్లలిద్దరు ఒకతను పాలిటెక్నిక్ చదివి, ఇంకొకతను డిగ్రీ పుచ్చుకొని ఏవో వుద్యోగాల్లోనే వున్నారు. అందరూ అవివాహితులే. కట్నం తెచ్చుకోలేనిసుధకు పెండ్లికావటం అంత సులువుకాదు. ప్రభుత్వ వుద్యోగం అంతకంటే గగన కుసుమం. అందుకే సుధకు ఈ కొలువుతప్పనిసరి. ఇలాంటివే మరికొన్ని కేసులు. అయిదు నెలలు పనిచేసింది అరుణ. స్కూలు సంవత్సరం అయిపోయి సెలవులిచ్చారు. అరుణకూ నెలలు నిండాయి. తానే ఓ స్కూలు పెట్టి వ్యాపారం కాకుండాఆదర్శవంతంగా నడప గలిగితే ఎంత బాగుండు అన్న కోర్కెతో ఆ కొలువుకి భరతవాక్యం పలికింది అరుణ.

* * *

"అమ్మో... ఆడపిల్లే" ఎవరిదో ఈసడింపు.

"ఎవరో ఒకరు లేమ్మా! తొలికాన్పు సులువుగా అయింది. అదే పదివేలు" మరెవరిదో ఓదార్పు!

పుట్టుకతోటే ఆడపిల్లంటే చులకన భావం. మగబిడ్డ పుట్టడం ఎంత సహజమో ఆడపిల్ల పుట్టడంకూడాఅంతేసహజంకిదా! ఈ భేదభావం ఎప్పటికి పోతుంటో- లోలోపలే అనుకున్నది అరుణ. తనూ బాగానే చదివింది. అయినా తను తండ్రికి, రొమ్ములమీద కుంపటి అయింది. అదే సుధాకర్ విషయానికొచ్చేసరికి వాడికి మార్కెట్లో పెద్దగిరాకీ. సమాజంలో పురుషాధిక్యతాభావం కొనసాగినంత కాలం ఆడపిల్లలకి పాట్లు తప్పవు. ఆమధ్య పేపర్లో చదివింది - ఇద్దరూ ఆడపిల్లల్నే కన్నందుకు భర్త పెట్టే ఆరడి భరించలేక ఓ అభాగ్యురాలు ఆత్మ హత్యకు పాల్పడిందని.ఎంత అన్యాయం!

ఏబిడ్డపుట్టేదీ గర్భిణీగా వున్నప్పుడే తెలుసుకోవచ్చంటున్నారు. ఆ పద్ధతులు బాగా ప్రచారంలోకొస్తే ఇంక మగబిడ్డల్ని తప్ప ఆడపిల్లల్ని పుట్టనివ్వరేమో.

తన ఆలోచనలు తనకే భయంకరంగా అనిపించాయి. సృష్టిలో ప్రతిదీ ఒక క్రమపద్ధతిలో గణితం ప్రకారం జరుగుతూంటుంది. కృత్రిమ పద్ధతుల వలంబించి ఆడపిల్లలు తగ్గిపోతే వచ్చే పరిణామాలెట్లా వుంటాయో?

* * *

మూడోమాసంలోనే బిడ్డ నెత్తుకొని తమ ఇంటికొచ్చేసింది అరుణ. వేళకు పాలివ్వడం మినహా బిడ్డ ఆలనా పాలనాఅంతా లక్ష్మే.వంటపనీ గట్రా అరుణ వంతైంది. భర్త ఇంటిదగ్గరున్నంతసేపు లక్ష్మికి బిడ్డ ముచ్చట్లే. బుగ్గన ఇంత పెద్ద కాటుక చుక్క.సాయంత్రాలు దృష్టితియ్యడాలు. ఈ చాదస్తాలు అరుణకు గిట్టవు. లక్ష్మికి చెప్పినా వినిపించుకోదు.

"ఇంత చక్కని బిడ్డ ఈ వాడకట్లో ఎవరికుంది? ఎవరి కళ్ళు ఎల్లాంటివో"

"అట్లాగే. ఎవరిబిడ్డ వారికి ముద్దు. కొన్ని కొన్ని హాస్పిటల్సులో చూసావా అక్కా. వరుసగా వుయ్యాలలో చక్కని ఆరోగ్యమయిన బిడ్డలు ఎందరో వుంటారు. వాళ్ళని ఎందరు చూడటంలా. వాళ్ళ ముఖాలపైనా ఈ మారెమ్మ బొట్లులుంటున్నాయా? చూపులకే మనుషులేదో అయిపోతే ఇంక చక్కని వాళ్ళంతా మటుమాయం కావల్సిందే!"

"ఏమోనమ్మా !నీతోనేను వాదించలేను. నా బిడ్డ నా ఇష్టం... అంతే" లక్ష్మి గొంతు గాద్గదికమైంది.

అరుణ నోటికి తాళం పడింది. అలాంటి విషయాలు పట్టించుకోవడం మానేసింది. ఆవిడలో ఏ చాదస్తాలున్నా బిడ్డ పెంపకం విషయంలో మాత్రం డాక్టరు సూచనలు తు. చ. తప్పక పాటించేది. ఆముదం గట్రా పోసేది కాదు.

* * *

లక్ష్మి పుట్టింటికెళ్ళివచ్చి సంవత్సరం పైబడింది. వాళ్ళ అక్క కూతురు రమకు పెండ్లి ఖాయం చేసుకున్నారు. లక్ష్మి బావ రాజారావొచ్చి పెండ్లి వివరాలుచెప్పి ఓ వారం పదిరోజులు ముందుగానే పెండ్లికి రావాలని చెప్పి వెళ్లాడు. పెండ్లి ఓ వారం వుందనగా లక్ష్మి బయలుదేరింది. గీతను వదిలివెళ్ళాలంటే లక్ష్మికెంతో బాధగా అనిపించింది. అరుణకెప్పుడూ పుస్తకాల గొడవే. భాగ్యంతో బిడ్డను గురించి జాగ్రత్తలు లక్షసార్లు చెప్పింది. శేఖర్, అరుణ గీతను తీసుకుని పెండ్లిరోజుకొస్తామన్నారు. వెళ్ళేంత



వరకూ గీతకు గురించిన జాగ్రత్తలు చెబుతూనే వుంది. శేఖర్ నవ్వుతూ అన్నాడు – "ఇంతకూ బెంగెట్టుకునేదెవ్వరు? నీకోసరం గీతా లేక గీత కోసరం నువ్వా?"

మా ఇద్దరికీ బెంగేసంటూ, ఇంకా ఆలస్యంచేస్తే రాహుకాలమొస్తుందంటూ ఎట్టకేలకు గీతనొదిలి వూరికి బయలుదేరింది.

రమకు కుదిరిన వరుడు బి.కాం. ఫస్ట్ క్లాసులో పాసయి సి.ఏ. చేస్తున్నాడు. ఒక్కడే అబ్బాయి. వెనక స్థిరచరాస్తులు ఉన్నాయి. తండ్రి లేడు. తల్లి, అమ్మమ్మ అతని దగ్గరే వుంటారు. ఆడపిల్లలు లేరు. కనుక ఎవరికీ ఏమీ పెట్టేపని వుండదు. మంచి సంబంధం అనుకున్నారు. రమకు కట్నంగా రెండెకరాల పొలం, అరవయి వేలు రొక్కం రమ పేరున బాంక్‌లో ఫిక్సెడ్‌డిపాజిట్టు వెయ్యటం. ఇదికాక ఓ పాతికవేలు పెండ్లి ఖర్చుల కోసరం పెండ్లి కొడుకువాళ్ళకివ్వడం. తమ తాహతుకి మించికట్నం ఇస్తున్నారనుకున్నది లక్ష్మి. పైగా పెండ్లి ఖర్చులకు వాళ్ళకు డబ్బులివ్వడం మరీ ఎబ్బెట్టుగా అనిపించింది. వాళ్ళు బాగా డబ్బున్నవాళ్ళే అంటూ ఇలా ఖర్చులకు తీసుకోవడం అందినకాడికి రాబట్టుకోవాలన్న కోర్కెతప్ప తప్పు ఒప్పు, అభిమానం ఇలాంటివేమీ వున్న వాళ్ళు కాదేమో అనిపించింది.

లక్ష్మి రమకు ఓ జత రాళ్ళగాజులు చేయించి చీరా, జాకెట్టూ పెట్టింది. పెండ్లి చాలా ఆడంబరంగా జరిగింది. మిగులులో వున్న రాజారావు ఈ పెండ్లితో ఓ



పాతికవేలు ఋణంలో పడ్డాడు. కట్నాల బరువుతోటే ఆడపిల్లల తల్లిదండ్రుల నడుములు విరుగుతోంటే ఇంక పెళ్ళి సైతం ఆడంబరంగా చెయ్యాలనటం మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్లే.

ఎన్ని వందలుబెట్టి ఎన్ని పట్టుచీరెలు తీశారు? భోజనాల్లో ఏమేం స్వీట్సు పెడుతున్నారు? పండ్లు పెట్టారా?...ఇదీవరస. డబ్బున్నవాళ్లకు తమ ఆస్తి అంతస్తులను చాటుకోవడానికి ఇలాంటి సందర్భాలు వేదికలుగా వుపయోగపడతాయి. పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్లు మధ్య రకం జీవులు సైతం మిథ్యాడంబరాలకు పోవడం, తలకుమించి ఖర్చులు చేయటం, అప్పులపాలు కావటం,కాల్చేది చార్ మినార్ సిగరెట్టయినా చేతిలోమాత్రం ఫారిన్ సిగరెట్టుపెట్టె ఉండాలి.

అత్తవారింటికి రమకు తోడుగా లక్ష్మిని బయలుదేరమన్నారు.రమ మేనత్త గారమ్మాయి రమ వయస్సుది ఆ క్రితం సంవత్సరమే పెండ్లయింది ... ఆ అమ్మాయిని పంపితే ఒకరికొకరు ఇద్దరూ తోడుగా సరదాగా కాలక్షేపం చేస్తారు.

"నేను దేనికిలే" అన్నది లక్ష్మి.

"నీకు వెళ్ళడానికిష్టంలేదు. నీకసలు పుట్టింటి వైపువాళ్ళే వెగటైపోయారు" నిష్ఠూరంగా అన్నది సుభద్రమ్మ. రాత్రి పూట పెండ్లయితే ఆరోజు వుదయమే అరుణా శేఖర్ లు గీతను తీసుకొనొచ్చారు. వచ్చిన దగ్గర్నించీ గీత లక్ష్మిని వదలక పోవడం చూసిన సుభద్రమ్మకు వంటికి కారం రాసుకున్నట్లగా వుంది. అసలు అరుణ చూలింత అని తెలిసినప్పుడే తమ ఇంటిని బందిపోటులు లూటీ చేసినంతగా బాధపడింది.

"ఎందుకమ్మా అలాంటి మాటలు. ఒకే వయసువాళ్ళైతే ఏవో పూసులు చెప్పుకుంటారు. కాలక్షేపం బాగా అవుతుందని అన్నాను. దానికింత రాద్ధాంతం దేనికి? సుబ్బమ్మ పిన్నిగారమ్మాయి పెండ్లికి కూడా ఆ పిల్లతో నన్ను తోడు వెళ్ళమంటే వెళ్ళానా? అప్పుడెవ్వరూ తప్పుపట్టలా. మరిప్పుడేమయ్యిందని?"

"అదికాదులేవే తల్లీ...రోజులెప్పుడూ ఒక్కలా వుండవ్"

"అంటే ఇప్పుడు నాకేం కొమ్ములొచ్చాయంట?" లక్ష్మి వుక్రోషపడింది.

"అమ్మతో నీకు వాదనెందుకు ... ఊరుకో" అంటూ సరస్వతి సర్దిచెప్పింది.

ఆ ఉదయమే ఎక్కడి చుట్టాలక్కడ సర్దుకున్నారు. అరుణా శేఖర్లు కూడా వెళ్ళిపోయారు.

రమ మూడు నిద్రలు చేసి వచ్చాక లక్ష్మి తల్లి వదినలతో పుట్టింటికొచ్చింది. ఈసారి మరీ లక్ష్మికి పుట్టింట్లో పరాయి వాళ్ళ మధ్య వున్నట్లే అనిపించింది. మధు, అపర్ణలే లక్ష్మికి ఆత్మీయులు. అన్నపూర్ణ మాత్రం ఎప్పటిలానే తన కష్టసుఖాలు, భర్త రాసలీలలు లక్ష్మి దగ్గర వెళ్ళబోసుకోవడం, ఊరట చెందడం జరుగుతోంది.

లక్ష్మి ఇంటిదగ్గర బయలుదేరి పదిహేను రోజులయింది. ఎక్కువరోజులు పుట్టింట్లో వుండాలన్న కోర్కె ఎప్పుడో చచ్చిపోయింది. ఆరోజు తండ్రి కూడా ఇంటివద్దనే వున్నాడు.

"రేపు ఉదయమే ఇంటికి బయల్దేరాలనుకొంటున్నాను నాన్నా" అంది లక్ష్మి.

"అంత తొందరేమొచ్చింది. వెళ్ళచ్చులే తాపీగా" అన్నాడు తండ్రి గంగాధరం.

"ఇల్లొదిలి చాలా రోజులయింది నాన్నా! వెళ్ళాలి. మళ్ళా రమ శ్రావణమాసం నోములుకి రావాలి."

"వెళ్ళచ్చులేవే. పుట్టిల్లేగాని పరాయి చోటుకాదుగా" అంటూ అసలు వ్యవహారంలోకి దిగింది సుభద్రమ్మ "రమ పెళ్ళితో




బావ బాగా అప్పుల్లో పడ్డాడు."

"అవును మరీ. అన్నీ తాహతుకి మించే చేశారు. కట్నం గాకుండా పెండ్లి ఖర్చులకు ఎదురివ్వటం. వాళ్ళూ ఆడంబరంగానే ఖర్చు చేశారు. అప్పు కాకుండా ఎలా వుంటుంది?"

"అవసరాలొచ్చినపుడు డబ్బుకి వెనకాడితే ఎల్లా? బాగా బతికిన కుటుంబాలు" సుభద్రమ్మ దీర్ఘం తీసింది.

లక్ష్మి ఏం మాట్లాడలా. విని వూరుకున్నది.

"పదెకరాల పొలం. ఏదో వ్యాపారం వున్నా ఇంకో ఆడపిల్ల పెళ్ళికున్నది. మగపిల్లాడూ ఇంకా చిన్నవాడే. ఇంత అప్పు వచ్చే ఆదాయంతో ఏం తీరుస్తాడో?" తండ్రి అందుకున్నాడు.

"రమకు కట్నంగా ఇస్తామన్న రెండెకరాలు నీ పొలం నుండి ఇస్తే వాళ్ళ పదెకరాలు కదలకుండా మిగిలిన పిల్లలకుంటుంది" బ్రహ్మాస్త్రాన్ని వదిలింది సుభద్రమ్మ.

అనుకోని ఈ పరిణామానికి లక్ష్మి అవాక్కయింది కొంతసేపు. తనకు కట్నంగా ఇచ్చిన పొలం, ఇన్నాళ్ళుగా ఆ పొలం మీద వచ్చిన ఆదాయంతో కొన్నది - మొత్తం పదెకరాల పొలం ఇక్కడనే వున్నది.

కాసేపటికి తమాయించుకొని "అదెలా కుదురుతుందమ్మా! మీరు కట్నం కింద ఇచ్చేసాక అది ఆయన ఇష్టం కదా! అయినా మాకూ పిల్లలున్నారు" నుదురు చిట్లించింది లక్ష్మి.

"నువ్వే ఇలా అంటుంటే ఇక అత్త గాణ్ణేమడుగుతాం. పిల్లలున్నారంట పిల్లలు. కడుపున మోసి కనీ పెంచావు గదూ!" ఈసడించింది.

"కడుపునకనే అదృష్టం లేకపోయినా ఆయన బిడ్డలు నా బిడ్డలే'' కన్నీళ్ళు ఆపుకోలేకపోయింది లక్ష్మి. భర్త రెండో పెండ్లి తరువాత తనెప్పుడు పుట్టింటి కొచ్చినా ఏడుపులతో సాగనంపే. 'వీళ్ళు కన్నవాళ్లయి వుండికూడా వీళ్ళకు నా ఆస్థిమీద వున్న ధ్యాస నామీద లేదు' అని లోలోపలే ఎంతగానో బాధపడింది లక్ష్మి.

* * *

గీత ఏంచేసినా ముద్దే లక్ష్మికి. అరుణ లక్ష్మిలా బయటపడదు. గీత నెలలపిల్లగా వున్నప్పుడు కూడా పసితనపు చేష్టలకు ఒకటే మురిసిపోయేది. తగిన వయస్సొచ్చాక పిల్లలు బోర్లాపడరా? కూర్చోరా? నుంచోరా? నడవరా? - అంతా విడ్డూరమే లక్ష్మికి. సాయంకాలాలు స్నానం చేయించి ఆరుబయట పడుకోబెడితే నోట్లో వేలేసుకొని కాళ్ళు కదిలిస్తూ ఆకాశం వంక, గాలికి కదిలే చెట్ల ఆకుల వంక చూస్తూ బోసినవ్వులు చిందిస్తుంటే అదో అపురూపమయిన అద్భుత దృశ్యంగా వుండేది. వివిధ భంగిమల్లో గీతను ఫొటోల్లో బంధించాలనీ, ఎప్పుడూ ఫొటోలు తీయించాలన్నదే లక్ష్మికి.

"ఇలాగయితే నా సంపాదన గీత ఫొటోలకు చాలదు లక్ష్మి" అనేవాడు శేఖర్.

"ఏం ఫరవాలేదు. అలాగయితే మీ ఖర్చులు తగ్గించుకోండి"

పాకడం మొదలెట్టిన గీత ఎక్కడా ఏ వస్తువూ వుంచేది కాదు. అన్నీ లాక్కొచ్చే సేయడమే.

గీత చేసే చిలిపి పనులకంటే లక్ష్మి హడావిడే ఎక్కువగా వుండేది. "ఏ వస్తువూ పెట్టిన చోట వుండటం లేదు. అల్మైరా తలుపులు తీసేస్తోంది. ఫోనెత్తు

తోంది. పేపరు చదవబోతోంది'' అంటూ రన్నింగు కామెంటరీ చెప్తుండేది.

"దాని గొడవకంటే నీ గోల ఎక్కువైంది. కాస్త నేను చదివిందాకానన్నా ఆ పేపర్లు జాగ్రత్తగా పెట్టండి" అని శేఖర్ విసుగు.

శేఖర్ పసివాళ్ళనెత్తుకోవడం చేతకానట్లు ఇబ్బంది పడేవాడు. తన అక్కచెల్లెళ్ళ పిల్లల్ని కూడా ఎన్నడూ ఎత్తుకున్న అలవాటులేదు.

అయినా ఏదో సాకుతో శేఖర్ గీతను ఎత్తుకోవాల్సిన అవసరం కల్పించేది. పిల్లను శేఖర్ వడిలో కూర్చోబెట్టి లోపలేదో అర్జంటు పనున్నట్లు వెళ్ళేది. గీత మాత్రం చిద్విలాసంగా తన పని తాను కానిచ్చేసేది పిల్లను కింద కూర్చోబెట్టి లుంగీ మార్చుకోవడానికి స్టాండు దగ్గరకెళ్తే గీత అరున్నొక్కరాగం అందుకునేది.

గబగబా బయటికొచ్చిన లక్ష్మి గీతను చంకనేసుకొని గడ్డం కింద చేయి పెట్టుకొని "ఇదెక్కడి చోద్యం? పసిది పాసుకెడితే లుంగీ మార్చుకోవాలా! భలేవాళ్ళేనండీ" అని ఆశ్చర్యపడేది.

లక్ష్మి బిడ్డతో ఎంత అనుబంధంగా వున్నా తల్లి కనబడితేచాలు తల్లివైపునకే చేతులు చాచేది. పాలు తాగుతూ అమ్మ మెడలోని గొలుసుతోఆడుకోవడం, కాళ్ళు ఆడించడం అమాయకమైన చూపులు- ఎంత మధురమైన అనుభవం. అందుకే స్త్రీకి మాతృత్వం ఓ వరం అన్నారు. దేనికైనా పెట్టిపుట్టాలి. లక్ష్మికి నిస్పృహగా అనిపించేది. లక్ష్మి ఆలోచనలు ఇంతవరకే పరిమితం. ఆ బిడ్డలే దారి తప్పితే తల్లికి అంతకుమించిన శాపం ఇంకేముంటుంది. బిడ్డలను కనడంతోనే సరిపోదు. బిడ్డలను సరైన పౌరులుగా తీర్చిదిద్దడానికి ఎంత శ్రమపడాలి? ఎంత ఓర్పు కావాలి? అప్పుడే మాతృత్వానికి సార్థకత. కాని ఈ నిజాన్ని, మనకర్మ సిద్ధాంతం 'పుణ్యంకొద్దీ పురుషుడు, దానంకొద్దీ బిడ్డలు' అన్న శుష్క వేదాంతంతో కొట్టిపారవేసుంది.

ఇంకో వారంరోజుల్లో గీతకు సంపత్సరం నిండుతుంది. పుట్టినరోజు ఘనంగా చేయాలని లక్ష్మికి ఉబలాటంగావుంది. అప్పుడప్పుడూ అరుణతో అంటూనే వున్నది. అరుణకూడా అటువంటి ఆడంబరాలు తనకిష్టంలేకపోయినా లక్ష్మికి ప్రతికూలంగా మాట్లాడలా. ప్రతి స్వల్ప విషయంలోనూ లక్ష్మి అభీష్టాన్ని వ్యతిరేకించడం సమంజసంకాదనుకున్నది. రాత్రి ఏడుగంటల వార్తలు వింటున్న శేఖర్ దగ్గరకు గీతతో వచ్చి కూర్చున్నది లక్ష్మి.

గీత పుట్టినరోజుని గురించిన ప్రస్తావన తెచ్చింది.

"అందులో నాదేముంది. మీ ఇద్దరిష్టం. ఈరోజు మీ బావ దగ్గర్నుండీ వుత్తరం వచ్చింది"

"ఏమిటో విశేషాలు. అంతా బాగున్నారా?"

"ఇదిగో తీసుకొని నువ్వే చదువుకో"

"నేను తరువాత తీరుబాటుగా చదువుతాను కాని విశేషాలేమైనా వుంటే నాలుగు ముక్కల్లో చెప్పండి. ఆయన బ్రహ్మరాత చదవాలంటే నా కళ్ళజోడెక్కడుందో తెచ్చుకోవాలి"

"అల్లుడు శ్రీనివాస్ సి. ఎ. పాసయ్యాట్ట"

"రమ ఆ ఇంట్లో కాలుబెట్టిన వేళా విశేషం. ఏమైనా రమ అదృష్టవంతురాలు"




"హైదరాబాద్‌లో ఏదో ప్రయివేటు ఫరంలో వుద్యోగం కూడా వచ్చిందట. రెండు వేలు జీతం"

లక్ష్మి చెవులు ఇంతింత చేసుకొని వింటోంది.

"ఇంటికి బిడ్డొచ్చిన వేళా గొడ్డొచ్చిన వేళా అని వూరికే అన్నారా? దానికి అనుభవించే యోగంవుంది"

"కాస్త గుర్రాన్ని కట్టేసి చెప్పేది పూర్తిగా విను"

"హైదరాబాదులో కాపురంపెడతారట. ఫ్రిజ్ గట్రా ఇంకా ఏమేం కావాలోమరి. పదివేలు తెమ్మని రమను పుట్టింటికి పంపారట. మిల్లులో ధాన్యం డబ్బురాగానే ఇచ్చేస్తాను; పదివేలు సర్దమని రాశాడు"

"ఇదెక్కడి చోద్యం. అనుకున్నదనుకున్నట్లుగా మొత్తం డబ్బు ఫిక్సెడ్ డిపాజిట్లోవేసిఅయినాకూడా స్కూటరుకు కావాలంటే పదివేల రూపాయలిచ్చారు. వీళ్ళేమైనా డబ్బు పాతర్లు వేసుకున్నారా తవ్వి తీసిఇయ్యడానికి? వాళ్ళకదేంపోయే కాలం. వెనక ఆస్తిపాస్తులున్నాయి. పెద్ద పెద్ద మొత్తాలే వడ్డీలకిస్తుంటారట. కావలసినవి వాళ్ళ డబ్బుతో కొనుక్కోకూడదూ. ముష్టి ముదరష్టపాళ్లు" ఒక్కసారిగా లక్ష్మికి వళ్లు మండిపోయింది.

ఫోన్ రింగైంది. అమ్మ ఒడినుండి దూకి కాళ్ళ పట్టీలు ఘల్లు ఘల్లుమంటుంటే తప్పటడుగులు వేసుకొంటూ ఫోనుదగ్గర కెళ్ళి రిసీవరుపై చేయివేసింది గీత. కిల కిలమంటూ తండ్రి వైపుకి చూసింది. కూతుర్ని ముద్దెట్టుకొని రిసీవరు చేతిలోకి తీసుకున్నాడు శేఖర్.

"హలో"

"ఆ...ఆ. జ్ఞాపకముంది 8 గంటల కల్లావచ్చేస్తాను" ఫోన్ పెట్టేశాడు శేఖర్.

"ఎక్కడికండీ?"

"టౌనుహాల్లో మీటింగుంది. వెళ్లాలి"

"మీరు మా బావకేం రాస్తారు"

"రాయడానికేముంది. పదివేలకు డ్రాఫ్టు తీసుకున్నాను. పంపడానికి"

"అవసరానికి ఆదుకోకతప్పదనుకోండి. మా నాన్న, అన్నయ్య మరీ రెండు సంవత్సరాల నుండి మన పంట మనకు సగానికి సగం తగ్గించి ఇస్తున్నారు. అందుకు సవాలక్ష కుంటిసాకులు చెబుతున్నారు. ఇకముందు కూడా వాళ్లు పూర్తిగా సవ్యంగా ఇస్తారనే నమ్మకం నాకు లేదు"

"అయితే మనం మాత్రం ఏం చెయ్యగలం? వాళ్ళకు కాకుండా పొలం ఇతరులకు కౌలుకివ్వటం ఏం బాగుంటుంది?" అన్నాడు శేఖర్.

"పొలం బేరం బెట్టేస్తే?"

"ఏమోలే. నెమ్మదిగా తీరుబాటుగా ఆలోచిద్దాం. నేను రావడం ఆలస్యమయితే మీరు భోంచేసెయ్యండి. నేనొచ్చేసరికి 9.30 కావచ్చు" బట్టలు మార్చుకోవడానికి అక్కడినుండి వెళ్ళిపోయాడు.

లక్ష్మి అక్కడే అలానే కూర్చుండిపోయింది. ఏమేం చెయ్యాలి? ఎవరిని పిలవాలి? పుట్టినరోజు ఏర్పాటులను గురించిన ఆలోచనలతో ఎంతో సంతోషంగా ఉన్న లక్ష్మి ఆనందానికి సడన్ బ్రేక్ పడినట్లయింది. రమ అత్తింటి వాళ్ళను గూర్చిన ఆలోచనలు చికాకు కలిగించాయి. ఆడపిల్లల పెళ్ళిళ్ళు చెయ్యడమే బ్రహ్మప్రళయంగా ఉందనుకొంటే ఆపైన వాళ్లు కోరే వరాలు తీర్చాలంటే దొడ్లో ఓ కామధేనువో, కల్పవృక్షమో ఉండాల్సిందే!

* * *

చుట్టాలు, పక్కాలు, స్నేహితులు, ఆ పేటలో సగం మందిని పిలిచారు. అతిథులు చాలామందే అయ్యారు. లక్ష్మి అక్క సరస్వతి, పిల్లలు రమా, ఉమా, లక్ష్మి మరదలూ, అరుణ పుట్టింటివాళ్లూ, శేఖర్ అక్క చెల్లెళ్లూ, వాళ్ళ పిల్లలూ అంతా వచ్చారు. ఇల్లంతా ఒకటే సందడిగా వుంది.

మధ్యాహ్నం పేరంటం ఆడంబరంగా జరిగింది. ఇంటికి వచ్చినవాళ్లు వచ్చినట్లు మెదలకుండా తినిపోతారా? రకరకాల వ్యాఖ్యానాలు.

"చదువుకున్నమ్మాయిగదా! తెలివైందే. చక్కగా బిడ్డను లక్ష్మికి మాలిమి చేసింది. ఒక్క దెబ్బకు రెండు పిట్టలు. ఇటు తన మంచితనం, విశాల హృదయాన్ని చాటుకోవచ్చు. అటు తనకు పీసమెత్తు శ్రమ లేకుండా పిల్ల చాకిరీ చేయించుకోడం. లక్ష్మి పేరుతో బోలెడంత ఆస్తి ఉండె"

"చిన్నావిడ భర్తతో అంత సఖ్యతగా వుండదంటారు"

"మరైతే ఆ పిల్లనెలా కన్నట్టు?"

"పిల్లలకేం భాగ్యంలే. ఎడముఖం పెడముఖాలతోటి ఏటికో బిడ్డను కన్న వాళ్లున్నారు"

"పిల్లమాత్రం ముత్యంలా ఉన్నది"

"సవతుల పోరన్నమాట పూరికే పుట్టిందా? వీళ్ళ మధ్య మాత్రం పొరపొచ్చాలు రావా? గుద్దుకోకుండా ఉంటారా? అప్పుడుగాని ఈ లచ్చమ్మ పని వుండదు"

ప్రత్యేకంగా లక్ష్మిగాని, అరుణగాని ఎవరికి ఏ హానీ చేసింది లేదు. అయినా ఎవరు సుఖంగా బతుకుతున్నా చూసి ఓర్వలేకపోవడమనేది లోకం తీరు.

లక్ష్మి ఎవరి వ్యాఖ్యానాలనూ, ముక్కు విరుపులూ మూతి విరుపులనూ ఖాతరు చెయ్యలా. తమను కాదన్నట్లే చెవిలో పడ్డా విని పూరుకున్నది. రెండో రోజుకి చుట్టాలంతా ఎక్కడివాళ్ళక్కడ సర్దుకున్నారు. రమ మాత్రం ఓ వారం తరువాత వస్తానని వుండిపోయింది.

తుఫాను వెలిసి తెరపిచ్చినట్లు హాయిగా వూపిరి పీల్చుకున్నారు ఇంట్లో వాళ్లంతా. ఆ సందర్భంగా తనకు లభించిన సిల్కు చీరెను చూసుకొని మురిసిపోయింది భాగ్యం.

ఏ పిల్లలు ఎక్కడ గీతను పడేస్తారో అని తల్లడిల్లిపోయింది లక్ష్మి.

"అయ్యిందమ్మా పెళ్ళి! అణిగిందమ్మా రంధి! ఎందుకొచ్చిన ఆడంబరాలక్కా. ఏదో పదిమంది ఒకచోట కలుసుకొని పిచ్చాపాటి మాట్లాడుకొని కాలక్షేపంచేస్తే అదివేరు. ఏవేవో వంకలు బెట్టేవాళ్ళు, మూతులు ముక్కులు విరిచేవాళ్ళు...ఎందుకొచ్చిన హైరానా. ఏదైనా మంచిపనికి ఈ డబ్బు వుపయోగిస్తే మన మనస్సుకి తృప్తయినా మిగులుతుంది"

"ఎవరో ఏదో అనుకుంటే మనకేంటిలే. వాళ్ళపాపాన వాళ్ళే పోతారు. ఏదయినా మంచిపనికి అంటే జ్ఞాపకం వచ్చింది. ఈ సంవత్సరం కురిసిన వర్షాలవల్ల వచ్చిన వరదలకు వందలకోట్ల రూపాయల నష్టం వచ్చిందంటున్నారు గదా .. ఏదో వుడతాభక్తిగా మన గీత పుట్టినరోజు సందర్భంగా మనంకూడా ఓ ఐదువందలు ముఖ్యమంత్రి నిధికిస్తే బాగుంటుందిగదు అరుణా!" లక్ష్మి కళ్లు మెరిశాయి.

"ఎందుకు బాగుండదు బాగానే

వుంటుంది."

"ఆయనేమంటారో?"

"పేపర్లో పేరు పడుతుందిగాబట్టి సరేనంటార్లే! లేకపోతే ఎందుకొచ్చిన గొడవ. ఈ డబ్బు సద్వినియోగం అవుతుందా, పెడుతుందా? వసూలయిన డబ్బులో ఓ వంతు కాంట్రాక్టర్ల జేబులోకి పోతుంది. ఓ వంతు ఆఫీసర్ల జేబుల్లోకి పోతుంది. మూడోవంతు మాత్రం నిజంగా బాధితులకుపయోగపడొచ్చు అని లెక్కలు చెప్పి వద్దులే అనయినా అనొచ్చు."

"నువ్వు మరీను అరుణా... ఆదిలోనే హంసపాదంటావు. మనం తప్పకుండా ఇద్దామంటే ఆయనేం కాదనరు" అన్నది లక్ష్మి.



5

పనుల వత్తిడిలో మొదటి రెండురోజులూ రమనెవ్వరూ అంతగా గమనించలా. తరువాత ఒకటి రెండురోజుల్లో సదా మౌనంగా దిగులుగా వుంటున్న రమను చూసిన లక్ష్మికి రమ దేనికో బాధపడుతోందా అనిపించింది. సరస్వతి వెళుతూ వెళుతూ చూచాయగా చెప్పింది _ రమ అత్తా, ఆవిడతల్లీ ఇద్దరూ కూడా సూరేకాంతం బ్రాండు మనుషులు అని. ఏమైనా సరస్వతితో తీరుబాటుగా మాట్లాడటానికి లక్ష్మికి కుదరలా. రమనే నెమ్మదిగా కదిలించి విషయం తెలుసుకోవాలనుకొంది.

మధ్యాహ్నం తీరుబాటుగా కూర్చున్న అరుణ బుర్రలోనూ ఇవే ఆలోచనలు చోటుచేసుకున్నాయి. ఇదివరకు రమ ముఖంలో కనుపించేది అహంభావంగాని, ఇతరులంటే లక్ష్యంలేనితనపు ఛాయలుగానీ కనిపించడంలా. పరీక్షతప్పిన విద్యార్థినిలా, జీవితంలో అపురూపమైన దేనినో పోగొట్టుకున్నట్లు నిర్లిప్తతతో నిర్జీవంగా కనబడుతోంది. కొత్తగా పెండ్లయిన పిల్లల్లో కనుపించే కళా కాంతులు ఏమీలేవు. విడ్డూరమనిపించింది అరుణకు. అత్తవారు ఆస్తిపరులు. భర్త అందగాడేగాక పెద్దజీతం కూడా. ఈడూ జోడూ అయినవాళ్లు! ఈ పిల్లకేం సమస్యలుంటాయబ్బా?

ఆలోచనలలా సాగిపోతుండగా అడపోయిన తీర్థమెదురయినట్లు రమే అక్కడికొచ్చింది.

"నీకు నూరేళ్ళాయుష్షు రమా...రా ఇల్లా కూర్చో. నిన్ను గురించే ఆలోచిస్తున్నాం." తనపక్క కుర్చీ చూపించింది అరుణ.

"నూరేళ్లాయుష్షా! నీకు నామీద ఎంత కోపమున్నా అంత పెద్దశాపం మాత్రం పెట్టొద్దు అరుణా" గొంతు జీరగా వచ్చింది రమకు.

"నువ్వు నన్ను ఏకవచన ప్రయోగం చేస్తున్నందుకు మాత్రం నేను చాలా సంతోషిస్తున్నాను రమా. నన్ను నీ ఆప్తురాలుగా భావిస్తున్నావనే అనుకొంటున్నానుగాని నామీద మరీ అంతపెద్ద అభాండం వేయడం మాత్రం అన్యాయం. నీమీద నాకు కోపమా?"

"అయితే సంతోషం. నాగురించి ఏమాలోచిస్తున్నావు?"

"నిజం చెప్పమన్నావా? అబద్ధాలా?"





వాతావరణాన్ని తేలికపరచాలని నవ్వుతూ అన్నది అరుణ.

"నువ్వు అబద్ధాలు చెపుతావా అరుణా! అలాగయితే ఇంక నాకు మనుషులపట్ల విశ్వాసమనేది లేకుండా పోతుంది."

"నన్ను మరీ అంత పెద్ద చెయ్యకు. మనం చిన్నవో పెద్దవో అబద్ధాలు అప్పుడప్పుడు ఆడకుండా జీవితాలను వెళ్ళదీయగలమంటావా? నేనేం ఆలోచిస్తున్నానో చెప్పమంటావా? గలగలాపారే సెలయేటినీ, చెంగు చెంగున గంతులేసే లేడిపిల్లనూ తలపుకు తెచ్చే రమ ఇంత గంభీరంగా, మౌనంగా అయిపోయిందేమిటా అని ఆలోచిస్తున్నా"

"అరుణా...చదువుకొనే రోజుల్లో కలలుగనే అందమైన హరివిల్లులాంటి జీవితం ఏ కొద్ది మంది విషయంలోనయినా అనుభవంలోకొస్తుందా అని!"

"మద్దెల వెళ్ళి రోటికి మొరపెట్టుకున్నట్లు ఈ ప్రశ్న నన్నడిగితే నేనేం చెప్పేది? ఈ ప్రశ్న మనిద్దరం కలిసి ఇంకెవ్వరినేనా అడగాల్సిందే రమా!"

"మన సమాజంలో జరిగే పెళ్ళిళ్ళలో ఎక్కువమంది వధూవరులు కులం, మతం, ఆర్థికపరంగా సమానస్థాయిలో ఉన్నవాళ్ళ మధ్యే జరుగుతాయి తప్ప ఇద్దరి మనస్తత్వాల్లో, అభిరుచుల్లో, ఆలోచనల్లో ఏకీభావం వుందా లేదా అనే విషయం పట్టించుకునేదెవ్వరు? అసలు మన ఆడవాళ్ళకు సైతం ప్రత్యేకమైన అభిరుచులు, ఆదర్శాలు వుంటాయనే విషయాన్ని గుర్తించేదెవరు? మన వివాహాలు విజయవంతం కాకపోవడం అంతా లాటరీ వ్యవహారం.

"ఇద్దరు అపరిచితులు వైవాహిక బంధంతో ఏకం చేయబడ్డా ఎవరి వ్యక్తిత్వాలు వారివి. ఇద్దరి మధ్యా వైవిధ్యం లేకుండా వుండదు. అయినా తెలివైనవాళ్లు పరస్పరం ఒకరినొకరు అర్థం చేసుకొని జీవితాన్ని నందనవనం చేసుకుంటారు. ఎద్దు ఎండకూ, దున్నపోతు నీడకూ బండిని లాగినట్లు ప్రతి చిన్న విషయానికి తగూలాడుకొంటూ జీవితాన్ని నరకప్రాయం చేసుకునేవాళ్లు కొందరు. ఏ అనుభూతి లేకుండా జీవితాన్ని కూడా ఓ వ్యాపారంలా భావించి గడిపేసేవాళ్లు మరికొందరు. నానారకాలవాళ్లూ వుంటారు రమా"

"నిండు నూరేళ్ళ జీవితాన్ని విధికి పదిలేసెయ్యడం ఎంత దురదృష్టకరం. డబ్బుంటే ఈ భూమ్మీద అందని ఆనందం లేదనుకునేదాన్ని. కాని ఈ మధ్య పదేపదే నాకో సూక్తి బుర్రలోకొస్తోంది అరుణా! మనిషికి కేవలం తిండి దండిగా వుంటే చాలదు అన్నారెవరో" రమ ముఖంలో నైరాశ్యం.

"నీ ఆలోచనలు చాలా దూరం ప్రయాణం చేస్తున్నాయి రమా! నీ జీవితంలో రల దూరుస్తున్నాననుకోకపోతే నీకొచ్చిన కష్టమేమిటనసలు!"

"ఒక్కమాటలో ఏం చెప్పనరుణా! ఇదివరకు నాకు పిక్లిస్ తప్ప డైలీ పేపరు చూసే అలవాటుండేదికాదు. కాని ఈ మధ్య ఏమీ తోచకగాని ఏమైనా డైలీ పేపరు రెగ్యులర్‌గా చూడటం అలవాటైంది. పేపర్లో ఏదో మూల వరకట్నం చావుల వార్తలు లేనిరోజు వుందోందా? అవి చూస్తుంటే నావంట్లో వణుకొస్తుంటుంది. దీన్నిబట్టి నా పరిస్థితేమిటో నీవు అర్థం చేసుకోగలవనుకుంటా" బరువుగా వున్నది రమ కంఠం.



"ఏమిటో రమా.... మన ఆడవాళ్ళకు డబ్బులు వున్నవాళ్ళకూ, లేనివాళ్ళకూ అందరికీ జీవితాలు బాధాకరంగానే వుంటున్నాయి. దీనికి పరిష్కారమేమిటో? ఇవాళ నీవు మరీ చికాకుగా వున్నట్లున్నావ్. సరస్వతిలో మల్లీశ్వరి సినిమా. వెడదామా? నేను సినిమా చూసి చాలా కాలమయింది"

"ఓకే. పిన్నితో చెప్పి అందరం వెడదాం"

"శేఖర్‌కి ఏదో పనున్నదట రానన్నాడు. గీత గొడవ చేస్తుంది. మీరిద్దరూ వెళ్ళండి. నేనింటి వద్దే వుంటాను" అన్నది లక్ష్మి.

"గీతనెలాగో సముదాయించవచ్చు గానీ వెళితే అందరం వెళదాం. లేకుంటే మేమూ మానేస్తాం" అన్నది రమ.

భాగ్యంతో సహా నలుగురూ బయలు దేరారు. ఎ.సి.హాలు కావడంతో గీతేం గొడవ చెయ్యలా. భాగ్యం ఒడిలో నిద్ర పోయింది. అంతా సినిమాలో పూర్తిగా లీనమైపోయారు. ఆడవాళ్ళ సీట్లలో అంతా ముక్కులు చీదేసేవాళ్ళే. సినిమా అయిపోయింది. అంతా లేచారు.

"ఇల్లాంటి సినిమాలంటే జేబులు కొట్టేవాళ్ళకు ఎంతైనా ధన్యం. పరిసరాలే మర్చిపోయాం" మెడలో గొలుసును తడుముకొంటూ అన్నది భాగ్యం.

"నిజమేనక్కా! నేను రెండోసారి చూడటం. అయినా ఎక్కడా విసుగనిపించలా" భాగ్యం చంకలో నిద్ర లేచి రాగం మొదలెట్టిన గీతను తన చేతిలోకి తీసుకొంటూ అన్నది అరుణ.

రమ మౌనంగా వున్నది.

అంతా ఆటోలో ఇంటికి బయలు దేరారు.

* * *

లక్ష్మి మామిడికాయలు ముక్కలు కోస్తుంటే రమా, అరుణా జీడి తీసి ముక్కలు తుడుస్తున్నారు.

"ఇలా కుదురుగా కూర్చొని జీడి తియ్యడం నీజాతకంలో ఏనాడైనా వున్న దంటే రమా! నీ వాలకం చూస్తుంటే మనిషివే పూర్తిగా మారిపోయినట్లున్నావ్. బరువూ బాధ్యతలు నెత్తినబడ్డవాళ్ళలా పెద్దదానివయిపోయినట్లు మాటామంతీ తగ్గించేసావ్" రమ అత్తింటి విషయాలు తెలుసుకోవాలనే రమను కదిలించింది లక్ష్మి.

"జీవితంలో ఇంకా కొన్నాళ్ళపాటు ఎక్కడ సుఖపడిపోతానో అని చేసేసారుగా పెళ్లి. అందుకే ఆరిందానయి పోయాను"

"అవేం మాటలే. నీయిష్టం లేకుండా చేసారంటే నీపెళ్లి?"

"కాదనుకో పిన్నీ! రాత్రి సినిమాలో చూడు - పీసమెత్తు పనిలేకుండా అంతఃపురంలో నగలు, పట్టు పీతాంబరాల్లో మల్లీశ్వరి సుఖపడుతుందనుకున్నది తల్లి. నా విషయంలో అమ్మా నాన్నల సంగతలా ఉంచి చూసేవాళ్లు కూడా బంగారంలాంటి సంబంధం అనే అనుకుంటారు. కాని నాకు ఆ ఇంటికి వెళ్లాలంటేనే భయంగా ఉందిపుడు..." రమ కంఠం గాద్గదికమైంది. "నాకు ఇంటి దగ్గర తిన్న ప్లేటూ, తాగిన గ్లాసు కూడా కడిగే అలవాటులేదు. అక్కడేమో ఇంట్లో పనివాడున్నా వంట నావంతే. ఏ పూట ఏం కూరలు వండాలో వాళ్ళనడగాలి. అడిగాక అరగంటక్కాని సమాధానం చెప్పరు. ఎలాగో తంటాలు పడి చేస్తుంటే ఉప్పెక్కువనో, కారం తక్కువనో ఏదో సతాయింపు. నన్ను





సాధించడానికి ఎప్పుడు ఏం అవకాశం దొరుకుతుందా అని వెతుకుతుంటారు. తల్లీ కూతురూ ఇద్దరికిద్దరే. సుష్టుగా తింటారు. ఎప్పుడూ కాలునొప్పో, చెయ్యి నొప్పో అని అపసోపాలు పడుతూనే ఉంటారు. అబ్బ... ఆ ఇల్లు యమకూపం" కళ్ళు తుడుచుకొంటూ అన్నది రమ.

"మరి మీ ఆయనేమనడా?" లక్ష్మి గొంతులో బాధ.

"ఆయనేమీ పట్టించుకున్నట్లుండరు. నా వలన ఏ చిన్న పొరపాటు జరిగినా ఏదో విధంగా ఆయన చెవిన వేసేదాకా వాళ్ళకు నిద్రపట్టదు. తల్లి ఆ పరిసరాలలో వున్నదంటేనే ఆయన నాతో ఫ్రీగా మాట్లాడటానికి వెనకాడతారు. కలిసి సినిమాకెళ్ళాలన్నా జంకే. వాళ్ళు లేనప్పుడు బాగానే వుంటారు. ఆ పిరికితనం నాకసహ్యంగా అనిపిస్తుంది. అన్నింటి కంటే పిన్నీ... నేను మొన్న అవనిగడ్డ రావడానికి ముందే ఎవడో మందులు కక్కిస్తాడట-వాణ్ణి తీసుకొచ్చి ఆయనచేత ఏదో పసరు తాగిచ్చి కక్కిచ్చారు పిన్నీ" భోరున ఏడ్చేసింది రమ. "ఆయన్ని వాళ్ళకు కాకుండా చేయడానికి నేనేదో మందు పెట్టానంట" వెక్కిళ్ళు పెడుతూ చెప్పింది.

"ఊరుకోవే తల్లీ. ఇదెక్కడి మాయదారి సంబంధం. ఒక్కడే కొడుకు. వెనకా ముందూ ఎవ్వరూలేరు. ప్రేమగా చూసుకుంటారనుకున్నాం. ఇదెక్కడి పాపం"

"పాపం కాదు మూర్ఖత్వం. ఎక్కడైనా మందుల్తో మనుషులు మారతారా? ఒకవేళ వాళ్ళలాంటి నమ్మకాలున్నవాళ్ళెవరైనా మందులు మింగించినా అవి జీర్ణమైపోతాయి తప్ప పొట్టలో తిష్టవేసుక్కూర్చుంటాయా కక్కించడానికి. ఆ పసరులాంటివి ప్రమాదం కూడాను. మీవారేమీ అభ్యంతరంపెట్టలేదా రమా తాగడానికి?" అరుణ అన్నది.

"ఆయన ఇష్టాయిష్టాలతో నిమిత్తంలేదు అరుణా. ఆవిడ తాగమంటే తాగాల్సిందే. లేకపోతే ఆవిడచేసే రాద్ధాంతానికి అంతుండదు. ఆ గొడవకంటే కళ్ళుమూసుకుని ఆ పసరేదో తాగడమే నయమనుకుంటారు"

'చదువుకున్న చవిటివెధవలు, వాజమ్మలు' మనస్సులోనే అనుకున్నదిఅరుణ. పైకి మాత్రం "హైదరాబాదులో ఫామిలీ పెట్టబోతున్నారుగా. అలాగయినా ఆ ముసలివాళ్ళ పీడ వదుల్తుందేమోలే" అంది.

"అదీ ఎండమావేఅరుణా...ఏలిననాటి శని. వాళ్ళు కొడుకునొదిలి వుండలేరట. వాళ్ళూ వస్తారట" రమ గొంతులో అంతులేని నిరాశ, నిస్పృహ.

"పెళ్ళికెంత ఖర్చయింది! ఆ తరువాతా అడిగినప్పుడల్లా డబ్బుయిస్తూనే వున్నాం. అయినా నీకు బాధలుమాత్రం తప్పడంలా. మధ్యవర్తుల ద్వారా ఏదో పరిష్కారం చూడాలి తప్ప ఈ బాధ లెక్కడ పడతావే" అందిలక్ష్మి కోపంగా.

"రోజులెప్పుడూ ఒకేలా వుండవు. కొన్ని సమస్యలకు కాలమే పరిష్కారం చూపొచ్చు. ఏ పరిస్థితిలోనూ నీవు నిరాశ పడకు. నీ శ్రేయస్సు కోరేవాళ్ళు, నిన్ను ప్రాణప్రదంగాచూసుకొనేతల్లిదండ్రులూ, ఆత్మీయులూ ఉన్నారనే విషయంమాత్రం సదా గుర్తుంచుకో రమా" ధైర్యంచెబుతూ అన్నది అరుణ.

"ఇంకలేవండి. రమా...మువ్వాముఖం కడుక్కో. ఆ కళ్ళుచూడు ఎలా వుబ్బి




పోయాయో! నువ్వు వెల్లుల్లిపాయలు పైపొట్టు తీసేస్తే, నేను పచ్చడి కలిపేస్తా అరుణా. భాగ్యం... నువ్వీ కత్తి పీటలు తీస చెంకెలపి ఎత్తేసెయ్యి" అంటూ లేచింది లక్ష్మి.

* * *

పేపర్లోవార్త పిడుగుపాటులా అనిపించింది అరుణకు. "కె.రఘు. తండ్రి ఉపాధ్యాయుడు. ఇంటర్మీడియేట్ మంచి మార్కులతో ఫస్ట్‌క్లాస్‌లోపాసై మెడిసిన్ చదువుతున్నాడు. రాగింగ్‌లో బట్టలు విప్పుకొని స్ట్రీకింగ్ చేయమంటే అవమానం భరించలేక ఆత్మహత్యకు పాల్పడ్డాడు"

రఘు తమ వూరివాడే. వేరేస్టేట్‌లో సీటొస్తే వెళ్లాడు. ఎంతో తెలివిగా,చురుగ్గా వుండేవాడు. ఇదేం పని! చదువుతున్న గాడిదలు. బుద్ధిమాలిన పనులు! పరాయి చోటికి వచ్చినవాళ్ళకు చేయూతనివ్వాల్సింది పోయి వెధవ నాగరికత, వెధవ ట్రెడిషన్స్. చిన్నవాళ్ళా చితకవాళ్ళా... ఎదిగిన పిల్లల్ని గుడ్డలిప్పుకోమనటం. అందులో హ్యూమరేమిటో. అయితే మాత్రం వీడు చావడమేమిటి? ఎలాగో తప్పించుకొని ఇంటికి వచ్చేసెయ్యొచ్చు. ధైర్యంగా ఇంకేదో చెయ్యొచ్చు. ఏం చదువులో ఏమిటో. డిగ్రీలు పుచ్చుకోవడానికి మినహా ఎందుకూ కొరగావడంలా. ఉపాధి కల్పనకెటూవుపయోగపడటంలా. ఆత్మవిశ్వాసం, హేతుబద్ధమైన ఆలోచనా ధోరణీ, విచక్షణాజ్ఞానం-వేటినీ పెంపొందించలేకపోతున్నాయి.

దున్నపోతు ఈనిందీ అంటే దూడను చెట్టుకుకట్టెయ్యమనడమే.ఏమైనా పాపం రఘు మంచి కుర్రాడు. వాళ్ళమ్మా,నాన్నలకు ఒక్కడే మగపిల్లాడు. ఎంతగా తల్లడిల్లిపోతున్నారో? వార్త చదివిన అరుణ బుర్రలో అంతులేని ఆలోచనలు ముసురుకున్నాయి. మనిషి బాధపడింది. తర్వాత ఆవేశపడిపోయింది.

పేపరు తీసుకొని భర్తున్న దగ్గరకెళ్ళి వార్త చూపించి అన్నది "రాగింగ్ చేసిన విద్యార్థులపై కేసు పెట్టచ్చుగదండీ" అని.

"పెట్టొచ్చు. కాని ఖచ్చితంగా రాగింగ్ చేసిన విద్యార్థులెవరో సాక్ష్యాధారాల్తో రుజువుపరచగలగాలి. అదే కష్టం. ఇటువంటి విషయాల్లో సాక్ష్యం లభించడం అంత సులువైన విషయం కాదు. ఇవాళ్టి విద్యార్థుల తీరుతెన్నూ చూస్తుంటే మన నాగరికత ఎంతటి వెర్రితలలు వేస్తోంది, ఇటువంటి వాళ్ళ చేతుల్లో మన సమాజ భవిష్యత్తు గతేమిటి అనిపిస్తూంటుంది. నిన్ననో లేక మొన్నటి పేపర్లోనో చూడు ఓ వార్తున్నది. అమెరికన్ పాప్ మ్యూజిక్ బృందమొకటొచ్చి కర్నాటకా స్టేట్‌లో ప్రదర్శన లిచ్చిందట" ప్రేక్షకుల్లో అధిక సంఖ్యలో వున్న ఇంజనీరింగు విద్యార్థులు లేచి తన్మయత్వంతో వాళ్ళు కూడా నృత్యం చేయడం ప్రారంభించారుట. అంతటితో ఆగితే బాగానే వుండేది. నృత్యంచేసేవాళ్ళలో ఒకడు లేచి స్టేజిమీదికెళ్ళి పూర్తిగా బట్టలు విప్పేసుకొని పాప్ మ్యూజిక్ బృందం నాయకుణ్ణి ముద్దెట్టుకుంటే ఆ అమెరికావాడు సైతం బిత్తరపోయాట్ట."

"ఛీ. ఛీ. ఈచదువులు దేశభక్తిని ప్రేరేపించడానికి గాని, మన సంస్కృతీ సాంప్రదాయాలను నిలపటానికి గాని ఎందుకూ వుపయోగపడటంలా!" భర్త చెప్పిన వార్త అరుణకు జుగుప్స కలిగించింది.

"ఏమైనా ఇటువంటి పద్ధతుల పట్ల

యూనివర్సిటీవాళ్ళే కఠిన వైఖరి అవలంబించి వాటిని అరికట్టచ్చు. కానీ అదికూడా అంత సులువని మాత్రం చెప్పలేం. మొన్న మార్చి పరీక్షలకు చూడరాదూ-కఠినంగా వ్యవహరించిన చోట్ల పరీక్షాధికారులపై విద్యార్థులు ఎంత రౌడీయిజం ప్రదర్శించారో? కాపీ చేయడం మా జన్మహక్కనే స్థితి వచ్చింది. అలానే రాగింగ్ కూడా మా హక్కని ఆందోళన లేవదీసినా ఆశ్చర్యపోనఖ్ఖర్లా. విద్యార్థులు తమ అసలు సమస్యల్ని వదిలేసి పెడదారులు పట్టిపోతున్నారు"

"ఈ అల్లరిమూక పది శాతం మించి వుండరండీ. ప్రతిచిన్న విషయం చిలికి చిలికి గాలివాన అయ్యేందాకా వుదాసీనంగా వుండటం పరిపాలకులకు అలవాటయింది. దాన్ని అలుసుగా తీసుకొని ఈ అల్లరి మూక పేట్రేగిపోతోంది"

"ఏమిటో దీర్ఘంగా చర్చించుకొంటున్నారు. తొమ్మిది దాటింది. స్నానానికి లేవరూ?" అంటూ లక్ష్మి వచ్చింది.

"ఆ లేస్తున్నా. అదేమిటి గీత చేతిలో ఏదో ఫొటో వున్నట్లున్నది" శేఖర్ తీసుకోబోతే గీత చేతులు వెనక్కుపెట్టి లక్ష్మికిచ్చింది.

లక్ష్మి, వాళ్ళక్కా పిల్లలు దిగిన ఫొటో అది. ఎప్పటిదో పాతది. "ఎక్కడెక్కడివీ దీని కళ్ళే బడతాయి" ఫొటోని పమిటకొంగుతో తుడుస్తూ అన్నది లక్ష్మి. "రమ అత్తారింటికెళ్ళిపోయుంటుంది. దాని కాపురం తలుచుకోవడానికే భయంగా వుంది"

"ఏవో కొత్తలో సమస్యలు. నెమ్మది మీద వాళ్ళే సర్దుకుంటారు" స్నానానికెళ్ళాడు శేఖర్.

లక్ష్మి అక్కడే అరుణ పక్కన కూర్చున్నది. రమను గురించిన ఆలోచనల్లో లక్ష్మి, రమునిగురించిన ఆలోచనల్లో అరుణ [illegible] కూర్చుండిపోయారు. గీత ఆరున్నొక్క రాగం ప్రారంభించటంతో ఈ లోకంలోకొచ్చారు.

బయట [illegible]పులు విప్పి గ్లాసులోకి నీళ్ళు పడుతు పారబోస్తూ వుండే భాగ్యం పంపు కట్టేసిందని ఏడుస్తోంది గీత.

లక్ష్మి, అరుణ బయటికొచ్చారు. భాగ్యం చంకలో గీత. భాగ్యాన్ని రక్కుతోంది కిందకు దింపమని. భాగ్యం దగ్గర్నుం[illegible]కున్నది లక్ష్మి. గేటు చప్పుడయితే అటువెళ్ళిందరుణ. ఎవరో సీదు కావిబట్టల మనిషి. కొబ్బరికాయలు కోస్తాట్ట. లక్ష్మితో చెప్పిందరుణ. కాయలింకా ముదరలేదు పద్దన్నది లక్ష్మి. ఆ మనిషిని చూసిన అరుణకు భాగ్యం తండ్రి జ్ఞాపకానికొచ్చాడు.

"అక్కా! ఈ వారంలో భాగ్యాన్ని వాళ్ళ వాళ్ళు తీసుకెళతామన్నారు గదూ"

"ఆ [illegible] వస్తారు వాళ్ళు దాన్ని తీసుకెళ్ళడానికి. మనింటికొచ్చేసరికి దానికి పదేళ్ళు. పని పనీ శుభ్రం, దొంగబుద్ధి లేదు. అయినా మనమేమనగలం వాళ్ళు దాన్ని తీసుకెళ్ళి పెళ్ళి చెయ్యాలంటుం[illegible]"

"మన కోళ్ళఫారానికి నమ్మకస్థుడైన మనిషి కావాలనుకుంటున్నాం గదా! వాళ్ళిష్టపడితే భాగ్యాన్ని చేసుకునేవాడిని ఇక్కడికే వచ్చి వుండిపొమ్మంటే మనకు ఇంట్లో భాగ్యం వుండి పోతుంది. ఆతను కోళ్ళ ఫారం చూస్తుంటాడు..."

"వాడెట్లాంటివాడో మనకు తెలియదు. ఆపైన వాడి[illegible] రావడానికి ఇష్టపడాలి. ఎన్ని[illegible]

"అవునక్కా.... వాళ్ళిష్టపడితేనే.

వాళ్ళొచ్చినప్పుడు మనం ఈ విషయాన్ని గురించి వాళ్ళతో మాట్లాడితే బాగుంటుం దేమో"

"మాట్లాడదాంలే. ఫరవాలేదరుణా.... నీకూ ఇంటి వ్యవహారాలు వంటపడుతు న్నాయి" చిన్నగా నవ్వుతూ అన్నది లక్ష్మి.

* * *

ఓ మంచి వుపాధ్యాయునికి తన వద్ద చదివిన వేలాదిమంది శిష్యుల ప్రేమాను రాగాల విషయంలో మాత్రం లోటుం డదు. ఓ పెద్ద బహుమతి గ్రహీత, పెద్ద శాస్త్రవేత్త, ఖ్యాతి గడించిన డాక్టరు, ఇంజనీరు, ఫలానా మంత్రి-వీళ్ళంతా నా శిష్యులే అని తలుచుకున్నపుడు ఆనం దంతో పొంగిపోతాడు. వారేగాక కొందరు బందిపోట్లూ, సంఘవ్యతిరేకశక్తులూ, దేశాన్ని అవినీతి మార్గాల్లో దోపిడి చేస్తున్న దొంగలూ కూడా తన శిష్యులే అయినా ఆ వాస్తవాన్ని తలుచుకోవ డానికి మాత్రం ఇష్టపడడు.

రాఘవయ్య చేసిన పంతులుద్యోగం కరుణకు వుద్యోగం సంపాయించుకోడా నికి తోడ్పడింది.

యమ్.యల్.ఏ. ప్రసాద్ రాఘవయ్య శిష్యుడు. చదువుకొనే రోజుల్లో ప్రసాద్ చదువు పట్టకుండా పోకిరీగా తిరుగుతుండే వాడు. ప్రసాద్ తండ్రి ఆ వూరిలోకెల్లా మోతుబరి. నయాన్నో భయాన్నో ప్రసాద్‌ను దారిలోబెట్టే బాధ్యత రాఘ వయ్యదేనని ఆయనకప్పగించేశాడు. రాఘవయ్య నానా తంటాలుపడి ప్రసాద్ యస్.యస్.సి. గట్టెక్కేలా చేయ గలిగాడు. తరువాత ప్రసాద్ టౌనుకెళ్ళి అంచెలంచెలుగా ఇంటరు అయిందనిపించి బి.ఏ. కూడా చదివాడు కాని పట్టా మాత్రం పుచ్చుకోలా.

చదువుని త్యాగం చేసేసి వచ్చి వూరి రాజకీయాల్లో పడ్డాడు. మస్తుగా డబ్బులున్నాయి గనుక తరువాత జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో అధికార పార్టీ తరఫున పోటీచేసి గెలిచి ఎమ్.ఎల్.ఎ. అయ్యాడు.

అతని ద్వారానే రాఘవయ్య కరుణకు వుద్యోగం సంపాయించగలిగాడు. మానవుడు చంద్రమండలంపై అడుగు పెట్టడం కంటే గూడా సామాన్యుడు తన బిడ్డకు వుద్యోగం సంపాయించుకోవటం కష్టంగావున్న ఈ రోజుల్లో కరుణ ఉద్యోగంలో చేరగానే తేలికగా వూపిరి పీల్చుకున్నాడు రాఘవయ్య. ఇక్కడికి ఈ ఘట్టమయింది. ఇంతకుమించి కష్ట మైన వివాహ ఘట్టం ఇంకా ముందేవుంది.

బాగా తెలిసినవాళ్ళ సంబంధం ఒకటుంది. సీతమ్మకు దూరపు చుట్టరికం గూడా. కుర్రాడు బుద్ధిమంతుడు. ఐ.టి.ఐ. చదువు ముగించి హైదరాబాదులోనే వుద్యోగం చేస్తున్నాడు. ఇదివరకైతే ఏమోగాని ఇప్పుడు కరుణకు కూడా వుద్యోగం వున్నదికాబట్టి తామిచ్చే కట్నానికి అందుబాటులో వుంటాడు. బాగుందనుకున్నారు రాఘవయ్య, సీతమ్మ కూడా. అయితే కరుణే ఐ.టి.ఐ. చదువు అదికూడా చదువేనా, నాకక్కర్లేదని మొండికెత్తుతోంది.

వాళ్ళూ ముప్పైవేలు కట్నమడుగు తున్నారు. ఇంతకంటే పెద్ద చదువులు చదివి వుద్యోగం చేసేవాణ్ణి తేవటం తమవల్ల అయ్యేపనికాదు. ఈ సంబంధం పోకుండా చూసుకోవాలి. అందుకే తాము బలవంతపెట్టకుండా అరుణను రప్పించి




అరుణ చేతనైనా నచ్చచెప్పించాలి. దాని మాటంటే వాసికి గురి అనుకున్నారు. సుధాకర్ చదువుకెంత ఖర్చయింది? ఎలాగో తిప్పలుబడి గవర్నమెంటు జాబు సంపాయించుకుంటే లక్షల్లో కట్నం వస్తుందనుకొంటుంటే గుర్రొచ్చి పిల్ల నెక్కిరించినట్లు వాడూ శ్రీరంగనీతులు పలుకుతున్నాడు. కట్నం తీసుకోట్ట. తనకు నచ్చిన పిల్లను చేసుకుంటాట్ట. ఆదర్శాలకేం భాగ్యం తనూ వల్లించగలడు. "ఊరందరిదీ ఓ దారైతే వులిపికట్టెదొకదారని" తానొక్కడూ తీసుకోనంత మాత్రాన సమాజం తలకిందులైపోతుందా? మరి కరుణను కూడా ఏ అయ్యకైనా పూరికే చేసుకుంటే బాగుండేది. ఏమైనా వాడింక తన మాట వింటాడన్న నమ్మకంలేదు. రెక్కలొచ్చాయి. అర్ధాలనాడే బిడ్డలుగాని గడ్డాలనాడుకాదన్న సూక్తిని రుజూచేస్తున్నాడు. వాడి వ్యవహారం తరవాత చూడచ్చు; ముందు అరుణను తప్పించి ఈ కరుణ పెళ్ళి ఖాయంచేస్తే తప్ప తమ గుండెలపై భారం దిగదు అనుకున్నాడు రాఘవయ్య.

* * *

అరుణ రాక కరుణకు తొలకరి జల్లులా హాయిగా అనిపించింది. పెండ్లి విషయంలో తనను ఒప్పించడానికే అక్కను నాన్న వెంటబెట్టుకొచ్చుంటారనుకున్నది. ఎందుకొచ్చినా అక్క రాక తనకు ఆనందదాయకం. తానుండే ఈ రెండు రోజులూ అక్కతో హాయిగా కాలక్షేపం.

మధ్యాన్నం సీతమ్మ పిల్లలకిష్టమయిన కోవా కజ్జికాయలుచేసి వేరుశెనగ పప్పులుండే వేయించి వుప్పుకారం జల్లింది. అంతా తింటూ కబుర్లాడుకుంటున్నారు.

అరుణే సంబంధం విషయం ప్రస్తావించింది. కాఫీ తాగిన రాఘవయ్య అక్కణ్నించి లేచి వెళ్ళిపోయాడు.

"నిర్మోహమాటంగా చెప్పవే కరుణా! భాస్కర్ అందమైనవాడు, గుణవంతుడు. తెలిసన సంబంధం. నీకెందుకనిష్టం లేదే?" అనడిగింది అరుణ.

"నువ్వూ, నేనూ కలిసుండే ఈ రెండు రోజులూ ఆ గొడవెందుకులేవే అక్కా! రేపు రాత్రికి నేను వెళ్ళిపోవాలి. ఇంకేవైనా కబుర్లు చెప్పు. నీకు ఓపిక ఉండి వింటానంటే మా ఆఫీసు కబుర్లు చెబుతాను" విషయం దాటవేయడానికి ప్రయత్నించింది కరుణ.

"నయం. నేనసలు వచ్చింది దేనికనుకుంటున్నావ్. ఈ విషయంలో ఎవరు బాధపడేదేమున్నది? నీకెందుకని ఇష్టం లేదో చెబితే అది సబబే అనుకుంటే నీ ఇష్టప్రకారమే కానిద్దాం. ఇందులో బలవంతమేమున్నది. నువ్వూ ఉద్యోగం చేసుకుంటున్నావ్. కాకపోతే నువ్వు చిన్నదానివి. నీ ఆలోచన సరైన దార్లో లేకపోతే, అది తప్పు అని సరిదిద్దాల్సిన బాధ్యత అమ్మా నాన్నలకున్నదిగదా... ఆపైన నీ ఇష్టం"

"కాదక్కా... అప్పుడే నా పెండ్లికి ఏమంత తొందరొచ్చిందే?"

"తొందరేంటే! హైదరాబాద్‌లోనే జాబ్ చేసుకునేవాళ్లూ, మనకందుబాటులో వుండి అన్నీ నచ్చినవాళ్లూ దొరకద్దూ?"

"ఆఁ... ఇంతోటి సంబంధం దొరక్కపోదులే"

"నీకెంత పొగరే కరుణా ! దూరపు కొండలు నునుపు అంటారిందుకే. ఇదే తెలియని సంబంధమై ఉండి, వెయ్యి

రూపాయల ఉద్యోగం అంటే మనం వేగబడేవాళ్ళం. ఆడపిల్లలూ, పెళ్ళిళ్ళూ, ఇబ్బందులూ తెలిసేమాట్లాడుతున్నావా?"

"ఏమోనక్కా... ఐ.టి.ఐ. అతన్ని చేసుకోడం నావల్ల కాదు బాబూ. ఫ్రెండ్స్ దగ్గ్లో నగుబాట్లు కూడాను" అసలు విషయం బయటపెట్టింది.

"నీ పెండ్లి నీ కోసరమా, ఫ్రెండ్స్ కోసరమా? మనిషి సత్తా, తెలివితేటలూ డిగ్రీల్తో కొలుస్తారా? కాయకష్టం చేసుకునేవాళ్ళు మనుషులు కాదా? డిగ్రీలు పుచ్చుకున్న చవిటివెధవల్ని,వాజమ్మల్ని ఎంతమందిని చూడటంలా? నీవు కాస్త రెండుకాళ్ళూ నేలకానించి ఆలోచించు. అతని తెలివితేటలూ, గుణగణాల్తో నీకేమైనా పేచీ వుంటే చెప్పు"

"అయ్యో రామ. ఆ పిల్లవాడు నాకు పుట్టిందగ్గర్నుంచీ తెలుసు. వాళ్ళ నాన్న పైచదువులు చెప్పించలేకా, ఓవేళ కష్టపడి చెప్పించినా వుద్యోగాలొస్తాయనే నమ్మకం లేకాఐ.టి.ఐ.లోచేర్చాడు కానీ ఆఅబ్బాయి తెలివితేటలకేమిటి?" సీతమ్మ అందుకున్నది.

"ఏమే కరుణా... మాట్లాడవ్ బెల్లం కొట్టిన రాయిలా"

"ఏం మాట్లాడనే అక్కా! ఓవైపు నీ ఇష్టం అంటూనే సాధిస్తున్నారాయె"

'సాధింపు కాదే బాబూ. బాధ్యత్తో ఆలోచించమంటున్నాం. ప్రెసిడెంటుగారి నిర్మల నీకూ తెలుసుగదా! యమ్. ఎ. చదివింది. నాలుగైదు లక్షలు కట్నమిస్తారు. ఐదారు సంవత్సరాలుగా దేశం మీద పడి వరుళ్ళ వేట సాగిస్తున్నారు. మరి ఇంద్రుడు కావాలో, చంద్రుడు కావాలో – ఇంతవరకు కుదరలేదు.





డబ్బులున్నవాళ్లు ఎంతకాలమైనా ఏమైనా ఫరవాలా. మనకెలాగే? కక్కొచ్చినా, కళ్యాణమొచ్చినా ఆగదు. ఆ ఘడియ రావాలంటూ ఎన్ని కాకమ్మ కబుర్లు చెప్పినా ఎవరైనా వాస్తవంలో వుండి ఆలోచించాలి. ఎప్పుడూ మనకంటే పైదూపైతే ఎలాగే? ఏమైనా తీరుబాటుగా ఆలోచించుకో. ఆపైన నీ యిష్టం. నీకు వంట చేసుకొని ఆఫీసుకెళ్ళడం ఇబ్బందిగా వుంటోందా?" తన పెండ్లిని గురించి మరలా తీరుబాటుగా ఆలోచించుకోవడానికి కరుణకు వ్యవధినివ్వాలని మాట మారుస్తూ అన్నది అరుణ.

"ఇబ్బందికేమున్నదిలే. రెండుగదుల ఇల్లు. పెద్ద పనేముంటుంది. నేను భోజనం చేసేసి 9.30 గంటలకే ఆఫీసుకెళతాను. తరవాత సుధాకర్ తనే భోజనం పెట్టుకుతిని తనసైకిలుకి తానెళతాడు"

"వాడికూ్కడా ఏదయినా గవర్నమెంటు అప్పాయింటుమెంటువస్తే బాగుండు. ఈ ప్రయివేటు కంపెనీల్లో జీతంమాట అలావుంచి యజమాని దయాదాక్షిణ్యాలమీద ఆధారపడాలయ్యె"

"వాడికూ్కడా ఆ ప్రసాద్ ద్వారానే కొంత డబ్బు ఖర్చుపడయినా గవర్నమెంటు ఉద్యోగం దొరకచ్చన్న ఆశతో వున్నారు మీ నాన్న" కాఫీ తాగిన గ్లాసులు తీసి లేస్తూ అన్నది సీతమ్మ.

అరుణా కరుణలిద్దరూ పిచ్చాపాటి కబుర్లలో పడ్డారు.

* * *

అక్కకూడా అమ్మా నాన్నలకే వత్తాసిస్తోంది. అన్న సుధాకర్ ఏవో కబుర్లు చెబుతాడు. ఈ చదువులు చదివీ చదవకా పెద్దతేడాఏముంది? ఈ చదువులు మనకేం వుపయోగపడుతున్నాయిలే అంటూ ఏదో చెబుతాడు తప్ప తనకు

వత్తాసూరాడు; చేసుకోమనీ చెప్పడు. అందరినీ కాదని తాను చేయగలిగింది కస బద్దంలా. చదువు తక్కువ, నలుగురిలో చిన్నతనం అనితప్ప ఆ భాస్కర్ అంటే తనకు ప్రత్యేక అయిష్టతాలేదు. అను కుని కిందామీదాపడి సగటు అమ్మాయిలా అమ్మా నాన్నలకు తన సమ్మతిని తెలిపింది కరుణ.

* * *

పెండ్లి ఇంకోవారం వుందనగా వచ్చింది అరుణ. ఇంకో రెండురోజులకు పెండ్లనగా సుధాకర్, కరుణ ఓ వారం సెలవు పుచ్చుకొనొచ్చారు. శేఖర్, లక్ష్మి చుట్టాలందరితోపాటు పెండ్లిరోజే వచ్చారు. కరుణకు వెయ్యిన్నూట పదహార్లు ఇద్దా మన్నాడు శేఖర్. 'అదేం కాదు. ఆడ పిల్లలకు ఏవేవో కోర్కెలుంటాయి. ఆ కోర్కెలు పెండ్లి సందర్భంగా తీరాలి సిందే తప్ప ఆ తరవాత కుదరవు' అంటూ ఓ పన్నెండొందలుపెట్టి పట్టుచీర తెచ్చింది లక్ష్మి. అరుణ కంటే కరుణకు ఆడంబరాల పట్ల మోజు. ఆ పట్టుచీర కరుణ కళ్ళలో మెరుపులు తెచ్చింది. ఎంతయినా ఆడపిల్ల కదా! ఇల్లంతా సందడి. గీత తీరిక లేకుండా బొమ్మలాగా అందరిమధ్యా తిరిగింది. పెండ్లి క్లుప్తంగా పెద్ద ఖర్చు లేకుండా జరిగిపోయింది. అయినా ఈ పెండ్లితో సీతమ్మకు వాళ్ళ పుట్టింటి వాళ్ళిచ్చిన ఎకరం పొలం పరాధీన మయింది. ఇంక తిండిగింజలు కూడా కొనుక్కోవలసిందే.

తెల్లవారేసరికి ఎక్కడివాళ్ళక్కడ సద్దుమణిగారు. లక్ష్మి తమతో గీతను తీసి కెళ్ళిపోతామన్నది. కాని సీతమ్మ అందు కొప్పుకోక వాళ్ళమ్మతో వస్తుందిలే అని ఆపింది. లక్ష్మి, శేఖర్‌లు వెళ్ళిపోయారు. అరుణ ఓ పదిరోజుల్లో వస్తానన్నది.

శారద అమెరికావెళ్ళి నాలుగు సంవత్స రాలు దాటింది. అప్పుడప్పుడూ క్షేమ సమాచారాల్తో వుత్తరాలువస్తూనేఉన్నాయి. శారద తల్లి కూతురికి పురుడు బోయ డానికి అమెరికావెళ్ళి మూడునెలలయింది; పదిరోజుల్లో వస్తుందని తెలిసిన అరుణకు ఆమెను కలుసుకొని శారద విషయాలు ముఖాముఖీ తెలుసుకోవాలన్న కోర్కె. అందుకే ఆ పదిరోజుల గడువుపెట్టింది. పుట్టింటిదగ్గర ఇన్నిరోజులుండి ఎన్నాళ్ల అయిందో. కరుణ రెండురోజుల్లోనే అత్త వారింటినుండీ వచ్చింది. సుధాకర్‌కూడా ఓ వారం వున్నాడు. తమ్ముడు, చెల్లీ, అమ్మా నాన్నలతో అరుణకు హాయిగా అనిపించింది.

* * *

భాగ్యాన్ని వాళ్ళ వాళ్ళువచ్చి తీసు కెళ్లారు పెండ్లి చేయడానికి. తాను వెళ్ళే ప్పుడు చిన్నమ్మగారు లేకపోవటం వెలితిగా అనిపించింది భాగ్యానికి. పుట్టింటినుండి వెళ్ళే ఆడపిల్లలా ఏడ్చే సింది. అది వెళుతుంటే తనకూ అంత బాధనిపిస్తుందనుకోలేదు లక్ష్మి. మంగళ సూత్రం చేయించడానికని ఓ అయిదొంద లిచ్చి చీరె రవికలగుడ్డా కొనిచ్చింది. భాగ్యాన్ని చేసుకునేవాడు కష్టపడి పనిజేసే వాడూ, నమ్మకస్తుడయి ఇక్కడకు రావ డానికిష్టపడితే ఇద్దర్ని ఇక్కడికే పంపితే తమ కోళ్ళఫారం చూస్తూ ఇక్కడేవుండి పోతారని భాగ్యం తండ్రితో చెప్పింది.

"ఆడిష్టపడితే అట్టనేనమ్మగోరూ" అన్నాడు.

భాగ్యంకూడా వెళ్ళిపోయాక లక్ష్మి కసలు పొద్దే గడవలా. శేఖర్ పదిగంటలకు కోర్టుకెడితే తిరిగి అయిదూ-ఆరూ దాటాకే




ఇంటికి రావడం. అంత పెద్దింట్లో దిక్కు దిక్కుమంటూ తానొక్కత్తి. రోజులసలే బాగుండలేదు. ఎవడయినా పట్టపగలే బుర్రపగలగొట్టి వంటిమీదివి లాక్కుపోయినా దిక్కులేదనిపించింది. గీతున్నా కొంత కాలక్షేపం.మనిషికి వంటరితనాన్ని మించిన శాపం ఇంకోటుండదు.

ఖాళీగా కూర్చున్న లక్ష్మి బుర్రలో రమను గురించిన ఆలోచనలు వచ్చాయి. హైదరాబాదులో కాపురం పెట్టారన్నారు. అక్కడెలా వున్నదో ఏమిటో? అరుణ రాగానే అవనిగడ్డ వెళ్ళి అక్కతో కలిసి హైదరాబాదు వెళ్లాలి. స్వయంగా చూస్తే పరిస్థితులు బాగా అర్థమవుతాయి. అరుణెప్పుడొస్తుందో ఏమిటో? పెండ్లి అయిపోయి పదిరోజులయింది. త్వరలోనే రావచ్చు. ఏమైనా అరుణే తనకంటే పుట్టింట్లో పుట్టింటివాళ్ళ ఆప్యాయతను పంచుకొంటుందనిపించింది. ఈ డబ్బులనేవి మనుషుల మధ్య నిజమైన ఆప్యాయతానురాగాలను ధ్వంసం చేసేస్తాయనే చేదునిజం లక్ష్మిని చికాకుపరిచింది.

సాయంత్రం ఇంటికి వచ్చిన శేఖర్ బట్టలు మార్చుకొని టీ తాగాక అలా చల్లగాలికి బయటికొచ్చాడు. శేఖర్ వెనకాలే లక్ష్మి బయటికొచ్చింది.

"ఏమిటోనండీ... మనసంతా చికాగ్గా వుంది" అంది లక్ష్మి.

"ఎందుకంట చికాకు?" లక్ష్మి చేతి గాజులు సవరిస్తూ అడిగాడు శేఖర్.

"ఇంట్లో ఒక్కదాన్నే వుండటంతో ఏమీ తోచక బుర్రలోకి పిచ్చిపిచ్చి ఆలోచనలన్నీ వస్తాయి. ఈమధ్య రమను గురించిన ఆలోచనలు పదేపదే మనస్సుని తొలిచేస్తున్నాయ్. ఓసారి హైదరాబాదు వెళ్ళి దాన్ని చూసిరావాలనుందండీ"

"అరుణ వచ్చాక పోసీ అలానే వెళదువుగానీ"

"ఏం... ముద్దుల పెళ్ళాం వచ్చిరాగానే అలాగైనా కొన్నాళ్ళు ఈ పీడనొదిలించుకోవాలనా?" నెమ్మదిగా అని తనమాట శేఖర్‌పై ఎలాంటి ప్రభావం కలుగజేసిందో అని కళ్ళెత్తి చూసింది.

లక్ష్మి చేతి మీద నుండి తనచేతిని వెనక్కుతీసుకొని కొంచెంసేపు అలా లక్ష్మి ముఖంలోకి చూస్తుండిపోయాడు శేఖర్.

"ఏమిటలా చూస్తారు? నా ముఖంలో ఏమైనా తోలుబొమ్మలాడుతున్నాయ్యా?"

"నిన్నేవో తోలుబొమ్మలే ఆడిస్తున్నట్లున్నాయ్. నీ చికాకు పోగొట్టుకోడానికి నాతో గిల్లికజ్జా పెట్టుకోవాలనుందా?"

"చిన్నారి భార్యంటే మోజుపడటం సహజం కదా" శేఖర్‌నింకా కవ్విస్తూ అన్నదీ.

"నిజంగానే ఈరోజు నీకేదో అయింది"

"నాకేదో అయినట్లే వుంది మరి. నన్నెటైనా తీసుకెళ్ళండి"

"సినిమా కెడదామా?"

"సినిమాకొద్దు.అలాఅలా చల్లగాలిలో చిలకలపూడి గుడికెళదాం"

"ఇప్పుడేం గుడి"

"దేవుడి దర్శనానికి కాదండీ... అలా తిరిగి రావడానికి"

"దానికేమిటి నీవు వెడదామంటే వెళదాం కాని ఈరోజు చీకటి పడింది గదా! రేపు నేను కోర్టునుండి సరాసరి ఇంటికొస్తాను.నీవుసిద్ధంగావుంటేవెళదాం"

"సరే. అలాగే కానీండిగాని కాసేపు ఆ సంపెంగ పొద దగ్గర కూర్చుందాం

ఆకాశంలో వెలిగేది ధ్రువతార
సినీజగతిలో వెలిగేది సితార

- ఆబాలగోపాలాన్ని 'హలో' అంటూ పలకరిస్తుంది సితార
- మీరు అభిమానించేది ఏ తారనైనా సరే– మీకు కావల్సింది సితార
- మల్టీకలర్ ముఖచిత్రమే కాదు, అనేక రంగుల సెంటర్ స్ప్రెడ్‌తో మిమ్మల్ని మురిపించి, మైమరపిస్తుంది సితార
- సినిమాకు సంబంధించిన అన్నిరకాల వార్తలకు, వ్యాఖ్యలకు, కబుర్లకు, విమర్శలకు పెట్టింది పేరు సితార

# సితార

సమగ్ర సినీవార పత్రిక

ఈనాడు కాంపౌండ్, సోమాజిగుడా
హైదరాబాద్ - 500 004

పదండి"

"పద కూర్చుందాం. ఈపూట నాకు భోజనం వుందా?"

"అదిగో...కాసేపుకూర్చొని కబుర్లాడుకుందామంటే మీకు భోజనం జ్ఞాపకానికొస్తోంది" గోముగా చూసింది.

"నువ్వు పెట్టి పిలిచిందాకా అడగను" బుద్ధిమంతుడిలా అన్నాడు.

"ఏమండీ... మీరు నిజం చెప్పాలి" శేఖర్ ముంజీలుని పెదాలకానించుకొంటూ అడిగింది.

"ఏమిటి కథ? కాకా పట్టేస్తున్నావ్. నేను ప్లీడర్ని"

"బయటివాళ్ళకు ప్లీడరు. నాకు మా ఆయనే గదా" శేఖర్ అరచేతిని పెదవుల దగ్గరనుండీ మెడకానించుకొంటూ అన్నది.

"అరుణ చాలా మంచిది గదండి"

శేఖర్ జవాబు చెప్పకుండా అలా గడ్డిలో నడుం వాల్చాడు.

"మాట్లాడరేమిటి?"

"ఏం మాట్లాడమన్నావ్?"

"నేనడిగిందానికి జవాబు"

"నీ ముఖం"

"మీరలా దాటవేస్తేవూరుకోను. అరుణ ఎలాగైనా చదువుకున్నది. అందుకే అంత మంచిగా మసులుకోగలుగుతోంది"

"అంత చదువుకోకపోయినా నీవూ మంచిగానే వుంటున్నావు గదా"

"నా మంచికేమొచ్చెలెండి"

"ఏం.... ఎందుకని? నీలో మంచి వున్నది గాబట్టే నీవు అరుణలోని మంచిని చూడగలుగుతున్నావు"

"నిజంగానే అంటున్నారా?"

"నిజమో... అబద్ధమో నా కళ్ళలోకి చూడు-పాతిక సంవత్సరాలుగా కాపురం చేస్తున్నావ్"

"తలా తోకా లేకుండా ఇలా ఏదో మాట్లాడుతూంటే ప్రాణానికి హాయిగా వుంది"

ఒకరినొకరు అర్థం చేసుకున్నపుడు అన్ని సంబంధాల్లోకి అపురూపమైందీ, మధురమైందీ భార్యాభర్తల సంబంధం.

ఆ చల్లని సంధ్యా సమయంలో ఇద్దరి మధ్యా సంభాషణ అలా అలా వడ్లగింజలో బియ్యపుగింజలా సాగిపోయింది.

* * *

అనుకున్న దానికి రెండురోజులాలస్యంగా అరుణా, గీతలను తీసుకొచ్చాడు రాఘవయ్య. లక్ష్మిని కిందికి పైకి చూస్తుండిపోయింది గీత.

"ఏమిటే అలా చూస్తున్నావ్. పది రోజులకే అమ్మను మరిచిపొయ్యావా?" చేతుల్లోకి తీసుకుంది లక్ష్మి. చంక కతుక్కుపోయింది గీత.

"భాగ్యం ఎక్కడా కనబడదేంటక్కా" అంగి అరుణ.

"దాని బాబొచ్చి తీసుకెళ్లాడు"

"మరలా వస్తుందా?"

"మొగుడితోసహా పంపమన్నాను. అందుకే మనం కూడా ఇంకెక్కడా పనిపిల్ల కోసరం ప్రయత్నం చేయడంలా"

"ఇంతలో ఏం మునిగిపోయిందిలే అక్కా! వాళ్ల సంగతేదో తేల్చుకున్నాకే చూసుకోవచ్చు"

"నీ స్నేహితురాలు శారదావాళ్లమ్మ అమెరికా నుండి వచ్చిందా?"

"ఆ ... ఆవిడొచ్చాకే వచ్చాను. శారదకు మగపిల్లవాడు. మూడు నెలలు నిండాయి. ఇక్కడకు తీసుకు వచ్చేసింది. అక్కడ శారద కూడా జాబ్ చేస్తోందిట. బిడ్డను పెంచటం కష్టమని తీసుకొచ్చేసింది. అక్కడ ఇద్దరూ పనిచెయ్యకుండా

ఒకళ్ళు తిని కూర్చోవాలన్నా కష్టమేనట. మన గీతక్కో గాను, నీకూ నాకూ చెరో స్వెట్టరూ పంపింది!"

"నాకా!" వింతగా అన్నది లక్ష్మి.

"నువ్వు శారద నెరగకపోవచ్చుగానీ నాకూ, శారదకూ మధ్య నీ ప్రసక్తి వస్తూనే వుంటుంది గదక్కా ... తనకు నీవు అలా తెలుసు" వివరంగా చెప్పింది అరుణ.

• • •

వెదకబోయిన తీగ కాళ్ళ కడ్డంబడి నట్లయింది.

సరస్వతి హైదరాబాదు వెళ్ళి కూతురిని చూసి రావాలనుకుంటోందిట. రమనుండి వుత్తరాలు చాలా అరుదుగా వస్తున్నాయనీ,అవీ క్లుప్తంగా పొడిపొడిగా వుంటున్నాయనీ చెప్పింది. "రెండురోజుల క్రితం వచ్చిన ఉత్తరంలో వాళ్ళత్తగారికి వళ్ళు కాలిందనీ, హాస్పిటల్లో రెండు రోజులుంచి ఇంటికి తీసుకువచ్చేశారనీ రాసింది. ఇప్పుడు బాగానే వున్నదిట. అయినా మనం చూడటానికి వెళ్ళకపోతే బాగుండదుగదా! మీబావా, నేనూ ఇద్దరం వెళదామనుకున్నాం. ఇంటిని చదువుకునే పిల్లల మీద వదిలేసి ఇద్దరం వెళితే పిల్లలిబ్బంది పడతారేమో! అమ్మకు కబురు పెట్టి అమ్మనింట్లో వుంచి వెళదామను కుంటున్నాం. నువ్వొచ్చావు—సమస్య తీరి పోయింది. లక్ష్మి..రేపే వెళదామే. నేనేదో ఇలా రోజులెళ్ళదీస్తున్నానేగాని నా ప్రాణాలన్నీ దానిమీదే వుంటున్నాయే. అదిక్కడకు వచ్చినపుడు దాని వీపు చూసినా, దాని వుత్తరాలు చూస్తున్నా అది సుఖపడుతున్న ఛాయలెక్కడా కనపడటంలా" సరస్వతి కళ్ళల్లో నీళ్లు నిలిచాయి.

"వాళ్ళత్తకెలా కాలిందట!"

"కోడల్ని ఏడిపించుకు తింటారు తప్ప దైవభక్తి, పూజలూ పునస్కారాలు — వాటికేం కొదవలేదు. కార్తీకపూర్ణిమరాత్రి నదికెళ్ళి స్నానాలు చేసి ప్రమిదవెలిగించి నదిలో వదుల్తారుగా...వీళ్ళత్తగారి పమిట కొంగుకి ప్రమిద వత్తి అంటుకున్నదిట. ఆవిడ వెంటనే కాలిందని అరిస్తే ఎవరో ఒకరు ఆర్పేసేవాళ్లు. కాని ఆవిడేమో నోటికెప్పుడూ సాయిరాం, సాయిరాం అనడం అలవాటట. అదే అలవాటున పమిట కొంగు కాలుతున్నా సాయిరాం సాయిరాం అంటుంటే ఎవరికేం తెలుస్తుంది. మంట పెద్దదై పైదాకా చీరె కాలాకగాని అందరూ చూడలేదట. అప్పుడు ఆర్పేసారట. ప్రమాదమైన గాయాలు కాదటగాని వీపుపైనా చేతులపైనా పుళ్ళు పడ్డాయిట"

"ఇదంతారమ రాసిందా? శ్రీనివాసా?"

"అయ్యోరాత .... వాళ్ళు మనకు ఉత్తరాలు కూడానా? రమే రాసింది కాని ఏదో పనిమీద నాన్న కూడా హైదరాబాదు లోనే వున్నారు. ఓపూట రమను చూసొద్దామని వెళితే ఇంట్లో అంతా ఈ హడావిడిలోనే వున్నారని నాన్న రాశారు. ఆ ఉత్తరం నిన్ననే వచ్చింది. నాన్న కూడా ఇంకో వారం హైదరాబాదులోనే వుంటారట. అందుకనిమనిద్దరమే వెళ్ళినా, నాన్న ఉన్న హోటలు కెళితే అక్కడి నుండి నాన్నే తీసుకెళతారు. అయితే ఈ లోపుగా మనం ఏ బస్సుకి బయల్దేరి వస్తోంది నాన్నకు ఫోన్జేసి చెప్పమందాం బావతో"

"నాకూ దాన్నెప్పుడు చూద్దామాఅనే వుంది. రేపే బయలు దేరదాం. పిల్లలెవ్వరూ మధ్యాహ్నం భోజనానికి ఇంటికి రారా ఏమిటి?"





"ఇద్దరూ బాక్సులే పట్టుకెళతారు. సాయంత్రం నకనక లాడుతూ వస్తారు. ఉమ ఫైనల్ బి. యస్. సి. కదా. ప్రాక్టికల్స్‌తోటి మరీ తోటకూర కాడలా వేళ్ళాడబడి పోతుంది. నాకీమధ్య మరీ రమ ఆలోచనలతో ఈ పిల్లలు చదువు తున్నారో, సినిమాలకే వెళుతున్నారో వేటిమీదా ధ్యాసలేకుండా పోయింది"

"మరీ అంత దిగులుపడి మాత్రం ఏం చెయ్యగలం. ఎలాగో దానికాపురం సరై అది సుఖపడే మార్గం ఆలోచించాలి. బస్సు ప్రయాణం బడలికగా వుంది. కాసేపు నడుం వాలుస్తాను."

* * *

అనుకోకుండా వచ్చిన అమ్మా పిన్నమ్మలను చూసిన రమ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. కాళ్ళు కడుక్కోవడానికి బాత్‌రూంలోకి పిలుస్తూ తన కళ్ళలో నీటినెవరైనా గమనిస్తారేమో అని ముఖం ఎవరూ చూడకుండా వెనక్కు తిరిగింది. అయినా తల్లిదృష్టినుండీ తప్పించుకోలేక పోయింది. ఇల్లు, ఇంటిలో ఫర్నీచర్, ఓ ఆఫీసర్ ఇల్లని చెప్పకుండానే తెలిసేట్టు దర్జాగా వుంది. రమ ముఖంలోనే ఎక్కడా కళాకాంతీ లేదు. ముఖం పీక్కుపోయి కళ్ళలో ప్రాణాలు నిలుపుకున్నట్లుంది. రమ అత్తగారి పుండ్లు చాలావరకు తగ్గాయి కాని ఇంకా ఆయింట్ మెంటు రాస్తూ నీళ్ళలు వాడుతూనే వుంది. ఇంట్లో వంటావార్పూ, అత్తగారికీ, ఆవిడ అమ్మగారికి కావలిసినవన్నీ చూడటం– అంతా రమే.

ఓ సంవత్సరం క్రితం వరకూ పైలా పచ్చీసుగా తిరిగిన రమ ఇంటి పనులన్నీ ఎంతో చేయి తిరిగిన దాసిలా యాంత్రికంగా చేసుకు పోతుండే సరస్వతి తన ప్రాణాల్నెవరో పట్టి పిండుతున్నట్లు బాధపడింది. ఈ గడ్డమీద పుట్టిన ఆడ పిల్లలు సుఖపడటమనేది పెండ్లయ్యేంత వరకేనేమో! పెండ్లితోటే బాధ్యతలూ కష్టాలూ ప్రారంభం. అత్త మామలకు, బావలకు, మరుదులకు, ఆడపడుచులకు అందరికీ చాకిరీ చేస్తూ అణిగి మణిగి వుండాలి కాస్త హృదయముండి పరిస్థితిని అర్థం చేసుకోగలిగిన భర్త ఉంటే పడిన శ్రమను మరుస్తూ సేదదీరుతోంది. అదీ కరువైతే ఇంక ఆడపిల్ల బతుకు నరక ప్రాయమే. ఇలాంటి బాధలేవీ పురుషుల కుండవు గదా!

లక్ష్మి, సరస్వతీ వాళున్న రెండు రోజుల్లోనూ గమనించిన విషయం–ఆ ఇంట్లో ముసలి వాళ్ళిద్దరికీ పనీ పాటూ ఏమీ లేదు. కనీసం కూరగాయలు కోసి ప్పెడం లాంటి పని కూడా చెయ్యరు. ఎప్పుడూ దేముళ్ళూ, బాబాలు, భజనల గొడవే. ఏ చుట్టాలొచ్చినా, స్నేహితు లొచ్చినా టేప్‌రికార్డరులో కాసెట్సు వేసి బాబాగారి భజన గీతాలు వినిపిస్తూ, తమ గొప్పదనాన్ని ప్రదర్శిస్తూంటారు. లక్ష్మికీ సరస్వతికీ కూడా దైవభక్తికి లోటేంలేదు కాని ప్రస్తుతం వాళ్ళు భక్తిరసాన్ని గ్రోలే స్థితిలో లేరు. ముసలివాళ్ళు ఇద్దరి వంటిమీదా ఒక్కొక్కళ్ళకు 30–40 కాసుల బంగారం. కాని వాళ్ళ భజనగీతాల సారం చూడబోతే మాత్రం ''మనం పుడుతూ తెచ్చిందీ లేదు. చస్తూ పట్టుకు పోయేదీ లేదు. ఈ మధ్యలో వచ్చిందంతా మాయ. ఈ మాయాజాలపు బతుకు మీద మోహం పెంచుకోవడం అంతా భ్రమే" నంటూ వేదాంతం. సకల సౌకర్యాలు అనుభవిస్తూన్న పరిపాలకుల నుండీ కోడళ్ళ ప్రాణాలకు కంటకాలుగా

తయారయ్యే ఇలాంటి ముసలమ్మలవరకు వాళ్ళు బోధించే ఈ వేదాంతసారం ఏం ప్రయోజనాన్ని ఆశించో?

లక్ష్మి, సరస్వతీ వాళ్ళున్న రెండు రోజుల్లో వాళ్ళకు రమతో కాస్త పంటరిగా మాట్లాడటానికే అవకాశం చిక్కలా. ముసలాళ్ళిద్దరూ కనిపించకుండా నిఘా వేశారు. శ్రీనివాస్ ఇంటివద్ద వున్న వేళల్లో అతని అవసరాలన్నీ రమే చూస్తున్నా ఇద్దరూ నవ్వుతూ తుళ్ళుతూ నూతన దంపతుల్లామసులుకొంటున్న ఛాయలెక్కడా కనిపించలా. రమను తమవెంట తీసుకెళ్ళి ఓ వారం వుంచుకొని పంపిస్తా మనడానికి ఆ ముసలావిడకు పూర్తిగా తగ్గకుండా కొడలిని తీసుకువెళ్ళారని అంటారన్న భయం. అందుకని ఇక్కడున్నప్పుడే ఎలాగో వీలు కల్పించు కొని పంటరిగా రమతో మాట్లాడాలను కున్నారు. ఆ ఇంటి పద్ధతి చూస్తున్న కొద్దీ లక్ష్మికి ఓ డిటెక్టివ్ సినిమా చూస్తున్నట్లనిపించింది. ఏదో పెద్ద నేరం జరగడం, అది చేసినవాళ్లు పట్టుబడ కుండా పెద్ద మనుష్యుల్లా మసులుకుంటూ ప్రతిదాన్నీ అనుమానించడం, తమ నీడను చూసి తామే భయపడ్డం, ప్రతి చిన్న కదలికకూ వులికులికి పడ్డం అలాంటి అనుభూతి కలిగి ఆ ఇల్లో మాయా మందిరంలా అనిపించింది.

ఆరోజు చీరాలవాళ్ళెవరో రమ అత్త గారికి తెలిసిన వాళ్లు వచ్చారు. వాళ్ళ అబ్బాయి ఇంజనీరట. పెండ్లికూతురిది హైదరాబాదయితే పెండ్లికి నిశ్చితార్థం పెట్టుకోడానికొచ్చి ఆ పని పూర్తయ్యాక వీళ్ళింటికొచ్చారు. కట్నం నాలుగు లక్ష లట. ఆ మాటవిన్న రమ అత్తగారు ఒకటే బాధపడడం. "ఈ రోజుల్లో ఎవరికి చూడబోయినా కట్నాలు లక్షలకు లక్షలు. మా ఖర్మే ఇలా కాలింది. తెచ్చు కున్నదేమీ లేకపోయినా ఘరానా ఇంట్లో నుంచి వచ్చిన అలవాట్లు" అంటూ మూతి మూడు వంకర్లు తిప్పింది.

"అయ్యో సంబడం.. చెప్పక చెప్పక మన సంగతే చెప్పాలి" వాళ్ళమ్మ వంత.

ఆవాక్కయి పోయారు లక్ష్మి సర స్వతీ కూడా. తామేమయినా అనుకుంటా మేమో అన్న వెరపు కూడా వున్నట్లు లేదు. కొంచెంసేపు ఏం మాట్లాడాలో కూడా తెలియలా. చివరికి సరస్వతే అన్నది "మేం మాత్రం ఏం తక్కువ చేసాం వదినగారూ...అనుకున్న దానికంటే ఎక్కువగానే మా ఓపికొద్దీ పెడుతూనే వున్నాంగదా!"

"ఆహా మీ పెట్టుపోతలే చెప్పుకోవాలి. వాడంత పెద్ద ఉద్యోగం చేస్తూ స్కూటరు మీద ఆఫీసు కెడుతుంటే తల కొట్టేసినట్లుంటోంది" ఏదో మానభంగం జరిగిపోయినట్లు బాధపడిపోయింది.

వాళ్ళతో ఏం మాట్లాడినా పరువు పోగొట్టుకోవడం మినహా ప్రయోజనం వుండదు. ఇతరులముందు చిన్నపోవాల్సొ నుందని అక్కడి నుండీ లేచి వెళ్ళి పోయారు లక్ష్మి, సరస్వతి.

ఆరోజు ఎలాగో వీలు కల్పించుకొని రమతో పంటరిగా తీరుభాటుగా మాట్లాడి ఆ రాత్రికే ఇంటికి బయలుదేరాలను కున్నారు. దాగుడుమూతలతో ప్రయో జనంలేదని లక్ష్మి అన్నది. తమకు చాలా దగ్గర బంధువులున్నారని, వాళ్ళనాపగలు కలిసి రాత్రికి ఇంటికి వెళ్ళిపోతామనీనూ. రమ అత్తగారు విని వూరుకున్నది. వాళ్ళతోపాటు రమ కూడా తయారవు తుంటే అప్పుడొచ్చింది పేచీ.




"అబ్బాయొచ్చేసరికి లేకుండా నీవెక్కడికే" అనే సుగ్రీవాజ్ఞతో రమ బెల్లం కొట్టినరాయిలా నిలబడిపోయింది.

"ఎక్కువసేపు వుండమండీ. ఓరెండు గంటల్లో వచ్చేస్తాం" భయపడుతుంటే మరీ వేషాలేస్తారనుకొని "పదవే రమా... మరలా త్వరగా కూడా వచ్చేయాలి" అంటూ వాళ్ళ మాట వినిపించుకోనట్లే బయలుదేరారు.

స్వేచ్ఛ లభించేసరికి రమకు అప్పటి వరకూ బిగబట్టుకున్న కన్నీరు ఏక ధారగా కారటం ప్రారంభించింది. ఆటో ఎక్కి ఎక్కటంతోటే ఆ కన్నీటిని ఆపుకోవటం రమకు శక్యం కాలా. తనలో ఇంత బాధ గడ్డకట్టుకొనున్న విషయం తన వాళ్ళను చూసేంతవరకు రమకే తెలియదు. దారిలో కదిలించడం దేనికని లక్ష్మి, సరస్వతి రమను చూసి బాధపడుతూనే అలా వుండిపోయారు. ఆటో హోటల్ చేరేసరికి తండ్రి రూంలోనే వున్నాడు. ఆ ఏర్పాటు ముందే చేసుకున్నారు.

గదిలోకొచ్చి కూర్చొనీ కూర్చోడం తోటే రమ నోటి వెంబడి వచ్చిన మాటలు "నేనిక్కడ ఇంకోరోజు కూడా వుండను. నేనూ మీతోటే వచ్చేస్తాను" ఏడ్పు దిగ మింగుకొంటూ అన్నది.

"ముందుగా వాళ్ళతో మాటమాత్రం అనకుండా అదెలా కుదురుతుంది. వాళ్ళూరుకుంటారా?" సరస్వతి అన్నది.

"కాదు కూడదు, పరువు ప్రతిష్ట, వాళ్ళేమంటారో వీళ్ళేమంటారో అంటూ మీనమేషాలు లెక్కేస్తూంటే ఇంకొంత కాలం గడిచాక నా శవాన్ని తీసుకెళ్ళ డానికి వద్దురుగాని. అప్పుడింక ఎవరికీ ఏ బాధా వుండదు" అంది రమ.

"అవేం మాటలే తల్లీ! పెంచి పెద్ద దాన్ని చేసిందిందుకా?" కళ్ళ వెంబడి నీళ్ళతో అన్నది సరస్వతి.

"కాదమ్మా....అసలు నీ బాధేమిటో చెబితే దానికి పరిష్కారం ఆలోచిద్దాం. అంతేగాని నీవిలా బాధపడిపోతూ మమ్మల్ని బాధపెడితే మేం ఇంటికెళ్ళి మాత్రం ఎలా ప్రశాంతంగా వుండగలం?" లాలింపుగా అన్నది లక్ష్మి.

"బాధంటే ఏమని చెప్పను పిన్నీ... వాళ్ళెందుకో నన్ను బద్ధ శత్రువులా చూస్తారు. ఆయన ఆసి.ఎ. పాస్ కాకుండా వున్నా బాగుండిపోయేదేమో. అది పాసయ్యాక నన్ను వేధించడమే వాళ్ళపని. వాళ్ళబ్బాయికిప్పుడైతే రెండు మూడు లక్షల కట్నం కళ్ళకద్దుకొని ఇచ్చేవారుట. నేను వాళ్ళ పాలిటి శనిలా దాపురించానట. నావంట్లో రక్తమాంసా లున్నాయి, నేనూ బాధపడతాను అనే విషయం వాళ్ళ మనస్సుల్లో ఏమాత్రం వుండదనుకుంటా. వాళ్ళేమన్నా నేను కిమ్మనకుండా పడుండాలి. సహనానికి కూడా ఓ హద్దంటూ వుంటుంది గదా! మా అత్తగారి ఒళ్ళు కాలడానికి, మా ఇంట్లో కుక్కపిల్లకు జబ్బు చెయ్యడానికి-అన్నింటికీ నేను వాళ్ళింట్లో కాలు మోపడమే కారణం. ఇంకేం చెప్పేది? మా అత్తగారి అమ్మను అప్పుడప్పుడూ గాలి ఆవహిస్తూ వుంటుంది. నా కష్టాలకది పరాకాష్ట. పరోక్షంగా అప్పుడావిడ నన్ననే మాటలకు అంతుండదు. ఇరుగుపొరుక్కి కావలసినంత వినోదం. నా బతుక్కంటే ఇంటి నౌఖరు పని హాయి. ఇష్టమయితే ఉంటాడు; కాదనుకుంటే పోతాడు. జీవితాంతం నా బతుకింతేగా! ఆవిడ పుళ్ళన్నీ నేనే





డెట్టాల్‌తో తుడవాలి. మందు రాయాలి. అప్పుడైనా కాస్త ప్రేమగా ఉంటుందా? అప్పుడూ తిట్లే - నెమ్మదిగా రాయడం లేదని. నాకెందుకీ బతుకు?'' విషాదం ధ్వనించింది రమ కంఠస్వరంలో.

అందరి కళ్ళల్లో కన్నీళ్ళే.

"శ్రీనివాస్ ఏమీ పట్టించుకోడా?" నెమ్మదిగా అడిగింది లక్ష్మి. సరస్వతికి గొంతు పెగిలి మాట వచ్చే స్థితిలో లేదు.

"అపర శ్రీరామచంద్రుడాయన. తిట్టినా కొట్టినా కిమ్మనరు. ఇంట్లో మరీ గొడవగా ఉందనుకుంటే బయటికెళ్ళి పోతారు. ఓ చిన్నమాట అని వాళ్లను అదుపు చేయడం ఈయనవల్ల అయ్యే పని కాదు. ఆయన్ని గురించి ఒక్క మాటలో చెప్పాలంటే పిన్నీ... వెన్నెముక లేని వానపాము. తల్లి కొంగుచాటు బిడ్డ. వ్యక్తిత్వం లేని మనిషి" భర్తపట్ల కూడా ఏహ్యభావాన్ని వ్యక్తం చేసింది రమ.

'భర్త సమర్థుడైతే ఏ ఆడపిల్లా అత్తా, ఆడపడుచుల గురించి ఏడువదు. ఆత్మ హత్యలకూ సిద్ధపడదు' మనస్సులోనే అనుకున్నది లక్ష్మి.

"నువ్వు కాలు బెట్టడం వాళ్లకు శనైతే నువ్వు ఆ ఇంటిలో అడుగు పెట్టాకే గదా అతను సి.ఎ. పాసయింది" ఓదార్పుగా అన్నాడు రమ తాతయ్య.

"చెడుకి నేను,మంచికి వాళ్ళఅదృష్టం. రోజు రోజుకీ వాళ్ళ వేధింపు పెరిగి పోతోంది తాతయ్యా. వాళ్ల తీరు చూస్తున్న నాకు అప్పుడప్పుడూ అనిపిస్తుంటుంది- ఎలాగైనా నా పీడ వదిలించుకుని వాళ్ల బ్బాయికి ఎక్కువ కట్నంతో మరో పెళ్లి చెయ్యాలనేఆలోచనేమైనా వున్నదా అని"

"నువ్వు అలాంటి పిచ్చిపిచ్చి భయా లేవీ పెట్టుకోకు. వాళ్ళిష్టమొచ్చినట్లు ఆడటానికి మేమంతా ఏమైపోయాం"

"మనుషుల మధ్య ప్రేమాభిమానాలు లేనపుడు బలవంతంగా ఎన్నాళ్లని మీరు సర్దుబాటు చేయగలుగుతారు? దాంతో నేను పొందే సుఖ శాంతులు మాత్రం ఎంతమాత్రంగా ఉంటాయి. ఆ హృదయంలేని డబ్బు మనుషుల పాలిట పడటమే నా దురదృష్టం"

"రోజులెప్పుడూ ఒక్కలాగే ఉండవు రమా! పరిస్థితులవే చక్కబడతాయి. నువ్వు మాత్రం ఒక్క వారం ఓపిక పడితే ఆ తరువాత నేనే వచ్చి నిన్ను ఇంటికి తీసుకెడతాను. ఆ ముసలావిడకు పూర్తిగా తగ్గకుండా నీవు అమ్మావాళ్లతో వెళ్ళిపోతే నెపం మనమీద వేయడానికి వాళ్లకు అవకాశం ఇచ్చినవాళ్ల మవుతాం. ఈ లోపున నేను శ్రీనివాస్‌ని బయటెక్కడైనా వంటరిగా కలిసి మాట్లాడుతాను. ఏమంటాడో చూద్దాం" రమకు నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు.

"ఇప్పటి వరకు ఎలా కాలక్షేపం చేసానో నాకే తెలియదు తాతయ్యా. ఇప్పుడిలా బయటకు వచ్చి మీరంతా వెళ్లి పోయాక ఆ ఇంటిలో ఉండాలి అన్న నిజాన్ని తలుచుకోవాలంటేనే ఏ అడివి జంతువులమధ్యకో పోతున్నంత భయంగా వుంది"రమ గొంతులో అంతులేని బెదురు.

సంభాషణంతా వింటున్న సరస్వతి అలా మూగగా అచేతనంగా వుండి పోయింది.

ఆసారికి తమతో ప్రయాణంకట్టకుండా రమను ఇంకో నాలుగురోజులపాటు అత్త వారింట్లోనే వుండేందుకు వప్పించడానికి వాళ్ళ తల ప్రాణం తోక్కొచ్చింది. ఎట్టి పరిస్థితుల్లోనూ ఏ అఘాయిత్యం చెయ్య

నన్ను వాగ్దానం రమ దగ్గర పుచ్చుకొన్నాకే రమను అత్తవారింట్లో విడిచిపెట్టారు.

ఆరాత్రికే అక్కాచెల్లెళ్ళిద్దరూ తిరుగు ప్రయాణం కట్టారు. ఆయనకింకా అక్కడే కొన్ని పనులుండి పోవడంతోనూ, శ్రీనివాస్‌తో మాట్లాడాలనీ రమ తాతయ్యా గంగాధరం అక్కడే వుండిపోయారు.



## 6

అవనిగడ్డ వచ్చి నాలుగురోజులయింది. లక్ష్మికి ఇంటికి వెళ్ళిపోవాలనీ వుంది. సరస్వతిని అట్లా వదిలేసి వెళ్ళాలన్నా బాధగానే వున్నది. హైదరాబాదునుండి వచ్చాక సరస్వతి సరిగా తిండితిన్నదీ లేదు; కంటినిండుగా నిద్రపోయిందీలేదు. రమను గురించిన బెంగే. అక్కడకు వెళ్ళి చూడకముందు అంతగా లేదుగాని చూసి వచ్చాక మాత్రం రమ ఏం అఘాయిత్యం చేస్తుందో అన్న భయంతో తల్లడిల్లి పోతోంది. అక్కనట్లా వదలలేక తన కింటికి వెళ్ళినా రమ పీకులాటే. అందుకని తండ్రి వచ్చాకే వెళదామని వుండిపోయింది.

ఆపైన నాలుగురోజులకు గంగాధరం రమను తీసుకుని వచ్చాడు.

ప్రాణాలతోవున్న కూతురిని చూసిన సరస్వతి ఆనందానికి అవధుల్లేవు. కళ్ళ వెంబడి బొటబొటా కన్నీరు. కూతురిని దగ్గరకు తీసుకున్నది. రమ బల్లిలా అతుక్కుపోయింది. కాని ఆ ఆనందంలో ఎంతోసేపుండలేక పోయింది. రమ వచ్చింది. వాళ్ళేమన్నారో? తండ్రి ఏం చెబుతాడో? ఏమి వినాల్సొస్తుందా అన్న ఆందోళన.

నెమ్మదిగా అక్కడి భాగోతం మొత్తం వివరించాడు తండ్రి. శ్రీనివాస్‌తో ఓ పూటంతా మాట్లాడాడంట "'మీ అమ్మాయి సుఖం కోసరం మా అమ్మా, అమ్మమ్మా చీరాల వెళ్ళిపోవాలా? మీరిలా మాట్లాడటం మీ పెద్దరికానికి తగినట్లే వుందా? మీ అమ్మాయి చదువుకున్నది. పెద్దవాళ్ళతో ఆమాత్రం కలిసిపోలేదన్న మాట. అలాంటప్పుడు మీరు మీ అమ్మాయికి వెనక అమ్మా నాన్నా ఎవరూలేని సంబంధం చూసుకోనుండాల్సింది. అమ్మా, అమ్మమ్మా ఎప్పుడూ నాతోనే వుంటారు. మీ అమ్మాయికలా ఇష్టమైతేనే వుండమనండి. లేదంటే మీ ఇష్టం' అంటూ తప్పంతా మనదే అన్నట్లు మాట్లాడాడు. వాళ్ళమ్మా, అమ్మమ్మల మూలంగా ఇంట్లో వస్తున్న కలతలు, వాళ్ళు రమను పెడుతున్న ఆరడి-ఇవేవీ అతనికేమీ పట్టినట్లు లేదు. వాటిని గురించి అసలతను ఆలోచిస్తున్నట్లే లేదు. అతనేదో చేస్తాడని అతనిమీద మనం ఆలోచనలు పెట్టుకోవడం అనవసరం. అతనో అమ్మకూచి" అని తేల్చాడు గంగాధరం.

"స్వంత ఇల్లూ, వాకిలీ, చుట్టూ తను వాళ్ళనుకునే మనుషులు...చీరాలలో వుండటానికి ఆముసలివాళ్ళకు ఇబ్బందేమిటో?" స్వగతంలా అన్నది లక్ష్మి.

"ఎవరికి అనుకూలంగా వాళ్ళు ఆలోచించుకోవడం మానవసహజం. మనం ఇలా అనుకుంటే వాళ్ళేమో కొడుకు ఆఫీ

సరు. కోడలు అన్నీ అమరుస్తుంటే కాలు మీద కాలువేసుకుని ఆ తరికం చలాయిస్తూ వైభోగం వెళ్ళబోయాలి అనుకుంటారు. ఏమైనా కానీ అంతగా డీలాపడిపోయిన దాన్ని ఆ కసాయివాళ్లమధ్య వదిలిపెట్టి రాలేకపోయాను. ఆపైన ఏమైనా కానీ. ఊడిపోయే ముక్కును ఎంతకాలం పట్టుకుని వేళ్ళాడతాం?" నిస్పృహగా అన్నారాయన.

"రమ వచ్చేస్తుంటే వాళ్లేమీ అనలేదా!" సరస్వతి అడిగింది.

"రమను నాతో తీసుకెళ్ళి ఓ వారంలో నేనే తీసుకొచ్చి దింపేస్తాను అంటే, 'తీసుకెళుతున్నారుగా మీ ఇష్టం. మమ్మల నడిగి తీసుకెళుతున్నారు గనుకనా? మీరసలు పంపకపోయినా ఇక్కడ బాధపడిపోయేవాళ్ళెవరూ లేరం'టూ చేతులు తిప్పుతూ విరుచుకుపడిందా ముసల్ది. అయినా ఉద్యోగం చేసుకునేవాడు. అతనికింకో పెండ్లిచేయాలన్నా చట్టరీత్యా కుదరదు. వాళ్ళ అహంభావమేంటో అర్థం కావడంలా" సాలోచనగా అన్నారాయన.

"ధనదాహం మినహా ఇంకేంలేదు నాన్నా. మనమే ఇంకా కొంత ముట్ట చెపితే...?" తల్లిగా కూతురి కాపురాన్ని ఎలాగో చక్కబెట్టాలన్న తపనతో అంది సరస్వతి.

"ఇంకా కొంత అంటే ఎంతని ఇవ్వగలం? మాటకు కట్టుబడివుండే నిజాయితీ లేనప్పుడు ఎంతిచ్చి తృప్తిపరచగలం? పెండ్లయ్యాక అనేక ఒడిదుడుకులు వస్తుంటాయి. మార్పులు వచ్చినపుడల్లా వైవాహిక బంధాలుకూడా మార్చుకుంటూ పోతుంటే ఈ పెళ్ళిళ్ళకసలు ఓ అర్థమంటూ వుంటుందా ?" ఆవేశపడిపోయాడు గంగాధరం.

"డబ్బాశే కాకుండా నాన్నా కొంత మంది ఇతరులను హింసించి అందులో తాము ఆనందం పొందుతారు. వీళ్ళు ఆ కోవకు చెందిన మనుషుల్లా వున్నారు" లక్ష్మి ముఖంలో అంతులేని అసహ్యం.

వీళ్ళలా మాట్లాడుకొంటుంటే అమ్మ, తాతయ్యావాళ్ళు తన కాపురాన్ని గురించే మాట్లాడుకొంటున్నారు ఏం మాట్లాడుకొంటున్నారో ఏమిటో వినాలన్న కోర్కె రమలో ఏ కోశానా లేకపోగా ఆ వ్యవహారంతో తనకేమీ సంబంధం లేనట్లు మంచం మీద హాయిగా నిశ్చింతగా పడుకొన్నది. మోపబడిన హత్యానేరంకోర్టులో రుజువై శిక్షపడటం ఖాయం అనుకున్న వ్యక్తిని నిర్దోషిగా కోర్టు తీర్పిస్తే ఆ వ్యక్తి పొందే ఆనందాన్ని మించిన ఆనందా న్ననుభవిస్తోంది రమ. ఆ వూబినుండి బయటపడలేననుకున్న రమకుఇంట్లోఅత్తమ్మ, దూ చెల్లెలి మధ్య తనూ తిరగగలగడం యావజ్జీవ శిక్షననుభవించి ఇంటికి తిరిగొచ్చినట్లుగా వున్నది.

కొంత కాలం ఆగితే వియ్యాలవాళ్ళ వుద్దేశమేమిటో మనకూ కొంత తెలుస్తుంది; మీరు తొందరపడి రమను అత్తింటికి గెంటద్దని అక్కా బావలకు తన అభిప్రాయం చెప్పి ఇంటికి బయలుదేరింది లక్ష్మి.

* * *

పసిపిల్లలదేముంది. ప్రేమగా ఎవరు దగ్గరకు తీస్తే వాళ్ళకు అతుక్కుపోతారు. కొద్దిరోజులు దూరంగా వుంటే ఇట్టే మర్చిపోతారు కూడా.

ఎప్పటిలా గీత లక్ష్మి దగ్గరకు రావ డానికి ఓ రోజుపట్టింది. లక్ష్మి ఇంటి కొచ్చేసరికి చిన్నాడపడుచు కృష్ణ కూడా

వున్నది. ఆ క్రితం రోజే వచ్చిందిట.

"నిన్ను చూడకుండానే వెళ్ళిపోవా ల్సొస్తుందేమో అనుకున్నాం వదినా. సమయానికొచ్చావ్" సంతోషపడింది కృష్ణ.

"నేను రాకుండానే వెళితే నేనూరు కుంటాననే అనుకున్నావా?"

"కాదొదినా... మామూలుగా అయితే మా అన్నయ్యింట్లో ఎన్నిరోజులుంటానో కయినా నాకేమిటి? అర్జంటు పనిమీద రావాల్సొచ్చింది"

"పోనీలే. ఎలాగైనా కలిసావు గదా"

రమ అత్తింటి వ్యవహారం విన్న అరుణా, శేఖర్‌లు వుసూరుమన్నారు. "రమని ఇక్కడకు తీసుకురాకపోయ్యా వక్కా. కొన్ని రోజులిక్కడుండేది గదా" అన్నది అరుణ.

"ఏమో అరుణా... నేను రమ్మనలేదు. కళ్ళల్లో వున్నాయి దాని ప్రాణాలు. తమ్ముడూ, చెల్లెలూవాళ్ళ మధ్యుంటేనే కొన్నాళ్ళు మామూలు మనిషవుతుందని పించింది"

"దేశంలోఎన్నో కేసులు చూస్తున్నాం. కోడళ్ళకు పిచ్చిపట్టిస్తున్నవాళ్ళు, ఫిట్సు తెప్పిస్తున్నవాళ్ళు, నిలువునా కిరసనాయిల్ పోసి తగలబెట్టేస్తున్నవాళ్ళు, దావగొట్టి వురిత్రాటికి వేళ్ళాడదీస్తున్న వాళ్ళు... ఎన్నిరకాలు. తగిన ఏర్పాట్లేవో చేసి పరిస్థితులు చక్కబడ్డాయనుకుంటేనే రమను అత్తారింటికి పంపించాలి గాని గొడవలవే సర్దుకుంటాయిలే అని పంపిస్తే తరువాత ఏం జరిగినా ఇంక చేయగలిగిందేమీ వుండదు"తన లాయరు అనుభవంతో అన్నాడు శేఖర్.

"సభ్య సమాజంలో పెద్దమనుషులుగా పరిగణింపబడుతున్నవాళ్ళే కేవలం డబ్బుకోసరం మనుషులను హత్య చేయడమా? మనం ఏ దశలో వున్నట్లు!" సమాజంపై తన జుగుప్సను వెళ్ళగక్కింది అరుణ.

"అది మామూలుగా కోలుకుని నలుగురిలో పడేంతవరకు దాన్నక్కడకు పంపటోమనే అన్నారు. సరేగానీ, మన కృష్ణ ఏదో అర్జంటు పనిమీద వచ్చానంటోంది!" ప్రశ్నార్థకంగా చూసింది భర్త వైపు.

"ఇప్పటి వరకు వాళ్ళ చిన్నల్లుడు వెంకటేశ్వరరావు ఎవరో కాంట్రాక్టరు దగ్గర పనిచేస్తున్నాడు గదా! ఈమధ్యనే రైల్వే సర్వీస్ కమిషన్ ఎగ్జామ్ రాసి పాసయ్యాట్ట. అయినాకూడా ఓ పదివేలు బరువు పెడితే తప్ప వుద్యోగం వచ్చే పరిస్థితి లేదుట. ఆ డబ్బు సమకూర్చుకోవ డానికొచ్చింది"

"ఏం దౌర్భాగ్యముంది" గర్భం కింద చెయ్యిపెట్టుకోనన్నది అక్క. "పరీక్షలు పాసయినా లంచంలేందే వుద్యోగాలు రావు. కట్నం లేందే ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు కావు. కట్నమిచ్చి పిల్లనిచ్చి పెళ్ళిచేసిన నేరానికి ఎంతకాలం గడిచినా అప్పులు తీర్చడానికి, ఉద్యోగాలు కొనుక్కోవ డానికి సమస్త అవసరాలకూ ఆడపిల్లల వాళ్ళే, 'అడదై పుట్టేకంటే అడవిలో మానై పుట్టడం మేలన్న' సామెతను ఎంతబాగా రుజువు చేస్తున్నారు"

"పెద్దమ్మాయిని ఓ ఐదువేలు అడిగిందట. మనల్నో ఐదుసర్దమంది"

"అది సరేలెండి. అందుక్కాదు. మగపిల్లవాళ్ళ మనస్తత్వానికి చెబుతున్నాను. తను ఈరోజే వెళ్ళిపోవాలంటోంది"

"అవును మరి. ఎంత కాంపిటీషనంటే

డబ్బులివ్వడం ఆలస్యమయితే ఆఛాన్సు కాస్తా మరెవ్వరు తన్నుకుపోతారో అన్న ఆందోళన. ఈ డబ్బు తీసుకెళ్ళి మధ్యలో ఓ బ్రోకరు కివ్వాలిట. సరేగాని ఓ మంచి వా ర. భాగ్యమూ, దాని మొగుడూ రెండు రోజుల్లో వచ్చేస్తారుట. క్లయింటె వరో వస్తుంటే వాళ్ళతో కబురు పెట్టారు"

"అమ్మయ్య! ఆ భాగ్యం వుంటే మనకు నిశ్చింత. వాళ్లాయనెట్లాంటివాడో చూడాలి."

"కృష్ణనీరోజే కారులో నేనే దిగబెట్టేసి వచ్చేస్తాను. డబ్బుతో వెళుతోందిగా. మేము పెందరాడే బయలుదేరాలి. అలా కాకుంటే నాకు తిరుగుప్రయాణం కష్ట మవుతుంది" అన్నాడు శేఖర్.

అంతా లేచారు.

* * *

"పోస్ట్"

అరుణ పేరుతో ఓ కవరుంది.

డ్రాయింగు రూములో కూర్చొనున్న అరుణ చేతికా కవరిచ్చి పోస్టులోనే వచ్చిన ఏదో మాగజైను చేతిలోకి తీసు కొని బొమ్మలు తిరగేస్తూ అరుణ పక్కనే ఓ కుర్చీలో కూర్చుంది లక్ష్మి.

గీత తన బొమ్మలలో లీనమైయుంది.

"సుధాకర్ తన పెండ్లిని గురించి రాశాడు" వుత్తరం చదివి అవతలపెట్టి లక్ష్మితో అన్నది అరుణ.

"పిల్లదేవూరు?"

"ఈ సంబంధం అమ్మా నాన్నలకు ఇష్టంలేదక్కా! కరుణ పెండ్లయ్యాక అక్కడ అందరం వున్నప్పుడు చెప్పాడు. వాడి ఫ్రెండ్ చెల్లెలు. లెక్చరర్‌గా చేస్తోందట. రెండు సంవత్సరాలుగా తెలుసంట. కరుణ పెండ్లయ్యేవరకు ఆగుదామనుకొని అప్పటివరకూ చెప్ప లేదంట. కాని వాడావిషయం చెప్పేసరికి నాన్న వినకూడనిదేదో విన్నట్లు ఒక్క సారి విరుచుకుపడ్డారు. అమ్మా నాన్నా ఎవరూ లేరనుకుంటేనే ఆ అమ్మాయిని చేసుకోమని ఇంతెత్తున లేచారు"

"మీ నాన్నకు ఎందుకిష్టంలేదు?"

"ఏముందక్కా...అందరిలానే కట్నం దండిగా రాబట్టుకోవాలని. తనూ ఆడ పిల్లల తండ్రిగా అన్ని ఇబ్బందులు చవి చూశారు. అయినా తన కొడుకు దగ్గర కొచ్చేసరికి అంతా మరిచేపోయారు. వీలైనంతగా పిండుకోవాలన్న ద్వంద్వ నీతి"

"ఒకళ్ళననే పనేముందిలే అరుణా. లోకరీతే అంత"

"కాదక్కా... నాన్న పూర్వం ఇలా వుండేవారుకాదు. చాలా ఆదర్శభావాల్లో వుండేవారు. వుపాధ్యాయ సంఘాల్లో పనిచేసేవాళ్లు. డబ్బే సర్వస్వం అనీ అను కొనేవాళ్ళు కాదు. మాచేత మంచి మంచి పుస్తకాలు చదివించేవాళ్లు. మాకెప్పుడూ దేశంకోసం త్యాగంచేసిన వాళ్ళను గురించి అప్పటి విశేషాలు చెపుతుండే వారు. పిల్లల్ని పెంచడానికి నాన్న తీసు కున్నంత జాగ్రత్తలు తీసుకునేవాళ్లు చాలా తక్కువగా వుంటారు. ఏమిటో ఇప్పుడే ఇలా తయారయ్యారు"

"జీవితంలో ఎదురయ్యే అనుభవాలు మనిషిపై చాలా ప్రభావాన్ని కలుగ జేస్తాయి అరుణా"

"ఆ పిల్లకూ అసలేమీ ఆస్తి రాక పోదుట. తండ్రి ఆస్తి పిల్లలందరికీ సమా నంగా ఇస్తానన్నారట. ఈ అమ్మాయి వంతు ఓ పాతిక-ముప్పైవేలు వస్తుందిట. అన్ని సమస్యలూ తీరాక ఈ వయసులో మా నాన్నకీ బుద్ధులేమిటో?





హాయిగా వాడికి నచ్చిన పిల్లను చేసుకో నీక" విసుగ్గా అన్నది అరుణ.

"ఇంతకూ ఇప్పుడు మీ సుధాకరే మంటాడు?"

"ఈ ఉత్తరంలో అదే రాశాడు. నాన్న పెద్దరికం నిలుపుకుంటేసరే. లేక పోతే తామే పదిమంది స్నేహితుల సమ క్షంలో దండలు మార్చేసుకుంటాము అని"

"బావుంది. మరి నీ సలహా ఏమిటి?" నవ్వుతూ అడిగింది లక్ష్మి.

"నేనిప్పుడు నాన్న దగ్గరకెళ్ళి నచ్చ చెప్పి ఒప్పించాలన్నా లాభంలేదక్కా. అమ్మ దేంలేదు. మేమందరం ఎలా అంటే అలానే అంటుంది. నాన్నే చాలా మొండిగా వున్నారు. వాడేమైనా చిన్న వాడా చితకవాడా. శుభ్రంగా వాడికిష్ట మయినట్లే చేసేసుకొమ్మని రాస్తాను. ఆ పెళ్ళెప్పుడో తెలియపరిస్తే మేమూవచ్చి నాలుగక్షింతలు వేస్తామని రాస్తా"

"ఈ వ్యవహారమంతా నాకింతకు ముందు ఏమాత్రం తెలియదుగదరుణా. అందుకని రమను ఎరక్కాపోయి అటు వంటి భ్రష్టుడికిచ్చి ఆ సుడిగుండంలో పడ్డాము. ఏమనైనా అన్నీ తెలిసినవాళ్ళు, గుణవంతుడు మీ సుధాకర్‌కిచ్చి చేస్తే బాగుంటుందని మనసులో అనుకున్నాను" నిరుత్సాహంగా అన్నది లక్ష్మి.

"అంతా ఆ రమ అత్తగారిలాంటి వాళ్ళే వుంటారేమిటక్కా. మనం ఆస్థి పాస్తుల కోసరం ఆశించకుండా కుర్ర వాడు చదువుకున్న వాడూ, గుణవంతుడూ అయితే చాలనుకుంటే ఎంచక్కటి సంబంధం చూడచ్చు. దేశం గొడ్డు బోయిందా?"

"ఏమోలే. ఏమైనా అన్నీ తెలిసిన వాళ్ళు దీనికి సాటిరాదుకదా! అయినా ఇప్పుడిక అనుకోవటం అనవసరం"

బొమ్మల్తో ఆడుకుంటూ అక్కడే అలానే పడుకొని నిద్రబోతుంటే గీతను భుజంమీద వేసుకొని గదిలో మంచంమీద పడుకోబెట్టి లక్ష్మివాళ్లున్న చోటికొచ్చింది భాగ్యం.

"ఏమే భాగ్యం... మీ ఆయనేమంటు న్నాడే? ఏదో కీసులాడుకొంటున్నారని మన డ్రైవరన్నాడు"

"ఆ దయివరుగోడు చాడీలు చెబుతుం డాడా? మావోడికి నానంటే పానమేనమ్మ గోరూ. ఆడికి సుక్కలవాటుంది. ఆ సుక్కేసుకున్నపుడే ఆడికొత్తాది మాయ రోగము. అసుంటప్పుడికి కిందామీదా తెల్దు. ఆ డైవరుబాబూ ఆడూ తాగుతాడు గందమ్మా. వట్టి సన్నాసులు. సుఖంగా బతికే జాతకం లేక"

"ఏమోనే. నీవూ వాడితో సమానంగా పోట్లాడక ఓపిగ్గా నచ్చచెప్పుకొని దారిలో పెట్టుకో" సలహా ఇచ్చింది లక్ష్మి.

"అందుకేనందమ్మగోరూ...కుసింత కుసింత తాగుడు మానపడానికి చూ తంటే ఆ గుబులొచ్చి నాతో తగేసుకుంటడు"

"సరే... నేను కాసేపు పడు కుంటాను. నువ్వీ పూట ఆ కొబ్బరాకు లీనెలు తీసి రెండు చీపుళ్ళు కట్టు. కొబ్బరిమట్టలు పాడైపోతున్నాయి" అని భాగ్యానికి పని పురమాయించి లక్ష్మి అక్కడినుండి లేచి వెళ్లిపోయింది. అరుణ అక్కడలానే కొంతసేపు తమ్ము డిని గురించిన ఆలోచనల్లోనే ఉండి పోయింది. తరువాత లేచి ఆఫీసుగదిలో కెళ్లింది తమ్ముడికి రిప్లై రాయడానికి.

* * *

వాకిట్లో ఉసిరిచెట్టుమీద కాకి కావ్





కావ్మన్నప్పుడల్లా అవసిగడ్డ నుండి ఎవరో వస్తారు, రమను గురించిన వార్త లేవో తెస్తారు అని అప్పటికి వారం రోజులుగా ఎదురుతెన్నులు చూస్తోంది. ఏ కాకి అరవకుండానే ఆ రోజు సాయంత్రం లక్ష్మి బావరాజారావొచ్చాడు. లక్ష్మికి ప్రాణాల్లేచొచ్చాయి. కాళ్లు కడుక్కోడానికి నీళ్ళిచ్చి భాగ్యాన్ని కాఫీ కలపమని చెప్పింది.

అవీ ఇవీ కుశల ప్రశ్నలయ్యాక లక్ష్మి రమ విషయం కదిపింది.

తనిప్పుడు వచ్చింది ప్రత్యేకం రమను గురించేనని చెప్పాడు రాజారావు. "రమ మరీ మొండికేసింది. ఎవరు ఏం చెప్పినా, ఏం చేసినా చచ్చిగిపెట్టినా ఆ ఇంటి గడప తొక్కనంటోంది. ఇరుగూ పొరుగూ అప్పుడే చెవులు కొరుక్కుంటున్నారు — అమ్మాయి ఇంకా ఇక్కడే ఉండిపోయిందేమిటీ అని. ఏం చేయడానికి పాలుపోక చస్తున్నాం. వెనక నుయ్యీ ముందు గొయ్యీ. పంపనూలేకపోతున్నాం .... ఉంచడానికి ఇలా ఎన్నాళ్ళని?" దిగులుగా ఉన్నది రాజారావు గొంతు.

"ఇరుగుపొరుగుతో ఏమిటిలే బావా... ఎవరి గొడవలు వాళ్లకుంటాయిగాని రమవచ్చి రెండు నెలలు పైబడింది గదా! రమ అత్తగారింటినుండి రమను పంపమనిగానీ, తామొచ్చి తీసుకెళతామనిగానీ ఏ కబురూ లేదా?"

"అయ్యోరామ... నీకింకా ఆ పిచ్చి నమ్మకం ఉందన్న మాట. మనకు మనంగా తీసుకెళ్లాల్సిందే తప్ప వాళ్ళేదో కబురు పెడతారనుకోవడం మన పిచ్చే"

వీళ్ళిట్లా మాట్లాడుకొంటుండగానే శేఖర్ కోర్టునుండి వచ్చాడు. షద్రకుణ్ణి పలకరించి లోపలికెళ్లి బట్టలు మార్చుకొచ్చి వాళ్ళ దగ్గరే కూర్చొనివ్యవసాయం మంచీ చెడూ అడిగి తనూ రమ విషయమే ఎత్తాడు.

"ఆ విషయాన్ని గురించే మాట్లాడుకొంటూ మీ రాకకోసరమే ఎదురు చూస్తున్నాం. రమ అత్తింటి పూసెత్తితేనే వూరుకోవడంలా. ఆ ఇంటి గడప తొక్కనంటోంది. 'నేను మీకు భారమైపోతేనో లేక అప్రతిష్ఠ అనుకుంటేనో అక్కడ నేను వాళ్ళ చేతుల్లో దిక్కులేని చావు చచ్చేబదులు ఇక్కడే ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటా' నంటోంది"

"మీరు తొందరపడి ఆ పిల్లనక్కడకు పంపొద్దు"

"మరి ఎన్నాళ్ళని? ఏం చేయాలి! దానికసలు ఆ ముసలాళ్ళంటేనే కాదు శ్రీనివాస్‌పట్లా అనుకూలత ఉన్నట్లులేదు. 'అమ్మా, అమ్మమ్మా తాళికట్టమంటే కట్టాడు. తెంపమంటే తెంపేశాడు. ఆ మాత్రం దానికి ఈ వాడుకి మాత్రం ఏం విలువుంది? ప్రేమానురాగాల మాట దేవుడెరుగు. కలిసి బతుకుతున్నాం. వాళ్లకంత ఊడిగం చేసాను. కనీసం కొంచెం అభిమానమైనా చూపాలన్న జ్ఞానం లేని మనుషులు. అంత చాకిరీ ఏ ఇంట్లో చేసినా నా పొట్టగడవక పోదు. ఇదీ దాని వరస."

"మా అక్కేమంటోంది?" దిగులుగా అడిగింది లక్ష్మి.

"ఏమంటుంది. మన తాహతుకుమించి డబ్బూ ఖర్చుపెట్టాం. ఇంటికి పెద్దపిల్ల ఇలా అయిపోయిందేమిటా అని దానికి ఒకటే దిగులు. తిండీ సరిగా తినడంలా. ఆ మాటకొస్తే రమే నయం. అత్తారింటి విషయం ఎత్తకుండావుంటే దానికసలు చీకూచింతాలేదు. పీడ విరగడయి

పోయిందనుకుంటోంది."

"చిన్నసన్నాసి దానికేం తెలుసు–బతుకంతా ముందేవుంటే. మగపిల్లవాడు వాడిబతుకేదో వాడు బతుకుతాడు. వాడి పెళ్ళామేదో తెప్పుకుంటుంది. దీనికే మరి కొంత డబ్బూ, పొలమూ ఇచ్చి సర్దుబాటు చెయ్యటంగాని, అలా దారికిరాకపోతే భయ పెట్టి అయినా నయానో భయానో ఏదో పద్ధతిలో కాపురం సరిచెయ్యకపోతే రమ ఎలా?" కాపురం ఎక్కడ బుగ్గిపాలవుతుందో అన్న ఆదుర్దాతో అంది లక్ష్మి.

"అవన్నీ తరవాత. ముందు మన పిల్ల ఇష్టపడాలిగా అక్కడకు వెళ్ళడానికి" అన్నాడు రాజారావు.

"పొలం కాకుండా మీరిచ్చిన డబ్బు వాళ్ళకిచ్చేసారా?" శేఖర్ అడిగాడు.

"ఆ డబ్బు మనమ్మాయి పేరుమీదే ఫిక్సెడ్ డిపాజిట్ చేసాం. విడిగా అప్పుడప్పుడూ ఓ పాతికవేలుదాకా వాళ్ళకిచ్చాం–పెళ్ళి ఖర్చులకు ఇచ్చిందికాక. నేనిప్పుడు ప్రత్యేకంగా ఇక్కడకు రావడానికి ముఖ్యకారణం రమ వత్తిడి. 'బాబాయి ఏదో ఒకటి చూడగలరు. ఎంత చిన్నదయినాసరే నేనేదో ఉద్యోగంలో చేరతాను. వెళ్ళి బాబాయితో మాట్లాడ' మని దాని గొడవ. నాకక్కడ పనులు బాగా వత్తిడిగా వున్నాయి. అయినా ఉత్తరం రాయడం దేనికి ఓ పూట వెళ్ళివద్దామని వచ్చాను."

"ఉద్యోగానికేమిటి...ఏదో చూడొచ్చు అనుకోండి. కాని ఉద్యోగంలో చేర్పడమంటే మనమే తెగతెంపులు చేసుకున్నవాళ్ళమవుతాం గదా!"

"అదీ అయింది. మొన్న మా ఊరతను హైదరాబాదు పనుండెళితే శ్రీనివాస్ మేనమామ కనపడి 'మా అక్కావాళ్ళతో నిమిత్తంలేకుండా వాళ్ళకు చెప్పకుండా వాళ్ళ పిల్లను తీసుకెళ్ళిపోయారట. అటు పంటి వాళ్ళతో మాకెక్కడ కుదురుతుంది. తెగతెంపులు చేసుకుంటాము' అన్నట్లు మాట్లాడాడట. అప్పటినుండే పూళ్ళో మరి అల్లరయింది."

"అల్లరికేమొచ్చెలెండి. మొదట్లో కొన్నాళ్ళు చెప్పుకుంటారు" ఆలోచిస్తూ అన్నాడు శేఖర్.

"పులిమీద పుట్రలా సరస్వతి ఇంకో విషయం చెప్పింది. రమ నీళ్ళు పోసుకుందేమో అని అనుమానంగా వుందంది. బయటచేరి రెండునెలలవుతోందట."

"ఏమో ఇది మన మంచికే వచ్చిందేమో! ఆ పసికందుని చూసి అయినా వాళ్ళు రమను ప్రేమగా చూస్తారేమో" ఆశగా అన్నది లక్ష్మి.

"నువ్వొకవేపునుండే ఆలోచిస్తున్నావు లక్ష్మి! కొందరున్నారు – బిడ్డల్ని ప్రేమగానే చూస్తారు. కాని ఆ బిడ్డల తల్లిని మాత్రం ఏడిపించుకుతింటూనే వుంటారు. చివరకు ఆ బిడ్డల్ని కూడా తల్లికి దూరం చేయగల ఘనులుంటారు. మనం అన్ని వేపులనుండి ఆలోచించాలి" శేఖర్ మళ్ళీ అన్నాడు. "నేననుకోవడం మాత్రం రోజులు గడవకముందే రమను ఈ ఆపదనుండి గట్టెక్కించడం శ్రేయస్కరం."

"అంటే" నుదురుచిట్లిస్తూ ఆశ్చర్యముతో అన్నది లక్ష్మి.

"అంటేలేదు కొంటేలేదు. అబార్షన్ చేయించడం మంచిది" గట్టిగా అన్నాడు.

"ఏమిటి మీరనేది? రోజులెప్పుడూ ఒక్కలానే వుంటాయా? ఆ భగవంతుడు లేడా? దాని ముఖానెలా రాసిపెట్టివుంటే అలా జరుగుతుంది" బాధపడిపోతూ

అన్నట్టి ప్రార్థం చేసుకుంటున్నా
గారూ ... రమ బిడ్డను
రేమ్నాన్ని యావజ్జీవ ఖైదులోకి
కన్నాహమాటంగా తన అభి
న్నెప్పాడు శేఖర్.

ప్రషయం విన్నదగ్గర్నుండీ
కంటే ఇప్పటి మన కర్తవ్య
అని ఆందోళనగానే వుంది
రా'' రాజారావు కంఠంలో

లలకేమిటండీ. రమ కాపురం
డితే వాళ్ళే పడతారు వద్దనే

త్త భర్త ముఖంలోకి గుర్రుగా
ది. ''ఈ విషయంలో రమే
ండి'' బావనడిగింది.

ఈ వ్యవహారం గురించి ఇంటిదగ్గర
పెద్దగా తర్కించుకోలా. దానికేం
మనమెలా చెబితే అలా వింటుం
సుకుంటున్నా''

మిటో బావా...దూరం ఆలోచిస్తే
చెప్పింది సరయిందేమోగాని
అన్నమాట వినడానికే నాకు
టు కలిగిస్తోంది. ఏనాటి పాపమో
భం తెలియనిదానికిన్ని కష్టాలు''
బాయిదగ్గరకెళ్ళి ఉద్యోగమేదైనా
నండి అంటూ నన్నిక్కడకు
ని పోరుపెట్టింది'' శేఖర్‌తో
ు రాజారావు.

దో ఆలోచిద్దాంలెండి''
ంటేం చేస్తున్నారో'' అంటూ
అక్కడినుండి లేచింది.
దల్లుళ్ళిద్దరూ ఏవో రాజకీయాల్లో

పుణ్య భారతావనిలో పెండ్లి
రాల్లో ఏ చిన్న పొరపాటు

నిర్ణయం చేసినా ఇంక ఆడపిల్ల జీవితాన్ని సుడిగుండంలోకి నెట్టినట్లే.

* * *

నాన్న తాను బట్టిన కుందేటికి మూడే కాళ్ళంటూ పెండ్లికి బొత్తిగా ఒప్పుకో వడంలా. అందుకే స్నేహితులు, ఆ అమ్మాయి తరఫువాళ్ళ సమక్షంలో దండలు మార్చుకోబోతున్నాం. కరుణా, కరుణ భర్తా ఇక్కడే వున్నారు. ఆ రోజుకి మీరు రండి' అంటూ అక్కా బావలకు వుత్తరం రాసాడు అరుణ తమ్ముడు. ఆ వుత్తరంలోనే రాశాడు 'కరుణకూ్కడా నా పెండ్లి అంత ఇష్టంగా లేదు. దానికి ఆడపడుచు లాంఛనాలు గిట్టవన్న బాధ. ఆడంబరంగా పెళ్ళి పెత్తనం చేయడానికి అవకాశం లేదు గదా మరి'.

''బావమరిది ఘటికుడే'' నవ్వుతూ అన్నాడు శేఖర్.

పెండ్లికి బయలుదేరడానికి లక్ష్మి తటపటాయించింది.

"అరుణా...ఈ పెండ్లి మీ నాన్న కిష్టం లేదుకదా! తోడబుట్టినదానివి నీవెళ్ళావంటే అర్థమున్నదిగాని అందరం వెడితే మీ నాన్న కష్టపెట్టుకుంటా రేమో!" మొహమాటంగా అన్నది.

"అనుకోవడానికేముందిలే అక్కా.... అలా అయితే నేనూ కష్టపెట్టుకుంటాను. వాడేం తప్పు పని చేయడం లేదుగా. పెద్దవాళ్ళయ్యేసరికి చాదస్తాలు పెరుగు తాయి. తన మాట వినలేదన్న అక్కసు తప్ప అది వాడి జీవిత సమస్య గదా! వాడి ఇష్టా యిష్టాలను గురించి ఆలోచించకపోతే ఎలా? నాలుగు రోజులు పోతే ఆయనే సర్దుకుంటాడు" అంది



కాని సీత నిండు చూలాలిగానే అరణ్యంలోకి గెంటబడింది. ముహూర్తాలు పెట్టిచేసే పెళ్ళిళ్ళన్నీ ఒకేరకంగా వుంటున్నయ్యా? లక్షణంగా కాపురాలు చేసుకుంటున్నవాళ్ళు, విడాకులు పుచ్చుకొంటున్నవాళ్ళు, వైధవ్యం పొందుతున్నవాళ్ళు... ఎన్ని రకాలుంపటంలా! అయినా ముహూర్తాలు, మంచీ చెడూ, పురోహితునితో పెళ్ళిళ్ళు అనాదిగా వస్తున్న ఆచారం. దాన్ని కాదనడానికి ఎంతైనా ధైర్యం కావాలి.

ఏమైనా ఎవరి నమ్మకాలు వాళ్ళవి అనుకొంది.

"అమ్మా...నాకు మావయ్య మెడలో దండ కావాలి" రాగం తీస్తూ వచ్చింది గీత.

"ఏమ్మా! నీకూ్కడా పెండ్లి చెయ్యమన్నావా?" కూతుర్ని ఎత్తుకొని సుధాకర్ దగ్గరకు తీసుకెళ్ళింది.

ఆ రాత్రికంతా హైదరాబాదులోనే వున్నారు. మరుసటిరోజు ఉదయమే సుధాకర్, అతని భార్య ఉషలను తమతో తీసుకొని బందరు ప్రయాణమయ్యారు.

* * *

ఉషకు ఏమాత్రం కొత్తా పాతా లేదు. ఇంటిలోని మనుషులందర్నీ ఎప్పటినుండో ఎరిగున్నదానిలా ఎంతో కలివిడిగా తిరిగింది. శేఖర్ని కూడా అన్నయ్యా అంటూ ఏం బెరుకులేకుండా పిలుస్తూ కబుర్లాడుతూంటే లక్ష్మికదో కొత్త అనుభూతి. ఏనాడూ అన్నపూర్ణ తమ ఇంట్లో అంత కలుపుగోలుగా తిరిగింది లేదు. చదువుకున్నవాళ్ళకు నిక్కు టెక్కు అంటారు. అలా అనుకోవడం చదువుకున్న వాళ్ళందరిపైనా అభాండం వేయ్యడమేననిపించింది లక్ష్మికి.

పల్లని సాయంసమయం. పిల్ల తెమ్మెరలు వీస్తున్నాయి. చెట్లనిండా విరగబూసిన పువ్వులు. పసుపు రాశిగా పోశారా అన్నట్లున్న చామంతులు. ఫెన్సింగంటా తీగ కనిపించకుండా వెదజల్లినట్లు అక్కడక్కడా కెంపుల్లా మెరుస్తూన్న కాశీరత్నం పూలు... వీటన్నింటినీ మించి అద్భుతంగా వున్న దృశ్యం గడ్డి నామంతా అల్లుకొని పూసిన పసుపు పచ్చని బీర పువ్వుల సౌందర్యం. నీరెండలో ఆ మొక్కల మధ్య కబుర్లాడుకొంటూ తిరుగుతున్నారు నవదంపతులు. వాళ్ళతో పాటు అరుణ, శేఖర్‌లు కూడా నేల మీద గెంతుతూన్న పావురాయిల్ని తదేకంగా చూస్తుండిపోయింది గీత.

ఇంతలో భాగ్యం అక్కడికే కుర్చీలు తెచ్చివేస్తే అంతా కూర్చున్నారు. ఆ ఆహ్లాదకరమైన వాతావరణంలో ఉష అలా తిరుగుతూనే కూనిరాగాలు తీయడం ప్రారంభించింది.

"ఏమయ్యా బావమరిదీ....మా చెల్లెలు పాటలు కూడా చక్కగా పాడేట్లున్నది. రెండు పాటలు పాడించగూడదటయ్యా!"

"అన్యాయం అన్నయ్యగారూ... మీ అధికృతను మీరు ఒక్క నిముషం గూడా మరిచిపోరుగదా! సుధాకర్ పాడించేదేమిటి? నేనేమైనా రికార్డు ప్లేయర్నా? పాడటం, పాడకపోవడం నాయిష్టం" కుండబద్దలు గొట్టినట్లు మాట్లాడింది ఉష.

"నాకు నచ్చావమ్మా ఉషా" మెచ్చుకోలుగా అన్నది అరుణ సుధాకర్‌ది మంచి సెలక్షనే అనుకున్నది మనస్సులో.

"తప్పయిపోయిందమ్మా చెల్లెలా...నా మాట వెనక్కి తీసుకుంటున్నా. నీవు మాత్రం పాట పాడాలి"

మళ్ళీ మళ్ళీ అడిగించుకోకుండా కొద్దిగా కంఠం సరిచేసుకొని గళం విప్పింది. "మాదీ స్వతంత్ర దేశం. మాదీ స్వతంత్ర జాతి" అంటూ గొంతు కంచుగంటలా వుంది. పాట అయిపోయినా అంతా అలా మంత్రముగ్ధుల్లా వుండిపోయారు.

ఇంట్లో పని చూసుకొంటున్న లక్ష్మి కూడా వచ్చేసింది పాట వినబడి.

"ఇంకో పాట ఉషా" అరుణ అడిగింది. "కొంతమంది యువకులు పుట్టుకతో వృద్ధులు" అని ఓ పాట మొదలెడితే, ఆపాట కనుగుణంగా

సుధాకర్ చిటికవేస్తుంటే అతని చేతివంకే వింతగా చూస్తూండిపోయింది గీత. గీతను తన ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు సుధాకర్.

గీతం అలలు అలలుగా అలా గాలిలోకి వ్యాపించింది.

"అక్కయ్యా కోసరం ఇంకొక్క పాట" అవుతే అడిగింది.

"నీవుండేదాకొండపై నా స్వామీ" అంటూ లక్ష్మీక్కావలసిన పాటపాడి "ఇంక పాడను బాబూ" అంటూ చిన్న పిల్లలా అన్నది ఉష!

గడ్డజున్ను ముక్కలుగా కోసి ప్లేట్లలో సర్ది తెచ్చింది భాగ్యం. ఆ ప్లేటు తెచ్చి టీపాయి మీద వుంచి పాట వింటూ నోరు తెరుచుకొని అలా నిలబడిపోయింది భాగ్యం.

"ఈ అమ్మాయిగార్ని మనింటికాడ కానరోజులుంచుకుందామండి" భాగ్యం అన్నది.

"అలానేలే. నీవా జున్ను ప్లేట్లు తలా ఒకటి చేరికిద్దూ"

ఆరోజు తెల్లవారుఝామునే గేదె ఈనింది. తన కిష్టం వుండదు పద్దంటూ ప్లేటు తీసుకోలేదు సుధాకర్.

"భలేవాడివయ్యా..... ఎక్కడైనా జున్నూ, మామిడిపండు గోంగూరపచ్చడీ ఇవి తిననివాళ్లుంటారా? తిను తిను" అన్నాడు శేఖర్.

"లేదు బావా....పచ్చడి జున్నైనా కొంచెం తింటాను గాని ఇది నాకసలు ఇష్టం వుండదు"

"తనకక్కర్లేకపోతే అది కూడా నేనే తినేస్తానులెండి. ఎంత రుచిగా వుందో" నోరూరిస్తూ అంది ఉష.

"నీ పాట విని తినడం మూలానో లేక అక్క చేతి మహిమోగానీ జున్ను నిజంగా చాలా రుచిగా వుంది. కొంచెం తిని చూడరా సుధా" అంది అరుణ.

చేసిన వంట రుచిగా వుందన్న వ్యాఖ్యలతో లక్ష్మి ముఖంలో వెయ్యిఓల్టులకాంతి.

"జున్ను నేను తిననన్న విషయం నీకు తెలీదాఏం అక్కా. భాగ్యం... ఆ ప్లేటు ఇటివ్వు. లేకపోతే నా ప్లేటు కూడా ఉషే తినేస్తుంది" అంటూ తన ప్లేటు తీసుకొని గీతకు కొంచెం కొంచెం తినిపించసాగాడు సుధాకర్.

"అదేమిటయ్యా...అంత ఇష్టమయినపుడు ఆ ప్లేటులోది కూడా ఉషే తింటే ఏమయింది?"

"నీకు తెలీదక్కా....స్వీట్సు చూస్తే ప్లేట్లకు ప్లేట్లు లాగించేస్తుంది. అందుకే చూడరామా ఎలా పొత్రంలా తయారయిందో?"

"నయం ఊరుకోవయ్యా...ఎవ్వరైనా వింటే నవ్విపోగలరు. చందమామలాంటి పిల్లను పట్టుకొని అవేం మాటలు" లక్ష్మి అన్నది.

"అనుకోనీయండొదినా .... నాకంటే తను మహా నాజూగ్గా వున్నట్లు పెద్ద"

"భాగ్యం .... లోపలకెళ్ళి ఫ్రిజ్ లో వున్న జున్ను పట్టుకొచ్చి ఉషకివ్వు. సుధాకర్....గీతకు మరీ ఎక్కువ పెట్టకయ్యా. నువ్వు పెడుతుంటే అది గుటుకు గుటుకు మింగేస్తుంది. జుబ్బు చేస్తుందేమో" ఆదుర్దాగా అన్నది లక్ష్మి.

"జున్ను జబ్బేం చెయ్యదక్కా...ఆరోగ్యానికి మంచిది కూడా.'ఎ' విటమిన్ జున్నులో పుష్కలంగా వుంటుంది."

"అయినా చిన్నపిల్ల గా... అంతవరకు చాల్లే గీతా... ఇటు రామ్మా. నీమూతి కడుగుతాను" లక్ష్మి పిలిచింది.

''ఏమయ్యా సుధాకర్... నీతో నాకో చిన్న పేచీ వుందయ్యా"

''అదేంటండీ బావగారూ! మనిద్దరి మధ్యా పేచీనా?'' భయం నటించాడు సుధాకర్.

''మరేనయ్యా... నువ్వు కట్నంపుచ్చు కున్నా మానినా మా కనవసరం. ఆడ పడుచు కట్నం ఇప్పించకపోతే అది మాత్రం పెళ్ళి కాదయ్యా" సీరియస్‌గా అన్నాడు శేఖర్.

"కట్నకానుకలకు సంబంధించిన నియమ నిబంధనలు కూడా మీ లాపు స్త కాల్లో వున్నాయా బావా! మీకేం కావాలో హైదరాబాదొచ్చి పెట్టించుకోండిగాని లా పు స్తకాలుతీసి రాద్ధాంతం చెయ్యకండి" గాభరా నటించాడు సుధాకర్.

అందరూ నవ్వేశారు.

సంభాషణ కోర్టులు తీర్పులవేపుకి మళ్ళింది. "రాజ్యాంగం, లా పుస్తకాలు మారినా మారకపోయినా మారుతున్న కాల మాన పరిస్థితులకనుగుణంగా కొన్నైనా తీర్పులొస్తున్నాయి" అంది ఉష.

"అవును. ఈమధ్య బీహారులోనో, యు.పి.లోనో ఓ కోర్టు తీర్పు వచ్చింది. విచారణ జరపకుండా 14సంవత్సరాలు నిర్బంధంలో వుంచిన తరువాత అతడు నిరపరాధి అని కోర్టు తీర్పిచ్చింది. ఆ తీర్పుమీద అతడు మరలా కోర్టుకెళితే 'నిందితుని జీవితంలో 14 సంవత్సరాల కాలం వృధా అయిపోయింది కాబట్టి అతనికి 30వేల రూపాయలు నష్టపరిహారం చెల్లించాలి' అన్న తీర్పిచ్చింది కోర్టు. ఇంతకుముందెన్నడూ ఏ కోర్టు ఇలాంటి తీర్పియ్యలేదు" శేఖరన్నాడు.

"సరిత కేసులో మాత్రం జడ్జిగారి తీర్పు చారిత్రాత్మకమైనదికాదూ?'' అంటు న్నది అరుణ.

''సరిత కేసేమిటర్రా'' లక్ష్మి కుతూ హలం.

''కొన్నిసంవత్సరాలకు ముందెప్పుడో సరితనువదిలేసిన భర్త ఈవిడ సినిమాల్లో చేరి డబ్బు, పేరు సంపాదించడం మొద లెట్టాక తాను తాళిగట్టిన భార్య ఇదే అన్న సంగతి జ్ఞాపకానికి వచ్చింది. 'ఆవిడ తన భార్య. తనింటికివచ్చి తనతోకలిసి కాపురం చేసేట్టుగా కోర్టువారు తీర్పిచ్చి తనకు న్యాయం కలుగచెయ్యాలి' అని కోర్టుకెళ్ళాడు.

'ఆవిధంగా తనను బలవంతపెట్టి అతని దగ్గరకు పంపడమంటే తన ప్రాణా నికే ముప్పుకలిగించినట్లవుతుంది. అలా చేయడమంటే తను జీవించడానికిగల ప్రాథమిక హక్కును కాదనడమే. కోర్టు నాకు న్యాయం కలుగచెయ్యాలి' అన్న వాదన సరితది" అరుణ వివరించింది.

"దానిమీదకోర్టేం తీర్పిచ్చింది ?" లక్ష్మికి ఈ కేసు చాలా ఇంటరెస్టింగ్‌గా వుంది.

''ఏ పురుషుడయినా భార్యకిష్టం లేకుండా ఆవిడను బలవంతంగా తన దగ్గరకు తీసుకెళ్ళడంగాని" ఆవిడతో కాపురం చేయడంగాని ఆవిడపై అత్యాచారం చేసినట్లే అవుతుంది. ఇది చట్టవిరుద్ధం. ఏ పురుషునికి భార్యపై అలాంటి హక్కులేదు అంటూ తీర్పిచ్చారు" అరుణ చెప్పింది.

"అంటే ఇకముందు ఏ భర్తకూ ఇది నా పెళ్ళాం, నా స్వంత ఆస్థి, దీన్ని తంతాను... పొడుస్తాను... నరుకుతాను అంటూ గణాచారిలా విజృంభించడానికి అవకాశం వుండదన్న మాట" ఇంకా విశద పరిచింది ఉష.




లక్ష్మి మూతిమీద చెయ్యేసుకొని "అలాగయితే ఇంక సతీత్వ నిరూపణకు అగ్నిలోదూకిన జానకి, భర్తను వేశ్య ఇంటికి మోసుకెళ్ళిన సుమతి ఇల్లాంటి వాళ్ళందరి పాతివ్రత్యగాథలు కాలగర్భంలో కలిసిపోయినట్టేనా ?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఇంకా నీకు అనుమానం దేనికొదినా? ఇకమీదట సరిత కేసు తీర్పుల్లాంటివే చరిత్ర ప్రసిద్ధి చెందుతాయి" ఉషేఅన్నది.

"బాగానే వుంది"లక్ష్మి దీర్ఘంతీసింది.

"దోమలు కుడుతున్నాయక్కా" అరుణతో అన్నాడు సుధాకర్.

"లోపలకి పదండి. లైటులేకుండా మొక్కల మధ్య దోమలు మరీను"అంటూ అందరూ లేచారు.

* * *

బందరులో రెండురోజులు గడిపాక సుధాకర్, ఉషలతోపాటు అరుణకూడా పెనమకూరుకి బయలుదేరింది.

చుట్టాలున్న రెండురోజులూ ఇల్లు కళకళలాడుతూ నవ్వులు పువ్వులతో, కబుర్లతో కాలం ఇట్టే గడిచిపోయింది.

వాళ్ళలా వెళ్ళిపోగానే లక్ష్మికేమిటో ఇల్లంతా బోసిపోయినట్లుంది. చైతన్యాన్నంతా వాళ్ళు తమతోపాటే మూట గట్టుకుపోయారా అనిపించింది.

భర్త కొట్టుకెళ్ళగానే చేతిలోకి ఓ పీక్లి తీసుక్కూర్చుంది. చేతిలో పీక్లిదాంపీక్లిదే బుర్రలో ఆలోచనలు బుర్రలోనే.

* * *

ఒక్కగానొక్క కొడుకు. తాను బడిపంతులే అయినా గొప్పవారితో వియ్యమొంది తన స్థాయి, అంతస్థులను పెంచుకోవాలనుకున్నాడు. వయస్సు పైబడటంతో మిధ్యాడంబరాలకు బానిసైన రాఘవయ్య తను గట్టిగా పట్టుబడితే తన మాటకు తలొగ్గుతాడనే భ్రమపడ్డాడు. కథ ఇలా అడ్డం తిరుగుతుందనుకోలా. ఫలానారోజు ఫలానా టైముకి పెండ్లి, అమ్మను వెంటబెట్టుకు రావలసిందని సుధాకర్ రాసిన వుత్తరం చూసి రుద్రావతారం ఎత్తాడు. తోకతొక్కిన తాచులా ఎగిరిపడ్డాడు. ఆ స్థితిలో సీతమ్మ భర్తకు ఎదురు చెప్పలేకపోయింది గానీ భర్త పైన అక్కసుగానే వున్నది. కొడుకు ఏనాడూ తమని మంచి బట్టలు కావాలని గాని, అదీఇదీ కావాలనిగాని వేధించింది లేదు. పరిస్థితిని బట్టి సర్దుకుపోతుండే వాడు. వాడికి నచ్చిన పిల్లను చేసుకుంటా నంటే మనకి పంతాలూ పట్టింపులూ దేనికంటూ సణుగుతూనే వుంది. స్నేహితులూ, సహోద్యోగులూ కూడా 'నీవిలా చేయడం బాగుండలేదు. నీచేతి మీదుగా వివాహం జరిపించడం నీకు హుందాగా వుంటుం'దని చెప్పినకొద్దీ బిర్రబిగిసాడు.

సీతమ్మా తనతో మనసు విప్పి మాట్లాడకపోయేసరికి ఒక్కోపూట గడిచే కొద్దీ రాఘవయ్య కొద్దికొద్దిగా పునరాలోచనలో పడ్డాడు. కొడుకు పెళ్ళి చేసేసుకున్నాడు. వాడికి దూరమై తానేం సాధించాలి?

క్రమక్రమంగా వంట్లో వేడి తగ్గడం ప్రారంభించింది. వాడు చేసిన నేరం మాత్రం ఏముంది ? నేటి కుర్రకారులా జీవితానికి ఓ లక్ష్యం, గమ్యంలేని తోక తెగిన గాలిపటం లాంటివాడు కాదు. వాడి జీవితానికి ఓ ఆదర్శం, లక్ష్యం వున్నాయి. ఇలా ఆలోచనలతో రాఘవయ్యకు రెండు రోజులూ రెండు యుగాల్లా గడిచాయి. అలా అస్థిమితంగా

కాలం గడపాలన్నా కష్టమే. రెండు రోజులూ ట్యుటోరియల్ కాలేజీకి సెలవు పెట్టాడు. ఇంకా సెలవు పెడితే ఉద్యోగానికి ఉద్వాసన చెబుతారేమో అన్న భయంతో ఆ వుదయం భోజనం కానిచ్చి బయలుదేరాడు.

* * *

ఇంటికి వచ్చిన రాఘవయ్యకు ముందు గదిలో కనిపించిన దృశ్యం – అరుణా, ఓ అపరిచితురాలూ కబుర్లాడుకొంటూ కూర్చొనున్నారు. అపరిచితురాలి వైపు కన్నార్పకుండా ఓ క్షణంసేపు చూసాడు. తన ఊహ నిజమయినందుకు మనస్సులోనే మహదానందం పొందాడు.

అరుణ నవ్వుతూ "మీకోడలు నాన్నా" అంటూ పరిచయం చేసింది. ఉష మర్యాదగా లేచి పక్కకు తప్పుకున్నది. మనస్సులోని సంతోషం బయటకు కనుపించనీయకుండా బింకంగా లోపలికెళ్ళిపోయాడు.

రెండు రోజులుగా తననుభవించిన నరకం పెరట్లో ప్రక్షాళనం చేసుకొన్నాడు రాఘవయ్య.

* * *

జిల్లాపరిషద్ ఆఫీసులో క్లర్కుగా చేరింది రమ అతి కష్టం మీద. శేఖర్ తన పలుకుబడంతా వుపయోగించి ఆ ఉద్యోగం వచ్చేలా చేయగలిగాడు. జిల్లా పరిషద్ చైర్మన్‌గారి ఆస్తిపాస్తుల సీలింగు వ్యవహారాల్లో శేఖర్ వాళ్ళకు లాయరుగా వ్యవహరించాడు. ఆ పరిచయం ఇప్పుడిలా వుపయోగపడింది. ఉద్యోగం దగ్గరలోనే లభించటం పెద్ద అదృష్టంగా భావించింది రమ. తనకు వంటరిగా వుండాల్సిన బాధ తప్పింది. భర్తతో విడిపోయిన స్త్రీ వంటరిగా వుంటూ ఉద్యోగం చేయడానికి చాలా సాహసం కావాలి. ఈ సమాజంలో అలాచేయడం కత్తిమీదసామే. ఒక వయసు వచ్చాక స్త్రీపురుషులిద్దరూ వైవాహిక జీవితాన్ని కోరుకుంటారు. ఆ జీవితంలో ఆనందపుటంచుల్ని చేరడానికి ప్రయత్నం చేస్తారు. అలాంటి వైవాహిక జీవితానికి ఉద్వాసన చెప్పాల్సి రావడమంటే అందుకు దారి తీసిన పరిస్థితులేమిటి, అందులో ఆ అమ్మాయి పాత్ర ఏమిటి అన్న ఆలోచనకంటే మొగుడిని వదిలేసిన ఆడదిగా అందరికీ అలుసే. తిలా పాపం తలా కొంచెం. ఎవరికి చేతనయినట్లువారు తలా ఒక రాయి విసిరే పుణ్యాత్ములే.

శేఖర్ అంత రమకు పెట్టనికోట. జీవితంలో తిన్న ఎదురుదెబ్బలు రమను రాటుదేల్చాయి. సహోద్యోగులూ, ఇరుగు పొరుగు ఎవరేం మాట్లాడినా, హేళన చేసినా తనకేం పట్టనట్లు లక్ష్యపెట్టకుండా వుండటం నేర్చుకున్నది. భయపడిన వాళ్లను మరీ మరీ భయపెట్టే ఈ సమాజం ఖాతరుచేయని వాళ్ళనేం చేయలేక తోక ముడిచేస్తుంది. ఈ విధమైన ఆలోచనాధోరణీ, పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కొగల మనోనిబ్బరం ఏర్పడడానికి అరుణ సాన్నిహిత్యం కూడా రమకు ఎంతగానో తోడ్పడింది. ఒకప్పుడు అరుణను ఎంతగా కించపరచి హేళన చేసిందో ఇవాళ అంతగా ప్రేమిస్తోంది రమ.

పుట్టింట్లో వున్నన్నాళ్లు రమ ఊసే తలపక నిమ్మకు నీరెత్తినట్లున్న ఆ ఇంటి వాళ్ళకు రమ ఉద్యోగంలో చేరడంతో గంగవెర్రులెత్తింది. తమను ప్రాథేయపడటం, తిరస్కరింపబడటంలాంటి సాంప్రదాయకపు తతంగమంతా లేకుండా ఇలా వుద్యోగానికి బరితెగిం

చడం ఎంత తలబిరుసుతనం అను కున్నారు. వ్యవహారం పర్యవసానం తేల్చుకోవడానికి తొందరపడాల్సిన స్థితి తమపైన బడటం మరీ చికాకు కలిగించింది. ఉద్యోగంలో చేర్పించడంలో వీళ్ళ వుద్దేశమేమిటో తేల్చుకోవడానికి శ్రీనివాస్ మామయ్య ఆవసిగడ్డ వచ్చాడు.

రమను అత్తవారింటికి పంపడం అసాధ్యం అని తేల్చుకున్నాకనే ఉద్యోగంలో చేర్చారు. అందుకే రాజారావు ఆ వచ్చినాయనతో "మీరు కోరుకున్నట్లుగానే మీతో సంబంధం తెగతెంపులు చేసుకోవడానికి మేమూ సిద్ధం" అన్నాడు. ఆశించని సమాధానంతో అదిరిపోయాడు శ్రీనివాస్ మామయ్య. కొంచెం తమాయించుకుని "అంటే ఏవిధంగా?" నుదురు చిట్లిస్తూ అడిగాడు.

"ఇంతదాకా వచ్చాక ముసుగులో గుద్దులాట దేనికండీ! రమకిచ్చిన కట్న కానుకలూ, పెట్టుపోతల నిమిత్తం ఇచ్చినదీ మొత్తం అక్షరాలా లెక్కచూసి మా డబ్బు మాకిచ్చేస్తే అట్టే గొడవ పడకుండా తెగతెంపులు చేసేసుకుంటాం" కుండ బద్దలుకొట్టినట్లు మాట్లాడాడు.

"మా అక్కావాళ్ళకు చెబుతాను" అంటూ నెమ్మదిగా జారుకున్నాడు ఆ పెద్దమనిషి.

ఆ తరువాత ఏదోవిధంగా కొంత డబ్బు ఎగ్గొట్టడానికి వాళ్ల ప్రయత్నం వాళ్లుచేసినా రాజారావూ,గంగాధరంగారూ పలుకుబడిగలవాళ్లవడంతో వాళ్ళ ఆటలు సాగలా. మొత్తం డబ్బిచ్చేసెయ్యాల్సొచ్చింది. రమను కాపురానికి తీసుకెళ్ళమని పిల్ల కాళ్లావేళ్లాబడితే కొండెక్కి కూర్చొని కొంతకాలం ఏడిపించేవాళ్ళే. వాళ్లకాథాన్సు లేకుండా రమ వైపునుండే సిద్ధపడేసరికి దిగిరాక తప్పలేదు.

ఏమైనా జీవితాన్ని రంగుల చిత్రంగా భావించిన రమ వైవాహిక జీవితానికి అలా తెరపడింది.

* * *

తనకు ఎనలేని విలువనిచ్చి, తనను అనుసరించి జీవనక్రమాన్ని ఏర్పరచుకున్న మనిషి కష్టసుఖాలతో, ఈతి బాధలతో తనకేమీ సంబంధం లేనట్లు నియమం తప్పక సాగిపోతుండటం కాల ధర్మం.

గీతకు అయిదో సంవత్సరం. స్కూలు కెడుతోంది. ఆ తరువాత అరుణకింకో పిడ్డ పుట్టాడు. వాడి పేరు రాహుల్. వీడికి మూడో సంవత్సరం. వీడూ లక్ష్మికే మాలిమి. ఈ పిడ్డల ప్రవేశంకూడా అరుణా – శేఖర్‌లకంటే లక్ష్మి–శేఖర్‌ల మధ్య అనుబంధాన్నే పెంచింది. ఇద్దరు పిడ్డల తల్లయినా అరుణకేమిటో లోటుగా, జీవితం నిస్సారంగా అనిపిస్తూంటుంది. ఏవో పనులు కలిపించుకుంటూనే వుంటుంది. పుస్తకాలు అత్యంత ఆప్తులైన స్నేహితులామెకు. మానసికమైన వంటరితనంలో ఒక్కోసారి కాలం స్తంభించిపోయిందా అనిపిస్తూంటుంది. జీవితంలో సెక్స్‌ది ప్రధానపాత్రే. అయినా మానసిక వికాసానికి అదొక్కటే సరిపోదు. పరస్పరం అర్థంచేసుకుంటూ ఆత్మీయతతో అనురాగంతో ఏకమయ్యే దాంపత్య జీవితం స్త్రీ పురుషులిరువురికీ కూడా సమానంగా అవసరం. అది లేకపోవడ మంటే జీవితంలో అమూల్యమైనదాన్ని కోల్పోయినట్లే. వివాహం జరిగింది కాబట్టి వైవాహిక జీవితాన్ని ఓ బాధ్యతగా మాత్రమే తీసుకుంటే ఆ జీవితం నిస్సారంగానే మిగిలిపోతుంది.

కొంతమంది జీవితంలో డబ్బుకి అంతులేని ప్రాధాన్యతనిచ్చి ఆ డబ్బుతో లభించే అంతస్థూ హోదా ఆడంబర జీవితాల్లో ఆనందాన్ని పొందే ప్రయత్నం చేస్తారు. ఇటువంటి జీవితానికీ, అరుణకూ పొద్దదు. అందుకే అన్ని రకాలగాను అరుణకు జీవితంలో నిస్పృహే మిగిలింది.

పరిస్థితుల ప్రాబల్యంవలనకానీ, తన బలహీనతకానీ శేఖర్‌ని పెండ్లాడటం లక్ష్మికి ద్రోహం చెయ్యటమే. ఆ తరువాత మాత్రం తనకు తెలిసి తను లక్ష్మికి ఏ విధమైన బాధా కలిగించిందిలేదు. కానీ ప్రస్తుతానికి లక్ష్మిని బాధపెట్టక తప్పేట్లు లేదు. భారతదేశంలో కొరతలేనిది దైవ భక్తి.

లక్ష్మికి దైవచింతనతో పాటు స్వాములార్లు, బాబాల భక్తికూడా. అరుణకేమో ఆ బాబాల ఫొటోలు చూడటమంటేనే అసహ్యం. వాళ్ళొట్టి మోసగాళ్ళు, దగాకోర్లు అన్న నమ్మకం.

పసివాళ్ళకు గోవిందలు కొట్టడం, భజనలు చేయడం, బాబాలకు నమస్కారాలు పెట్టడం నేర్పడం లక్ష్మి దినచర్యలో ఓ భాగం. అందుకు అరుణ అడ్డుపడుతూనే వుంటుంది. "ఏమిటక్కా నీకీ చాదస్తం. ఆ బాబాలెంత దగాకోర్లో మనం పేపర్లలో చదువుతూనే వుంటున్నాంకదా. అయినా నీ పిచ్చి పిల్లలక్కూడా పట్టించేట్లున్నావ్"





"ఊఁరుకో అరుణా నీది మరీ విడ్డూరం. ఊరంపరిడీ ఓ దారైతే ఫలిపికట్టిడో దారని జనమంతా బాబాలంటే ఎందుకిష్ట పడుతున్నారు? ఎవడో ఒకడు వెధవని అందరూ అంతేనేమిటి? ఈ బాబాగార్లో ఎంత మహత్తుందో!" అంటుంది లక్ష్మి.

ఏమైనా ఇలాంటి వ్యవహారాల్లో మెత్తగా వుండే పిల్లలెందుకూ కొరగాకుండాపోతా

రని లక్ష్మిని గట్టిగా ఎదిరించడానికే నిశ్చయించుకుంది అరుణ.

అరుణ కెలాగైనా దైవం మీద గురి ఏర్పరచాలన్న తహతహ లక్ష్మిది. ఏ విషయంలో చూసినా అరుణ తెలివైందీ, మంచిమనిషీకూడా. దేవుడంటేనే ఎందుకో ఇంత కసి. ఎలాగైనా అరుణలో మార్పొస్తే బాగుండునని లక్ష్మి కోరిక.




ఆ ఇంటిలో ఓ మెంబరుగా కలిసిపోయింది రమ. శేఖర్‌తో పాటే రమ కూడా 10 గంటలకు ఆఫీసుకెళ్ళడం, సాయంత్రం 5 గంటలకు ఇంటికి రావడం. పిల్లలూ, పుస్తకాలతో కాలక్షేపం. దరిదాపుగా సమవయస్కులు కావడంతో లక్ష్మితో కంటే అరుణా - రమల మధ్యే సాన్నిహిత్యం ఎక్కువ. ఆమధ్య రమ పునర్వివాహాన్ని గురించి కూడా ఆలోచన చేసారు. తనకప్పుడప్పుడే ఏమీవద్దనీ, పరిస్థితులనుబట్టి తరువాత ఆలోచించుకోవచ్చనీ, ముందు ఉమ పెండ్లి చేసెయ్యండనీ ఖచ్చితంగా చెప్పింది రమ. ఉమ పెండ్లి కానిచ్చేసారు. పెండ్లికొడుకు లెక్చరరు. ఆపూరి కాలేజీలోనే పనిచేస్తున్నాడు. వెనక ఆస్థిపాస్థులేం లేకపోయినా బుద్ధిమంతుడని తెలిసుకొని ఇంకేం ఆలోచించకుండా ఇచ్చి చేసేశారు. ఆ పెండ్లి సందర్భంగా రమ మానసికంగా ఎక్కువగానే బాధపడాల్సొచ్చింది. రమను ఓ దురదృష్టజాతకురాలిగా, పెంకిఘటంగా ఎవరిష్టమొచ్చిన వ్యాఖ్యానాలు వాళ్లు చేశారు. వేటినీ లక్ష్యపెట్టకుండా వుండటం అలవరుచుకున్నా అప్పుడప్పుడు మనస్సు కాస్త వికలమవుతూనే వుంటుంది.

రమ మనసులో అలాంటివి విన్నపుడల్లా ఛాయామాత్రంగా మినుకు మినుకుమంటుండే రూపం ఒకటి కదుల్తుంది. అది తన ఆఫీసులోనే పనిచేస్తున్న సెక్షన్ సూపరింటెండెంట్ ప్రసాద్‌ది. రమకు ప్రసాద్‌పైన ప్రత్యేకమైన అభిమానం ఏర్పడడానికి ముఖ్యకారణం అన్యాయాన్ని ధైర్యంగా ఎదిరించే అతని గుండెదిటవు. ఏ రోటిదగ్గర ఆ రోటి పాట పాడి తమ పబ్బంగడుపుకునే కపటపు మనుషలధికంగా వున్న ఈరోజుల్లో అతని ముక్కుకు సూటిగాబోయేతత్వం రమలో ప్రశంసాపూర్వక భావాన్ని కలుగజేసింది. ఆ కారణంగానే రమ అతనితో కొంత చనువుగా మెలిగేది. తోడబుట్టినవాళ్ళు సన్నిహితంగా వుంటేనే అనుమానపు దృక్కులు ప్రసరింపజేసే ఈ సమాజం, పరాయివాళ్ళు స్నేహంగా వుంటే తన పంజా విసరకుండా వుంటుందా? అయినా రమ ఎడారిలో ఒయాసిస్సులాంటి ప్రసాద్ స్నేహాన్ని వదులుకోలేకపోయింది. ఆ సందర్భంగానే రమకు ప్రసాద్‌ని గురించి తెలిసిన వివరం- అతను వంటరివాడూ అని. ఆడి ఆడి చమటబట్టిన శరీరానికి చల్లనిగాలి సోకినట్లనిపించింది రమకు ఆ వివరం తెలిసినపుడు. కానీ అతను తమ కులంవాడుకాదని వినగానే కంటిలో నలకబడినట్లైంది. పైగా జీవిత భాగస్వామిని కోల్పోయినవాడు. అతనికోపెద్ద కూడా

వుంది.

సవతిని స్వంత అక్కలా ప్రేమించ గలుగుతున్న విశాల హృదయమున్న అరుణ సాహచర్యం పసిబిడ్డకు మంచి మనసున్న తల్లిని కాగలనన్న ధైర్యాన్నిచ్చింది రమకు. ఈరకపు ఆలోచన లన్నీ బంధిఖానాలాంటి రమ బుర్రలో జోరీగల్లాగా రొదచేయడంతప్ప ఏనాడూ ఎవరిదగ్గరా బయటపడ్డదిలేదు. అలా సాగిపోతోంది రమ జీవితనౌక.

* * *

ఆరోజు ఉదయం 10 గంటలకు బాబాగారు విజయవాడ వేంచేస్తున్నారు.

లక్ష్మి ఆనందానికి,హడావిడికి అంతు లేదు. సాక్షాత్తు ఆ పరబ్రహ్మ సాక్షాత్కారం కాబోతోందన్నంత సంతోషం.

శేఖర్ చేత సెలవు పెట్టించింది. జగ మొండి అరుణను తీసుకెళ్ళగలగడం తన వల్లయ్యేపనికాదు. పిల్లల్ని మాత్రం తీసుకెళ్ళాలి. బాబాగారి దర్శనభాగ్యం తమ పూర్వజన్మసుకృతమనే అనుకొంది.

పిల్లల మంచీ చెడు బాధ్యతంతా లక్ష్మికే వదిలేసినా ఈ విషయంలో మాత్రం అరుణ ప్రేక్షకురాలిగా వుండ లేకపోయింది. పిల్లల్ని తీసుకెళ్ళడానికి వీల్లేదంటూ గట్టిపట్టే పట్టింది.

"నీవెలాగూ రావు. పిల్లల్ని తీసుకెడుతుంటే గొడవచెయ్యకరుణా! వెళ్లి చూసినంత మాత్రాన ఏం మునిగిపోతుంది" బాబాగారి దృష్టి పడినంత మాత్రానే పిల్లలకేదో మేలు జరిగిపోతుందన్న ఆశ లక్ష్మికి.

"తీసుకెళ్ళకపోతే ఏమయిందక్కా. మంచి గాని, చెడుగాని ఈ వయస్సులో పిల్లల మనస్సులపై చెరగని ముద్ర పడిపోతుంది. పిల్లలకు దైవం, భక్తి, బాబాలు ఇటువంటి వాతావరణం కల్పించడం మంచిది కాదు" పట్టుదలగా అన్నది అరుణ.

ఆ వాదనలతో తనకేమీ నిమిత్తం లేనట్లు శేఖర్ ఎటూ మాట్లాడడు.

"బాబాగారిని చూడడానికి వెడదామండీ" అంటే సరేనన్నాడు. లక్ష్మి ఆ పూసెత్తకపోతే బాబా వస్తున్నాడో, పోతున్నాడో అదీ పట్టించుకోడు.

'డాక్టర్లు, లాయర్లు, పెద్ద పెద్ద చదువులు చదివినవాళ్లు, రాజకీయ నాయకులు, మంత్రులు ఎంతమంది బాబాగార్కి సాష్టాంగ దండప్రమాణాలు చేయడం లేదు! ఆయన చేసే బోధలు, మంత్రిచ్చి ఇచ్చే విభూది ఎంతో సుఖసంతోషాలను కలుగజేస్తాయంటారు. ఏమిటో అరుణకి మొండితనం' తనలో తనే విసుక్కుంది లక్ష్మి.

అరుణ లక్ష్మికి నచ్చజెప్పే ధోరణిలో అన్నది "అక్కా!నువ్వు మొక్కని దేవుళ్లూ, చెట్లూ పుట్టలూ లేవు. చేయని పూజలు లేవు. పట్టని వ్రతాలూ లేవు. బాబాల సంగతి చెప్పనే అక్కర్లేదు. వీళ్ళలో నీ గోడు పట్టించుకున్నవాళ్ళెవరైనా ఉన్నారూ? నీకో బిడ్డ కలిగేట్టు చేయగలిగారా? నీ భర్త రెండో పెండ్లిని అడ్డుకోగలిగారా? అవిధంగా నీవెందుకు ఆలోచించవ్. ఈ బాబాలకు రోగాలు రావడం లేదా? వాళ్లు డాక్టర్ల దగ్గర కెళ్ళడం లేదా? వాళ్ళకు వయస్సు పైబడటం లేదా? ముసలితనం రావడం లేదా? జుట్టు నెరవడం లేదా? వాళ్లతోటి మనుషులకే భయపడి పెద్ద పెద్ద వస్తాదులను, పర్యటనల్లో పెద్ద పెద్ద పోలీసు బందోబస్తులను ఏర్పాటు చేసుకుంటున్నారే? వాళ్ళను వాళ్ళు రక్షించుకోలేని

వాళ్లు మనల్ని వుద్ధరించేదేమిటి?" నెమ్మది గానే మొదలుబెట్టి ఆవేశంలో పడిపోయింది అరుణ.

"నేను నీతో వాదించలేనరుణా. నీవు నాకు ఎన్నైనా పాఠాలు చెబుతావు తప్ప పిల్లల్ని మాత్రం పంపవ్..అంతేగా" నిష్ఠూరంగా అంది లక్ష్మి.

"నేను పంపేదేమిటక్కా. వాళ్లు నీ పిల్లలు. నీ ఇష్టం. వాళ్ళ శ్రేయస్సు కోరే ఇలాంటివి మంచిది కాదంటున్నా" నొచ్చెచెప్పే ధోరణిలో అంది అరుణ.

"సరేనమ్మా....నీ ఇష్టం" బియపుగా ధ్వనించింది లక్ష్మి కంఠం.

'ఇంక పిన్ని తననొదిలి పెట్టదు' మనస్సులోనే భయపడిపోయింది రమ. 'ఏదో చక్రం అడ్డం వేయాలి' మనస్సు లోనే నిర్ధారించుకుంది. "నా వర్కంతా పెండింగులో ఉండిపోయింది పిన్నీ. సెలవు పెట్టానంటే మా హెడ్ అగ్గి రాముడైపోతాడు" గాభరా నటిస్తూ అన్నది రమ.

లక్ష్మి బాధపడిపోయింది. ఏమిటో లక్షణంగా కాపరం చేసుకోవాల్సిన పిల్ల. ఇలా ఉద్యోగం చేయాలనుకోవడం, అడ్డ మైన వెధవచేతా చివాట్లు తినాల్సిరావడం. "వద్దులేవే రమా...నేనూ, మీ బాబాయి వెళ్ళొస్తాంలే. అప్పుడే ఎనిమిది గంటలయి నట్టుంది హిందీలో వార్తలొస్తున్నాయి" అంటూ ప్రయాణానికి సిద్ధపడాని కక్కడనుండి వెళ్ళిపోయింది.

అత్తవారింట్లో ఉన్నపుడు అత్తగారూ, ఆవిడమ్మా విసవకుండా బా బా గా రి భజనలో పక్క తాళం వేస్తూ పూజలు చేస్తూనే వుండేవాళ్ళు. ఇంకో పక్కే మో మానవత్వంలేని మాటలూ, చే త లూ.

దాంతో రమకు ఏకంగా బాబాల పట్లే వైముఖ్యమేర్పడింది.

శేఖరూ, లక్ష్మి బయలుదేరేసరికి దరిదాపుగా 9 గంటలయింది. భాగ్యానికి ఐదో మాసం గర్భిణీ. బాబాగారి విభూది దానికి కావాలి. అదీ బయలు దేరింది అమ్మగారితో. లక్ష్మికి మాత్రం భాగ్యం మీద ఆ క్షణంలో ఎన్నడూ లేనంత అభిమానం పొంగుకొచ్చింది.

* * *

"అరేయ్ బాబూ! ఓ వేలు పట్టుకోరా" రమ రెండేళ్ళు చాచి రాహుల్ ముందుం చింది.

చూపుడువేలు పట్టుకున్నాడు వాడు.

"గుడ్. ఈ రోజు ఆఫీసుకి ఎగనామం పెట్టేస్తాను. నువ్వూ, నేనూ ఆడుకుం దాంరా"

"ఏమాడుకుందాం పిన్నీ" ఉత్సా హంగా అడిగాడు రాహుల్. గీతను స్కూలుకి రిక్షా ఎక్కించొచ్చిందరుణ.

"అక్కతో దేమో బాబాగారి దర్శనాని కెళ్ళడానికి సెలవు దొరకదన్నావ్. ఆఫీసుకి తయారుకాకుండా వీడితో బాతా ఖానీ ఏమిటి?"

"నీకులాగా నేను పిన్నితో వాదించ లేను బాబూ. ఆ బాబాను చూడాలన్న మోజు నాకు లేదు. అందుకే అలా అబద్ధమాడేశాను. నేను సెలవు పెట్టిన విషయం పిన్నికేం తెలుస్తుంది? మరి ఈ బుద్ధిగాణ్నేమో నన్ను ఆఫీసుకెళ్ళ మంటావా, వద్దంటావురా... ఏదో వేలు పట్టుకోమంటే వద్దంటూ వేలు పట్టు కున్నాడు. మరేం చెయ్యమన్నావ్. నాకు ఎందుకో ఆఫీసు కెళ్ళబుద్ధిగావడం లేదరుణా. ఈ రోజంతా నిన్ను బోరు గొట్టించేస్తూ, వీడితో ఆడుకొంటూ కాలం గడపాలని వుంది" చిన్నపిల్లలా అన్నది





రమ.

"చాలా బావుంది. మరి ఆఫీసుకి సెలవు చీటీ?"

"ఇదిగో మన పక్కింటివాళ్ళ పాప చేత పంపిస్తున్నా. మా ఆఫీసులో పని చేస్తుంది సుజాత. వాళ్ళ ఇల్లు దగ్గరేగా. పదిదాటితేనేగాని తను ఆఫీసుకి బయలు దేరదు"

"ఆవిణ్ణి ఇంటిదగ్గర ఏవేళప్పుడు చూసినా ఎప్పుడూ ఏదో పని చేసుకుంటూనే వుంటుంది రమా! విశ్రాంతంటే ఎలా వుంటుందో ఆవిడకసలు తెలుసా అనిపిస్తుంది"

"తను పనిమనిషిని పెట్టుకోదు. ఇంటి పని మొత్తం తనేచేసుకోవాలి. పిల్లలిద్దరూ రాక్షసులు. వాళ్లను సమర్థించుకోవాలి. వాళ్ళ చదువులు చూడాలి. ఇంక ఖాళీ ఎక్కడ. ఎప్పుడూ అష్టావధానం, శతావధానం. ఆవిడిక్కాస్త విశ్రాంతంటూ లభించడం ఆఫీసులోనే" లీవ్ లెటరు కవరులో పెడుతూ అన్నది రమ.

"ఉద్యోగం చెయ్యకపోతే ఆవిడ ప్రాణానికసలు విశ్రాంతి లభించదంటావ్" నవ్వుతూ అన్నదరుణ.

"ఆహా అక్షరాలా నిజం"

పక్కింటివాళ్ళ పాప లీవ్ లెటరు తీసుకొని రాహుల్ని కూడా వెంటబెట్టుకొని వెళ్ళింది.

"సుజాతా వాళ్ళాయన మంచివాడే అరుణా! ఇద్దరూ అన్యోన్యంగా కూడా వుంటారు. కాని ఈవిడ ఇంటిలోపనితోటి, పిల్లల్తోటి నానా అవస్థా పడుతున్నా నిమ్మకు నీరెత్తినట్లు తన లోకంలో తానుంటాడుతప్ప దమ్మిడీ సహాయం చెయ్యడు. 'మీవార్ని మీరే అలా సోమరిలా చేస్తున్నారు. ఫ్లాస్కులో కాఫీ గ్లాసులోకి మీరు వంచివ్వకపోతే ఆయన పోసుకొని తాగలేరేమిటి' అంటే 'నాకిలాపోసివ్వడమే సుఖం రమా – ఆయన సగం కింద పోసుకొని సగం గ్లాసులో పోసుకుని ఇల్లంతా ఖరాబు చేసేకంటే' అంటూం టుంది. పైగా ఆయన్ని వెనకేసుకొస్తుం టుంది కూడా. ఆయన చిన్నప్పటినుండి పెరిగిన తీరు అలాంటిది. ఇంటిలో నాకు సహకరించడం న్యూనతగా భావించదు కాని తనకసలు ఇంటిలో ఏపనీ చేత కాదంటుంది"

"నిజమే రమా! కొంతమంది మగవాళ్ళకు ఇళ్ళలో ఏ చిన్నపనీ చేతకాదు. అలా జరిగిపోతుంటుంది. మీ బాబాయి ఇంటిలో ఏం పని చేస్తున్నారు చెప్పు. ఆయన చేసినా చెయ్యకపోయినా అవసరం రావడం లేదుకాబట్టి మనకేమీ అనిపించదు"

"అవుననుకో. పరిస్థితులనుబట్టి కాస్త సహాయపడడానికి ప్రయత్నం చేయాలి కదా!"

"చేస్తే బాగానే వుంటుంది. మనదేశంలో కూడా, మారిన పరిస్థితులు, అవసరాల కొద్దీ ఆడా మగా ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నా ఆడవాళ్ళకు ఇంటిపని, ఆఫీసులో పని, పిల్లలను దిద్దుకోవడం ఏదీతప్పడంలా. ఆడవాళ్ళకు పనిలో సహాయపడే మగ వాళ్ళు తక్కువగానే కనిపిస్తారు"

"ఏ కష్టమైనా ఊసుపోక కబుర్లకంటే ఏదో ఉద్యోగం చెయ్యడమే సుఖం అరుణా" రమ అన్నది.

అరుణకు నవ్వొచ్చింది. "ఉద్యోగం చేయాల్సిన ఖర్మనాకేమిటి" అన్న రమేనా ఈపిల్ల అనుకున్నది లోపల. జీవితం నేర్పిన పాఠం.

"ఆర్థికపరమైన వెసులుబాటుతో

పాటు ఉద్యోగినులు సుఖపడడానికి మన సామాజిక పరిస్థితులలోనూ, ఆడా మగా ఇరువురి దృక్పథంలోనూ కూడా మార్పురావాలి రమా. అది ఒక్కసారిగా జరగదు. క్రమక్రమంగా రావాలి"

ఇలా కబుర్లాడుతూనే రమ ఒక్కసారిగా గంభీరంగా మారిపోయింది. కాస్త ఆగి అన్నది.

"నా వుద్యోగ బాధ్యతేదో నేను చూసుకోవడం తప్ప నేనెవరి విషయంలోనూ జోక్యం చేసుకోనరుణా! సుజాత లాగా ఎవరైనా నాతో కాస్త ఫ్రెండ్లీగా వుంటే నేనూ ఫ్రెండ్లీగా వుంటా లేకపోతే లేదు. అయినా ఎందుకో నేనంటే అందరికీ ఆసక్తే. ఏ సందర్భంగానైనా నేను జెంట్స్‌తో మాట్లాడితే చాలు అందరి కళ్ళూ నావైపే. కాస్త మంచి చీర కట్టుకున్నాననుకో 'మీకేమండీ అదృష్ట వంతులు. ఏ బాధ్యతా, బాదరబందీలేదు. కోరుకున్నదాన్ని కోరుకున్న క్షణంలో కొనేసుకోగలరు' ఇలాంటి వ్యంగ్యోక్తులు అనకుండా వుండరు" బేలగా అన్నది రమ.

"నీకు నచ్చిన విధంగా నీవుంటావ్. ఆ మూర్ఖులందరి మాటలూ నిన్నెవరు లక్ష్యపెట్టమన్నారు?" రమకు ఓదార్పుగా అన్నది అరుణ.

"నేనెవరి మాటల్నీ పెద్దగా లక్ష్యం చేస్తున్నది లేదు. అలా కాకుంటే నేనసలు వుద్యోగమే చేయగలిగేదాన్ని కాదు. అయినా అప్పుడప్పుడనిపిస్తుంటుంది. కనీసం చదువుకున్న తోటి ఆడవాళ్లయినా కాస్త విశాలంగా ఆలోచించరేమిటి అని. నన్నో బరితెగించిన ఆడదానిలానే చూస్తారు తప్ప వైవాహిక జీవితంలో నా చేదు అనుభవాలేమిటో ఎవరికీ పట్టదు. అదే నేను అత్తవారింట్లోనే వుండి బాధలు పడలేక ఏ ఉరో పోసుకు చచ్చుంటే అందరూ నన్ను మహా ఇల్లాలినని సానుభూతి చూపివుండేవాళ్ళు కాబోలు" ఎంతో దైన్యంగా వున్నాయి రమ మాటలు.

"ఇతరులను కించపరచి తమ గొప్పతనాన్ని చాటుకొంటారు కొందరు. అలాంటివాళ్ళతో ఏమిటి? వాళ్లేమైనా ఆర్చేవాళ్ళా, తీర్చేవాళ్ళా? కానీ రమా... నీ భవిష్యత్తు గురించి మాత్రం నీవు జాగ్రత్తగా ఆలోచించిఅడుగులువేయాలి. నీవు వుద్యోగంలో చేరి రెండు సంవత్సరాలు దాటిందనుకుంటానుగదూ?"

"అవును. రెండున్నర సంవత్సరాలు"

"నీకుకాలక్షేపానికిఉద్యోగంవున్నది. ఆత్మీయులున్నారు. చాలానే డబ్బులు వున్నాయి. జీవితానికి ఇవి చాలంటావా రమా" రమ ముఖంలోకి చూస్తూ అంది అరుణ.

"అంటే నీవనేదేమిటో నాకర్థం గావడంలా"

"ఇందులో అర్థం కాకపోవడానికేముంది రమా! నీ నిండుజీవితంలో పావువంతు మాత్రమే గడిచింది. జీవితమంతా ముందే వున్నది. మరి నీ బతుకంతా ఇలానే పిన్నమ్మగారిల్లు, ఆఫీసుగానే గడిపెయ్యాలనుకుంటున్నావా అని"

రమ కళ్ళలో ప్రసాద్ రూపం ప్రత్యక్షమయింది. "ఎప్పటికీ మీఇంట్లోనే వుండిపోతానేమో అని భయపడుతున్నావా అరుణా" జోక్‌గా అన్నది.

"నీవు నన్నర్థం చేసుకున్నది ఇదన్నమాట. సరేకానీ" నిష్టూరంగా అన్నది అరుణ.

"లేదు అరుణా... వూరికే అలా అంటే

నీ ముఖం ఎలా అవుతుందో చూడాలని పించన్నానులే. కానీ మరి నా భవిష్యత్తు గురించి నీ సలహా ఏమిటి చెప్పు" బతిమి లాడుతున్నట్లంది.

"నేను సీరియస్‌గా అంటున్నాను రమా! నీవేమైనా అనుకో. మనం ఎన్ని కబుర్లు చెప్పినా, ఏం చేసినా కష్టంలో సుఖంలో భాగం పంచుకునే తోడు ఆడ దానికైనా మగవాడికైనా ఎంతైనా అవసరం. ఆవైపుగా నీవాలోచించటం అవసరం అనుకుంటున్నాను" తాను ఎన్ని రోజులుగానో ఇవ్వాలనుకుంటున్న సలహా ముక్తసరిగా ఇచ్చేసింది అరుణ.

ఇంతగా తన మంచి చెడులను గురించి ఆలోచించే అరుణతో ఇంక తన మనసు లోని మాటను చెప్పకుండా వుండలేక పోయింది రమ. ప్రసాద్ వ్యక్తిత్వం, స్వభావం గూర్చి, అతనిపట్ల తనకు గల ఇష్టతను గురించి క్లుప్తంగా చెప్పింది రమ.

"మీఇద్దరి మధ్యా మరి పెండ్లి ప్రసక్తి వచ్చిందా?" ఆసక్తిగా అడిగింది అరుణ.

"అబ్బెబ్బే... ఇప్పటి వరకు అలాంటి దేమీలేదు. మమ్మల్ని గురించి ఏమేమో అనుకోకు అరుణా! ఇప్పటివరకు మేమిద్దరం ఆఫీసు ఆవరణ దాటి బయట ఎన్నడూ కలుసుకున్నదిలేదు"

"మరి నిన్ను గురించిన వివరాలైనా తెలుసా అతనికి?"

"భర్తనొదిలేసిన మనిషిగా అందరూ నన్నెరుగుదురు. నన్ను గురించిఅతనికున్న అభిప్రాయమేమిటో నాకు సరిగా తెలియదు గానీ అరుణా... ఒక విషయం మాత్రం ఘంటాపథంగా చెప్పగలను. నేనంటే ఎందుకనన్నా కానీ చాలా అభిమా నంగా వుంటాడు. మామూలు సంభాష ణల్లో ఆ భావం వ్యక్తమవుతుంటుంది. అతను నాపక్కనుంటే అదేమిటోగాని నాకు చాలా ధైర్యంగా వుంటుందరుణా"

"అయితే రమా... అతనిని గురించిన వివరాలు, ఆ సందర్భంగా వీలునిబట్టి నీ పట్ల అతని వైఖరి తెలుసుకోమని మీ బాబాయిని పురమాయించమన్నావా?" కుతూహలం వ్యక్తపరిచింది అరుణ.

"ఒద్దొద్దు అరుణా... ఆపని మాత్రం చేయకు. అతనిది మన కులంగాదు. భార్య చనిపోయింది. ఓ మూడేళ్ళపాప అతని అక్క దగ్గర పెరుగుతోంది. తల్లి దండ్రులు లేరట. ఇంతవరకు వివరాలు నాకు తెలుసు. అమ్మావాళ్లు నాకింకో పెండ్లి చేయడానికి సుముఖులే అయినా బొత్తిగా ఆస్తిపాస్తులులేనిఇతర కులస్థుడిని చేసుకోవడానికి ఇష్టపడతారనుకోను. ఇదో రసాభాస. నీవరకు చెప్పినా ఫరవా లేదని చెప్పానంతే"

"మరయితే ఇలా దాగుడుమూత లెన్నాళ్లు?"

"ఎన్నాళ్ళో పట్టదు. నేనే అతని అభి ప్రాయం తెలుసుకోవడానికి ప్రయత్నం చేస్తా. పరిస్థితులనుకూలంగా వుంటే అప్పుడాలోచిద్దాం. నిన్నాలోచించకుండా మాత్రం నేనేపని చెయ్యను" అరుణ చేతిని తన చేతిలోకి తీసుకొంటూ అన్నది రమ.

"ఓకే రమా.....జీవితంలో ఓ దెబ్బ తిన్నా కుంగిపోక ధైర్యంగా ఇంత మంచి నిర్ణయం తీసుకున్ననీకు నాఅభినందనలు" చేతిని వత్తుతూ అన్నది.

* * *

బాబాగారి రాకకోసరం ఎదురు చూసీ చూసీ పరమభక్తులు కూడా చిరాకుపడి పోయారు. పదిగంటలకి అనుకొని వారంతా భోజనాలు చేయకుండా,

వచ్చారు.

ఎట్టకేలకు భక్తులలో కలకలం. బాబాగారు వేంచేస్తున్నారు. ఒంటిగంటయింది. భక్తులు అలసట మరచిపోయారు.

ఏ.సి.కారులో దిగారు బాబాగారు. ఆ కారుకు వెనుకగా ఇంకో వందకార్లు. సేవా సదనానికి ప్రారంభోత్సవంచేసి వేదిక మీదికొచ్చి భక్తులకు దర్శనభాగ్యం కలుగజేసారు బాబా. చేయి వూపాడుతప్ప నోరువిప్పలా.

అంతే.

లోపలికెళ్ళిపోయారు. మళ్ళా వస్తారు; ఏదో సందేశమిస్తారు అనుకున్నవాళ్ళకు నిరాశే మిగిలింది. బాబాగారెళ్ళిపోయారన్నారు.

"ఏందమ్మగోరూ .... కుసింత ఇబూదన్నా ఇయ్యలేదు" భాగ్యం నిరుత్సాహ పడింది.

"ఆయనంత సోములోరుగందా. ఈ పోలీసు బలగం దేనికంటమ్మగోరూ" అని దాని ధర్మసందేహం.

"నీ నెత్తికి" బాబాగారికోసరం అన్ని గంటలు పడిగాపులుపడితే ఆయనో ముక్కన్నా మాట్లాడలేదన్న అసంతృప్తితో లక్ష్మి చిరచిరలాడింది.

భాగ్యం సందేహం శేఖర్‌కి మాత్రం నవ్వును కలిగించింది.

"నిజమేనే భాగ్యం... అద్భుత మహిమలు కలవాడంటారు. కనీసం ప్రోగ్రాంకి వేళకయినా హాజరుకాలేక పోయాడు. అయినా జనానికేమిటో అతనంటే పిచ్చి"

"మీ తర్కం తరవాతగానీ కారు దగ్గరకు పదండి. పొట్టలో ఎలుకలు పరుగెడుతున్నాయి"

"హోటలుకెళ్ళి ఏమైనా తిందాం పద. అంత హడావిడేమొచ్చింది?"

"హోటలూ వద్దు...ఎత్తుబారం వద్దు. తినేదీ పెట్టేదీ ఎంతుంటానే పదిరూపాయలు బిల్లవుతుంది. ఎంతలోకెళతాం ఇంటికి. పదండి త్వరగా'' తొందరచేసింది లక్ష్మి.

కారు స్పీడులో పోతోంది. టౌను సరిహద్దుల్లోకొచ్చింది. తమకు ముందు వెడుతున్న కారు సడన్‌బ్రేక్ వేయడంతో వీళ్ళ కారెళ్ళి ముందుకారుని గుద్దుకుంది. కారద్దాలు పగిలిపోయాయి. ఎవరికీ పెద్దగా దెబ్బలు మాత్రం తగల్లా.

'అమ్మబాబోయ్...భాగ్యం వట్టిమనిషి కూడా కాదు. కాస్తలో ఎంత ప్రమాదం



తప్పింది' హడలిపోయింది లక్ష్మి.

తర్వాత అరుణతో అంది "ఇంకా నయం పిల్లల్ని కూడా తీసుకెళ్ళలేదు. ఇవాళ లేచి ఎవరి ముఖం చూసామో.. పెద్ద గండమే గడిచింది" అని.

• • •

"ఈ చిలకలపూడి పాండురంగడు చాటుమాటు పెళ్ళిళ్లు చేయించడంలో సిద్ధహస్తుడంటారు. మన పెళ్లికూడా ఇక్కడే కానిచ్చేస్తే?" ప్రశ్నార్థకంగా ప్రసాద్ ముఖంలోకిచూస్తూ అన్నది రమ.

జీవితంలో ఎన్నో దెబ్బలుతిని రాటు తేలి ఉద్యోగంలో ఎంతో అనుభవాన్ని సంపాయించిన రమ ముఖంలో ధైర్యం, ఆత్మస్థయిర్యం చోటు చేసుకున్నాయి. ఆ సాయంకాలపు నీరెండలో ముద్దబంతి పూవులా నిండుగా అందంగా అనిపించింది రమ ప్రసాద్ చూపులకు.

"నీకు ప్రత్యేకంగా గుడిలోనే పెండ్లి చేసుకోవాలి అనేకోర్కె వుంటేఆలోచిద్దాం. నేను మాత్రం రిజిస్ట్రార్ ఆఫీసులో ఫ్రెండ్స్ సమక్షంలో చేసుకోవడం ఉచిత మనుకుంటున్నా" రమ కళ్ళలోనుండి చూపులు తిప్పుకోకుండా అన్నాడు ప్రసాద్.

''నాకు గుడిమీద మోజేంలేదు. మీరెట్లా అంటే అట్లానే. పిన్ని నేనేమైపోయానో అని గాభరాపడిపోతుంటుంది. త్వరగా పదండి" హడావిడి పడింది రమ.

• • •

ఊరగాయపచ్చడి పెట్టడానికి గోంగూర కాడలు గిల్లుతూ కూర్చున్నారు. అరుణా, భాగ్యం.

"చద్దాణ్ణంలోకి మావోడికి గోంగూరెం తిట్టవో నమ్మగోరూ" దాని గొంతులో మొగుడుపట్ల ఎంత ఆపేక్షో.

"మరి నువ్వుకూడా కాస్త పెట్టుకో రాదంటే''

"మాకెట్టా కుదురుద్దమ్మగోరూ .జాడీలయి మాకెట్టొత్తయ్. మీరెడితే తింటం. లేనప్పుడు ఎప్పుడుదప్పుడే తాక్కోడం"

"ఇద్దరు పిల్లలయ్యారు గదా! ఇంక నువ్వో, మీ మావో పిల్లల్లేకుండా ఆపరేషన్ చేయించుకోండి" సలహా ఇచ్చింది అరుణ.

"ఆపరేసన్లు మాకెందుకమ్మగోరూ? మాకేవన్నా ఏలయకరాలా పంచుకోడానికి? రెక్కల కట్టం. మాకెంతమందైతేటి? లాగూ కట్టుకోడం వచ్చిందంటే అల్లబతుకులాల్లే"

'తన కళ్ళముందు పెద్దదైందిది. ఎన్ని కబుర్లు నేర్చింది' మనసులోనే అబ్బురపడిందరుణ.

"పిచ్చిమొద్దా .... తెలివి తక్కువగా మాట్లాడకు. ఎక్కువమంది పిల్లలయితే నీ ఆరోగ్యం పాడవుతుంది. వీళ్ళిద్దరే అయితే చక్కగా చదివించుకోవచ్చు"

"పిల్లలుడితే ఆరోగ్గం పాడవటవేందమ్మగోరూ... ఇచ్చిత్రంగా మాటాడతారు. చదువులంటే మాటలే నేటండమ్మగోరూ. మాకెందుకు సదువులు - ఉద్దోగాల్జెయ్యాల్నా ఊళ్ళేలాల్నా. మీలాటోరి అండదొరికితే అదేశాన. అల్లయ్యకెల్లేనే బతుకులీడిశాత్తరు. ఇంక లెగండమ్మా అయిపోనాదిగా ... సంఁదెపాసూడవాల్న" లేచి బట్టలు దులుపుకొంటూ అన్నది భాగ్యం.

ఎక్కడి నుండో అక్కాతమ్ముడు ఇద్దరూ పోటాపోటీగా పరుగెత్తుకొచ్చారు. "అమ్మను ముందు నేనే అంటుకున్నానోచ్" అంటూ వచ్చి అరుణ మీద పడ్డాడు రాహుల్.

ఆ ఊపునకు వెనక్కి పడిందరుణ.

"అన్నీ ఐంఢచేష్టలేగదరా వెధవ" లేచి కూర్చుంటూ అన్నది అరుణ.

గోంగూర కాడల్ని తీసుకొని వాటిని కంటికి కిందికిపైకి అమర్చి "నా కళ్ళజోడిదిగో" అంటూ రాహుల్ని కవ్విస్తోంది గీత.

వాడూ అదే ప్రయత్నం.

"వుండండిరా కళ్ళలో గుచ్చుకునేను. భాగ్యం..ముందుగా ఈ కాడలె తేసెయ్యి"

"అరుణమ్మా....అమ్మేది!" గీతకేం జ్ఞాపకమొచ్చిందో ఏమో హడావిడి పడిపోతూ అడిగింది.

"పాలు తీస్తున్నట్లుంది"

ఇద్దరూ అటువైపుకి దౌడుతీయబోయారు.

రాహుల్ పరుగెత్తాడు.

గీత చేతిని గట్టిగా పట్టుకుందరుణ.

"ఏమిటే గీతా! ఏమిటమ్మతో నీకంత అర్జంటు?"

"అర్జంటుపనేవుంది. నాచేమొదు లమ్మా" చేతిని గుంజుకుంది గీత.

"పనేమిటో చెప్తేనే వదుల్తా"

"నీకు చెప్పేదిగాదమ్మా" ఆరిందాలా అన్నది.

"నాకు చెప్పకూడని రహస్యాలున్నయంటే నీకు" నవ్వుకొంటూ కూతురిని గుండెల మీదికి లాక్కుంటూ అందరుణ.

అమ్మ యెదతాకిన గీత కాస్త మెత్తబడింది. కళ్ళు చక్రాల్లా తిప్పుకొంటూ అంది. "మరమ్మా! వాళ్ళ రాధి మల్లెపూల జడేయించుకున్నానని పెద్ద గొప్పలు బోతోంది. నేను రేపు అమ్మతో దాని కంటే పెద్దజడ తళుకులతో వేయించుకొని కుప్పెలు పెట్టుకోవాలి. అప్పుడుగాని దాని బడాయొదల్దు"

"ఇదా షీ అమ్మాకూతుళ్ళ రహస్యం. పీటిలో కాదే గీతా పోటీ పడాల్సింది — చదువులో వుండాలే పోటీ"

"పో అమ్మా. ఇట్లా అంటావనే నేనేదీ నీతో అసలు చెప్పంది" బుంగమూతి పెట్టింది. "ఈ రోజు పొద్దున రేడియోలో వచ్చిన పాట నే పాడతా. దాన్ని పిలిచి పాడమను చూద్దాం"

"ఏదీ నువ్వు పాడు. వింటాను"

అమ్మ ఒడిలో. అమ్మ చీరెమీద పువ్వులు చూస్తూ పాడటం మొదలెట్టింది.

'అమ్మా నాకు చెప్పవే
కమ్మని కథ ఒకటి
కథవింటూ నిద్రలో
మంచి కలగంటానే
రాజు కథవద్దు
రాణీ కథవద్దు
ఈగకథ పేనుకథ వద్దులే...'

పాడుతూ పాడుతూనే బుర్రలో ఏం తొలిచిందో ఈ అమ్మ ఒడిలో నుండిలేచి ఆ అమ్మదగ్గరకు దౌడుతీసింది.

గోంగూరబుట్ట లోపలబెట్టి కాడలె తేసి ఊడుస్తూ అన్నది భాగ్యం "గీతమ్మ గోరే దైనా ఇట్టే పట్టేసుకుంటారంచమ్మా"

"నీ పిల్లలూ పట్టేసుకుంటారు. వాళ్ళను శుభ్రంగా బడికి పంపించు. నువ్వు ఆపరేషన్ చేయించేసుకో పిచ్చి పిచ్చి ఆలోచనలు మానేసి"

"మీతో మాకేటి పోటీ అమ్మా" పాచి పోగు బైటికి పట్టుకెళుతూ అంది.

అరుణ ఆలోచనలు కూతురు నుండి భాగ్యం చుట్టూ తిరగడం ప్రారంభించాయి.

ఏమిటో వీళ్ళ బతుకులు? ఏనాటికి బాగుపడుసు? మొగుడూ పెళ్ళాం ఇద్దరూ కష్టపడుకుంటారు. పచ్చడి పెట్టుకోడా

నికి ఓ జాడీ కొనుక్కోలేరు. కోళ్ళఫారం మీద తమకు బాగానే లాభాలువస్తున్నాయి. దానికి తాము పెట్టుబడి మాత్రంపెట్టారు, అదీ బాంకు లోనే.అజమాయిషీ చేస్తున్నం దుకు తమకు వేలకు వేలు లాభాలు. దానినే కనిపెట్టుకొని శ్రమ చేసేవాళ్ళకు పిల్లలను బడికి కూడా పంపించుకోలేని దౌర్భాగ్యం. ఏమిటో?

ప్రభుత్వం రిజర్వేషన్లనీ, అవనీ ఇవనీ వాళ్ళ ఓట్లు సంపాయించుకోడాని కేస్తున్న ఎత్తుగడలు తప్ప నిజంగా ప్రభుత్వానికి వీళ్ళ బతుకులు బాగుపడా లన్న కోర్కె వుంటే గదా! బస్తీల మాటేమోగాని పల్లెల్లో హరిజనుల బిడ్డలు ఎంత శాతం చదువుకొంటున్నారు? 'ఎక్కడేసిన గొంగళి అక్కడే' అన్న సామెత చందం. ఆర్థికంగా వాళ్ళ బతుకులు మెరుగుపడకుండా ఎన్ని ఎంగిలిమెతుకులువిసిరినాఏంప్రయోజనం వుంటుంది? వాళ్ళలా అజ్ఞానంలో బికారులు గానే వుండిపోతారు. తెగ బలిసేవాళ్ళు బలుస్తూనే వుంటారు. ఏమిటో ఈ సమాజం...?

భారంగా లేచి భోజనాల గదిలోకి దారితీసింది కాఫీ కోసం.

* * *

శీతగాలులు పోయి వేసవి అరుదెంచింది. మార్చి నెలలోనే ఎండలు తమ ప్రతాపాన్ని చూపుతున్నాయి. చెట్లు చిగిర్చి ప్రకృతి శోభాయమానంగా వుంది. మామిడి చెట్లపై నుండి కోయిలల కూజితాలు శ్రవణానందకరంగా విని పిస్తున్నాయి. సాయంత్రానికి ఎండ తీవ్రత తగ్గిపోయి చల్లని గాలులు





ప్రాణానికి హాయిని కలుగజేస్తున్నాయి. సంపెంగ చెట్టు పూవుల పరిమళం ఆవరణంతా అలుముకున్నది. ఇంత చల్లని వాతావరణంలో సైతం అరుణ ప్రశాం తతను పొందలేకపోతోంది. మనస్సంతా చికాకు. ఈ అశాంతిని పోగొట్టుకోడానికే భాగ్యం చేతిలోని ట్యూబుని తాను తీసు కున్నది–మొక్కలకు తను నీళ్ళు పెడతా నంటూ. ఎన్ని పనులు కలిపించుకున్నా ఆ పనులలో లీనం కాలేకపోతోంది. భయంకరమైన వంటరితనం తనను వదలనంటోంది. పిల్లలిద్దరూ పెద్దవాళ్ళవు తున్నారు. అయినా తనకి అసంతృప్తి ఏంటో? మూడు నాలుగు సంవత్సరాల కాలంలో జీవితానికి సరిపడా చేదునను భవించిన రమ హాయిగా భర్త ప్రసాద్‌తో ప్రశాంతంగా సుఖప్రదమైన జీవితాన్ని గడుపుతోంది. ఇప్పటి రమ ముఖం చూసినవారెవరికైనా ఏడాదిక్రితం ప్లీడరు గారింట్లోవున్న రమ ఈవిడేనా అనిపించే టంత మార్పు. కొడుకు తన మాటకు గుడ్డిగవ్వ విలువనివ్వకుండా పెండ్లి చేసుకున్నాడని తెగ బాధపడిపోయిన నాన్న "మీరింకా ఆ వూళ్ళో వంటరిగా వుండటం దేనికి ? ఇద్దరూ వచ్చేసి మాదగ్గరే వుండండని" కొడుకూ,కోడలూ అంటున్నారని తెగ మురిసిపోతున్నాడు. అందరి సమస్యలకు ఏవో పరిష్కారాలు దొరుకుతున్నాయి. తన బతుకే తనకో జటిల సమస్యగా మిగిలిపోయింది. జీవితానికి ఓ లక్ష్యం లేకుండా కాలం గడపడమే ఓ పెద్ద సమస్యగా బతుకు సాగించేదెలా? అరుణ మనస్సులో చిరుదివ్వెలాంటి కోర్కె. తను ఓ స్కూలు పెట్టుకొని లాభాపేక్షతో గాకుండా ఆదర్శవంతంగా నడిపితే ఎంత బాగుం డును. టవునులో కాకుండా ఏ పల్లెటూ

ర్గానో తయితే ఓ మంచిపని చేస్తున్నా నన్న తృప్తి, ప్రాణానికి హాయి. కానీ ఎన్ని సమస్యలు? చాలా డబ్బు కావాలి. ఇంట్లో వాళ్ళు సహకరించి ఒప్పుకోవాలి. ఒప్పుకునేదేమిటి? ఒప్పించాల్సిందే. జీవితాంతం రాజీపడుతూ జీవచ్ఛవంలా బతకడం తనవల్ల కాదు. కానీ పెను భూతం లాంటి ఇంకో సమస్య పిల్లలు. తల్లి ప్రేమాదరణలు, అండదండలు అవసరమయిన వయస్సులో వున్నవాళ్ళు. వాళ్ళ బాధ్యతనుండీ దూరంకావడం తలుచుకో డానికే భయంకరం...

ఏమైనా ఎంతటి క్లిష్టపరిస్థితులనైనా ఎదుర్కోవాలంటే మానసికంగా సిద్ధం గావడమే ప్రధానం. దృఢచిత్తం కావాలి. అంటే ఎంతమంది తమ పిల్లల్ని రెసిడెన్షియల్ స్కూల్స్‌కి పంపడంలేదు. బిడ్డల్ని ఈ దేశంలో వదిలి విదేశాలకెళ్ళిన తల్లిదండ్రులెంతమందిలేరు? అసలు తనతో ఏమాత్రం నిమిత్తం లేకుండా కావలసిన ప్రేమాదరాలను, సాధన సంపత్తిని సమకూర్చగలిగినవాళ్ళు తన బిడ్డలకున్నారు. ఏమైనా వెనుకంజ వేయకుండా తన ఆలోచనలకు కార్యరూపమీయవలసిందే. ఈ పథకానికి తన తండ్రి ఆమోదముద్ర కూడా పొందగలిగితే ఆయన ఉద్యోగాను భవం తనకెంతగానో ఉపయోగపడుతుంది. ఎడతెగని ఆలోచనలు. తామర తంపరలా పుట్టుకొస్తున్నాయి. మొక్కల కుదళ్ళన్నీ నీళ్ళతో నిండి పొర్లిపోతున్నాయి.

రాహుల్ కేకలకు తల పక్కకు తిప్పి చూసింది. ఎప్పుడొచ్చాడో ట్యూబు తలమీద పెట్టుకుని ఒళ్ళంతా తడుపుకొంటూ కేరింతలు కొడుతున్నాడు. "అరే నాన్నా... అదేం పనిరా. ఒళ్ళంతా తడుపుకొంటున్నావ్. అమ్మ చూస్తే తంతుందిలే. పద" ట్యూబు అక్కడే పడేసి కొడుకుని తీసుకొని పంపు కట్టేసి ఇంట్లోకి నడిచింది అరుణ.

* * *

"నువ్వు... నువ్వు... దిక్కులేని పక్షిలా మిస్సమ్మల్లే ఎక్కడో స్కూలు పెట్టి నడుపుతావా? అందుకు నేనొప్పుకుని నీకు డబ్బివ్వాలా? స్పృహవుండేమాట్లాడుతున్నావా? రత్నాల్లాంటి బిడ్డల్ని పెట్టుకొని వాళ్ళకుచెప్పుకోరాచూసీచదువు. అంగట్లో అన్నీ వున్నాయట అల్లుడి నోట్లో శనుండట. అసలింతకూ నేనేమైనా అడ్డంగావుంటే చెప్పు — ఏదైనా ఆశ్రమం చూసుకుంటాను" లక్ష్మి గొంతు గాద్గదికమైంది.

"అయ్యబాబోయ్...నిన్నడగడంనాదే తప్పు. ముందరికాళ్ళకు బంధాలేస్తావ్. డబ్బులివ్వడం ఇష్టంలేకపోతే సూటిగా చెప్పేయరాదూ ఈ డొంక తిరుగుళ్ళు లేకుండా. నువ్వు ఆశ్రమం చూసుకుంటావా—నేను పిల్లలిద్దర్నీ నీకు అప్పగించేద్దామనుకొంటున్నానంటే? నువ్వు నన్ను అర్థం చేసుకున్నదిదన్నమాట. పోనీ నా బతుకంతా ఇలా సర్దుబాట్లతోటే ముగిసిపోయేట్లున్నది" బాధగా అన్నది అరుణ.

"ఏమ్మా...ఇప్పుడు నీ బతుక్కొచ్చిన లోటేమిటంటా?" నిలదీసింది లక్ష్మి.

"నాకొచ్చిన లోటేమిటో నీకర్థం కాదక్కా. నామాటపై గౌరవం, నామీద ప్రేమావుంటే నామాట మన్నించు" స్థిరంగా అన్నది.

"అరుణా...నిజంగానువ్వు..నువ్వు..."

"నేను ఏంటక్కా?"

"ఏమీ అనుకోనంటే ఒక్కమాట.

నువ్వు ఆడదానివేనా అని. ముద్దులు మూటగట్టే బిడ్డలు, భర్త, ఇంద్రభవనం లాంటి ఇల్లు-వీటన్నింటినీ కాదనుకొని ఏం సాధించడానికి? నిజంగా బిడ్డల్ని వదలి నెలల తరబడి వుండగలవా? సాధ్యమేనా?"

"ఎందుకా్కదక్కా...వాళ్ళచదువులు, మంచీ చెడూ చూడటానికి తండ్రున్నాడు. వాళ్ళని ప్రాణంలో ప్రాణంగా చూసుకునే తల్లున్నది. ఇంక వాళ్ళకు నేనున్నా లేకపోయినా వచ్చిన లోటేమిటి?"

'తల్లి'

లక్ష్మి కళ్ళవెంబడి నీళ్లు బొటబొటా కారాయి. "పిచ్చి పిచ్చి ఆలోచనలతో బంగారంలాంటి జీవితాన్ని కాదనుకొంటూ నిన్ను నువ్వు ఆహుతి చేసుకుంటున్నావు గాని అరుణా... నువ్వు రత్నాల్లాంటి బిడ్డల్నికని వాళ్ళను నాకప్పగించావ్'' కళ్ళొత్తుకొంటూ అన్నది లక్ష్మి.

ఇద్దరూ కాసేపు మౌనం దాల్చారు.

"నేనుచేసిన త్యాగమేముందక్కా. నా స్వార్థం నాకుంది.''

"నువ్వు ఆవేశపడకుండా నింపాదిగా ఆలోచించుకొని చూడు అరుణా. పిల్లల్ని చూసుకునేవాళ్లున్నంత మాత్రాన నువ్వు వాళ్ళనొదిలి వుండగలవా అని''

"నేనేం దేశం వదిలి పోవడంలేదు. ఎప్పుడుకావాలనుకుంటే అప్పుడు వాళ్ళను చూడగలను. దేశంలో మనం ఎంతమందిని చూడటంలేదక్కా. మీ తమ్ముడిగారి పిల్లలు రెసిడెన్షియల్ స్కూల్లోనేగదా చదువుతున్నారు. వాళ్లు సంవత్సరంలో ఎన్ని పర్యాయాలు వాళ్లమ్మా నాన్నల దగ్గర కొస్తున్నారు? అంతెందుకు ఎంత మంది డబ్బు సంపాదనకు పిల్లల్ని ఈదేశంలోవదిలి పరాయిదేశాల కెళ్ళడం లేదు?"తన ఆలోచనను సమర్థించుకొంటూ అన్నది అరుణ.

"వాళ్లుచేసే పనికి ఓ అర్థం, ప్రయోజనం, అవసరం వున్నాయి. పిల్లలకు ఉజ్వలమయిన భవిష్యత్తునాశించి వాళ్లిలా చేస్తున్నారుగాని నీకులాగా ఊరివాళ్ళనుద్ధరించడానికి కాదు''

"ఇందులో లోకాన్నుద్ధరించడమనే సమస్యే లేదక్కా... నా జీవితానికి ఓ అర్థం, ప్రయోజనం చేకూర్చుకోవాలనే తపనతప్ప. మనుష్యులందరాలోచనలు ఒకేరకంగా వుండవ్. అలానే ఆనందాన్ని పొందే పద్ధతులూ ఒకేరకంగా వుండవ్''

"సరేనమ్మా... నీ పద్ధతేదో నీదన్న విషయం ఒప్పుకొంటాను. కొన్ని కొన్ని విషయాల్లో నీవెంత మంచిగా ప్రవర్తించ గలవో మరికొన్ని విషయాల్లో అంత మొండిగానూ వుండగలవ్. కానీ నీవసలు ఈ విషయాన్ని గురించి ఆయనతో మాట్లాడావా?"

భర్త ఎలాగూ ఒప్పుకోడు; ఆయన అంగీకారం లేకుండా ఈ అరుణేం చేస్తుందిలే అన్న ఆశ మినుకు మినుకుమంటూ ఉండగా అడిగింది లక్ష్మి.

"ముందు నువ్వొప్పుకోవడం కావాలి నాకు. ఆ తరువాత ఆయనను సంప్రదిస్తా. నేనేం కాని పనులు, తప్పుడు పనులు చేయబోవడంలేదు - ఎవరయినా నన్నాటంకపరచి అడ్డుపడడానికి" బింకంగాఅన్నది.

"యాభయివేలు నేనెక్కడనుంచి తెచ్చేది? నువ్వు చేస్తున్న పనిని ఆయన హర్షిస్తే నువ్వడగాలేగాని డబ్బివ్వడానికి ఆయనేమాత్రం సంకోచించడు."

"ఆయన డబ్బు నాకొద్దు''

"ఇది మరీ బావుంది. ఎప్పుడయినా ఆయన డబ్బూ, నా డబ్బూఅంటూ వేరుగా




వుండటం నీకు తెలుసా అరుణా?''

''పోనీ అక్కా... నీ వడ్డాణం,కాసుల పేరు, అరవంకెలు అమ్మవారినలంకరించి నట్లు అవన్నీ ఎందుకక్కా? నువ్వు వాటిని పెట్టుకోంగా నేనెన్నడూ చూడలా. వాటిని నాకిచ్చెయ్యగూడదూ?'' అడగలేక అడగ లేక అడిగింది అరుణ.

"ఎందుకు... అమ్మేస్తావా తల్లీ? వాటి మీద పడ్డాయా నీకళ్ళు? ఆ నగలు నాకు ప్రాణంతో సమానం. వాటినెవ్వరూ ముట్టు కోడానిక్కూడా వీల్లేదు. అవి గీతకు సగం, రాహుల్ పెళ్ళానికి సగం'' భవి ష్యత్తులోకి చూస్తూ అన్నది లక్ష్మి.

"అయ్యబాబోయ్. వాళ్ళు పెద్దయ్యాక వాళ్ళకు కూడా ఈ నగల వ్యామోహం వుండటమంటేఇంక ఈదేశంబాగుపడ్డట్టే"

''మనుషులందరాలోచనలూ, అభి రుచులూ ఒకేరకంగా వుండవని ఇంతకు ముందేగదరుణా నీవన్నావ్. దేశమూ, సమాజమూ అవేవీ నాకు పట్టవు. నా కుటుంబం, నా పిల్లలూ వాళ్ళతోటిదే నా లోకం. అందులోనే నాకానందం. వాళ్లా నగలు పెట్టుకుంటారో, దాచుకుంటారో నాకనవసరం. ఇవి మా అమ్మ నగలని వాళ్ళనుకుంటే నాకందులోనే అంతులేని ఆనందం''

"పోనీ అక్కా... మనసుండాలేగాని మార్గముండకపోతుందా? నీ పొలంలో వచ్చేపంట నీదేగదా! ప్రారంభంలో ఓ ఇరవై అయిదువేలివ్వు.తరువాత దఫాలుగా నీ వీలునిబట్టి పంటొచ్చినపుడు పదేసివేల చొప్పున ఓ యాభైవేలిచ్చావంటే స్కూలుకి నీ పేరు పెడతాను'' మనిషి బలహీనతను ఉపయోగించుకోవాలనే యత్నం.

''నన్ను ఉబ్బెయ్యకు. నాకు పేరూ వద్దు, వూరూ వద్దు. నా జీవితానికిప్పటికి నీవు చేసింది చాలు. దబ్బేల్లాగో అవస్థ పడదామనుకున్నా ఆయన ఆమోదించి నప్పటిమాటగదా!" తుది ఆశ.

"ఏమైనా మా అక్క మంచిది. కానీ అక్కా-నిన్ను నేను శంకిస్తున్నాననికాదు. నిన్ను మించి మన పిల్లల శ్రేయస్సుకు తపించేవాళ్ళెవ్వరూ వుండరు. కానీ ఇప్పటి లాగానే ముందుకూడా పిల్లలకు దైవమూ, గొడవా... ఆ నీడ పడనీయొద్దక్కా"

"అరుణా!నీవావిషయంలో ఏమాత్రం భయపడక్కర్లా.. నామీద ఆమాత్రం విశ్వాసం ఉంచు. నా నమ్మకాలేవో నావి. బిడ్డలకు మేలుచెయ్యాలని నాలో నేనే దైవాన్ని కోరుకుంటాను తప్ప నీ బిడ్డలు నీ ఇష్టాల కనుగుణంగా పెరుగుతారు"

"అమ్మయ్య"తేలికగా ఊపిరిపీల్చింది అరుణ.

* * *

అరుణ ధోరణిని ముందు లక్ష్మి ద్వారా వినివున్న శేఖర్ అరుణ తన కోర్కెను వ్యక్తపరచినపుడు పెద్దగా ఆశ్చర్య పడలా.

బలవంతాన అరుణను తన ఆలోచనల నుండి వెనక్కి మళ్లించి తనూ, అరుణా ఎవరూ పెద్దగా సుఖపడగలిగేది లేదన్న విషయం శేఖర్‌కి తెలుసు. అరుణ తలపెట్టిన పనిలో అరుణకు చేయూత నీయడం ద్వారానే తనెప్పటికైనా అరుణకు చేరువకాగలుగుతాడు. కళ్ళద్దాల వెనుక శేఖర్ కళ్లు ఆర్ద్రమయ్యాయి.

'తను స్వార్థంతో జీవితంలో దిద్దుకో లేని తప్పే చేశాడు. అరుణ ఎన్నుకున్న మార్గం వున్నతమైంది. తను చేయూత నీయడమే సరైనది' అనుకున్నాడాయన.

ఫలితంగా ఆశయసాధనకు అడుగు ముందుకు వేసింది అరుణ. ★



## సమయస్ఫూర్తి

సదాశివం సూట్‌కేసును చేతిలోపట్టుకుని బస్సు దిగాడు. వాచీ చూశాడు - తొమ్మిది న్నర. ఆటోల జోలికి పోకుండా బస్ స్టాండ్‌లోంచి బయటికి వచ్చాడు.

అతనికి కాస్తదూరంలో కారును ఆపుకుని నిలబడి తీరిగ్గా సిగరెట్ కాలుస్తున్న ఒకతను కనిపించాడు.

సదాశివం అతని దగ్గరకి వెళ్ళాడు.

"ఏమండీ"

"ఏమిటి?చెప్పండి" అన్నాడు అతను.

"నేను ఈ ఊరికి కొత్తగా వచ్చాను. మా అబ్బాయి ఇక్కడ కొత్తగా ఒక ఇండస్ట్రీపెట్టాడండి. మావాడు అర్జంటుగా కావాలంటే లక్షరూపాయలు సూట్‌కేస్‌లో పెట్టుకుని వచ్చాను. ఆటోలో ఎక్కుదామంటే ఎవరేం చేస్తారోనని భయంగా వుంది. మీరు కాస్త దగ్గిర దారి చెపితే నడిచి వెళ్ళిపోతాను" అని కొడుకు వుండే చోటు చెప్పాడు.

"ఏమిటండీ.... మీరు బొత్తిగా అమాయకుల్లా వున్నారే! లక్షరూపాయలున్న సూట్‌కేస్ పట్టుకొని ఇంత రాత్రివేళ నడిచి వెళతారా, భలేవారే! ఎవరన్నా తలపగలగొట్టి డబ్బు ఎత్తుకుపోతే? నేను నా ఫ్రెండ్‌కోసం ఎదురుచూస్తున్నాను. బహుశా రానట్లుంది. నేనుకూడా అటువైపే వుంటున్నాను. మీకు అభ్యంతరం లేకపోతే నా కార్లో రండి. మీ ఇంటి దగ్గర దింపేస్తాను" అన్నాడు సిగరెట్‌వాలా.

"అయ్యో... మీకు అనవసరశ్రమ ఎందుకండీ" కాస్త మొహమాటంగా అన్నాడు సదాశివం.

"ఈమాత్రానికే శ్రమ ఏమిటండీ. మీరు ఈ ఊరికి కొత్త. ఆమాత్రం సహాయం చేయడం కనీస కర్తవ్యం" అన్నాడు సిగరెట్‌వాలా కారు తలుపు తీస్తూ.

సదాశివం లోపల కూర్చుని "రెండు రోజుల నుంచి సరిగా నిద్రలేదు. డబ్బు వెతుక్కునే పనితోనే సరిపోయింది. ఇంటి దగ్గరకి రాగానే కాస్త నిద్రలేపండి" అనేసి కళ్లుమూసుకుని నిద్రకుపక్రమించాడు.

కారు హఠాత్తుగా ఆగడంతో ముందుకి తూలాడు సదాశివం. కళ్లు తెరచి "ఏమండీ! ఇల్లు వచ్చేసిందా?" అని అడిగాడు.




"ఆ...వచ్చింది దిగండి" అన్నాడు సిగరెట్‌వాలా చిరునవ్వుతో.

"చాలా థాంక్సండీ . . . మీలాగా సహాయం చేసేవాళ్లు చాలా తక్కువ" కృతజ్ఞతలు చెప్పాడు సదాశివం.

సిగరెట్‌వాలా ముందుకు వచ్చి "మర్యాదగా సూట్ కేస్ కారులోనే ఉంచి దిగు" అన్నాడు బెదిరిస్తున్నట్లు.

"ఎందుకు?" అమాయకంగా అడిగాడు సదాశివం.

"ఎందుకా... ఆ లక్ష రూపాయలూ నాకు కావాలి" అన్నాడు సిగరెట్‌వాలా.

"లక్ష రూపాయలా...హా...హా...హా" పెద్దగా నవ్వాడు సదాశివం.

"ఎందుకు అలా నవ్వుతావు ?" కోపంగా అడిగాడతను.

సదాశివం నవ్వుతూనే సూట్‌కేస్ తీసి తెరిచి చూపించాడు.

అందులో ఒక టవల్ చిన్న అద్దం, దువ్వెన, ఒక జత బట్టలు వున్నాయి.

"లక్ష రూపాయలు ఎక్కడ?" ఆశ్చర్యంగా అడిగాడు సిగరెట్‌వాలా.

"అవి ఉంటేగా ఇందులో పెట్టడానికి"

"మరి బస్‌స్టాండ్‌లో అలా ఎందుకు చెప్పావు?"

"అదా...సరదాకి చెప్పాను. నేను చాలా ఏళ్ళనుంచి ఇక్కడే వుంటున్నాను. అదిగో ఆ పచ్చ మేడ వుంది చూశావా, అదే మా ఇల్లు. ఆటోలో వస్తే కనీసం పదిహేను, ఇరవై రూపాయలు అడుగుతాడు. అనవసరంగా వృధా చేయడం ఎందుకని అలా చెప్పాను. నీలాంటివాళ్ళు ఇలాంటి అవకాశం కోసమే కాచుకు కూర్చుంటారని నాకు బాగా తెలుసు. ఈసారయినా ఇలా మోసపోకు'' అని ఓ సలహా పారేసి ఇంటి వైపు నడిచాడు సదాశివం ముసి ముసిగా నవ్వుకుంటూ.

"పెట్రోలు దండగ" విసుగ్గా తిట్టుకొంటూ, కోపంగా కారు తలుపువేసి కారు స్టార్ట్ చేశాడు సిగరెట్‌వాలా.

—తుషార



# వాగ్దానం

జనార్ధనరావుకి ఎలక్షన్లంటే భయం పట్టుకొంది. ఈసారి తన నియోజక వర్గంలో ఏ పార్టీగాలి బాగా వీస్తుందో అంతుబట్టడం లేదు. అధికార, ప్రతిపక్షాల బలాలు సరిసమానంగా ఉన్నట్లు అతడికి తోచింది. కిందటిసారి అధికార పక్షం వేపే మొగ్గు బాగా ఉండడం వల్ల ఆ పార్టీ టిక్కెట్టు మీద పోటీచేసి గెలిచాడు. ప్రస్తుతం పరిస్థితులు తారుమారయేయి. రెండు పార్టీల టిక్కెట్ల మీద పోటీచేస్తే తనకింక తిరుగులేదన్న అమోఘమయిన ఆలోచనవచ్చింది. కానీ రూల్సు ఒప్పుకోవు కనుక చివరికి అధికార పక్షం టిక్కెట్టు మీదే పోటీ చెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

అతడు ఆ నిర్ణయానికి రాగానే తిరుపతివెళ్ళి దేవుడికి భక్తిశ్రద్ధలతో నమస్కరించి తలనీలాలు సమర్పించుకున్నాడు. "స్వామీ! నేనిప్పుడు తిరుక్షవరం చేయించుకున్నాను. ఎన్నికలలో గెలిచాక ప్రజలకి చేసే పూచీ నాదే" అని మనసులోనే మొక్కుకున్నాడు.

ఒక శుభముహూర్తం చూసి తన ఏరియాలో ఎన్నికల ప్రచారానికి బయలుదేరాడు. అతడిలా బయలుదేరాడో లేదో ఓ బిక్షగాడు చేతిలో చిప్పతో 'బాబూ ధర్మం' అంటూ ఎదురయ్యాడు. వాడు కనిపించడం అపశకునంగా తోచి జనార్ధనరావు 'నా దగ్గిరేం లేదుపో' అనేసాడు. ఇంతలో వాడికీ ఓటుందని గుర్తొచ్చింది జనార్ధనరావుకు. సరిగ్గా అదే సమయంలో ఆ బిచ్చగాడికి జనార్ధనరావు గొప్ప రాజకీయనాయకుడన్నసంగతి అర్థమయింది. భయంతో వాడు జనార్ధనరావు కాళ్ళమీద పడబోయాడు. అదే సమయానికి పశ్చాత్తప్తుడైన జనార్ధనరావు చప్పన వాడి కాళ్ళు అందుకోడానికి వంగేడు. ఇలా యిద్దరూ ఒకరికాళ్ళు ఒకరు పట్టుకునే ప్రయత్నంలో కొంచెం సేపు కుస్తీ లాంటిది చెలరేగింది. చివరకు బిచ్చగాడు ఓడిపోయాడు. జనార్ధనరావు విజయ గర్వంతో వాడి కాళ్ళు పట్టేసుకున్నాడు.

"మీకేమిటి కావాలి బాబూ" అడిగాడు బిచ్చగాడు.

"ఓటు భిక్ష ప్రసాదించు తండ్రీ"



అన్నాడు జనార్ధనరావు-అప్పుడెప్పుడో తను చూసిన తెలుగు సినిమాలో డైలాగును కించిత్ మార్పుతో వల్లె వేస్తూ.

బిచ్చగాడికి మొదట అతని ధోరణి అర్థం కాలేదు. ఇంతలో ఎలక్షన్ల సంగతి గుర్తొచ్చింది. దాంతో సంగతి అర్థమై "ఓటేస్తే నాకేం చేస్తారు బాబూ" అనడిగాడు.

"నీ జీవితంలో పెద్ద మార్పు వచ్చేలా చేస్తాను" దృఢంగా అభయమిచ్చాడు జనార్ధనరావు.

ఆ మాటతో బిచ్చగాడు కంగారు పడిపోయాడు. బావురుమంటూ జనార్ధనరావుకి చేతులెత్తి దండం పెట్టాడు.

"బాబూ ... కిందటి ఎలక్షన్లలో నా యింటికొచ్చి నన్ను ఓటు వెయ్యమని అడిగావు. గుర్తుందా? అప్పుడూ నేను నాకేం చేస్తావనే అడిగాను-బుద్ధితక్కువై. అందుకు నువ్వు 'ఇలా చాలీ చాలని కొంపల్లో అర్ధాకలితో ఎలా బతుకుతావు? నాకు ఓటువెయ్యి. నీ జీవితంలో గొప్ప మార్పు వచ్చేలా చేస్తాను' అని వాగ్దానం చేసావు. కదూ!" అనడిగేడు.

'తనిచ్చిన వాగ్దానం ఐదేళ్ళ తర్వాత కూడా గుర్తు పెట్టుకున్నాడంటే తన మాటమీద వాడికెంత గురివుందో కదా' అని పొంగిపోయాడు జనార్ధనరావు.

"అవునవును" అన్నాడు సంబరంగా.

"నా జీవితంలో చాలా మార్పు వచ్చింది బాబూ! మొత్తంమీద నీ వాగ్దానం నిలబెట్టుకున్నావు" అంటూ గోచీ సవరించుకున్నాడు బిచ్చగాడు.

జనార్ధనరావు ఉత్సాహంగా "అవును కదా, అంచేత ఈసారి కూడా నీ ఓటు నాకిస్తే నీ జీవితంలో యింకా గొప్ప మార్పులు తెస్తాను" అంటూ ఏదేదో చెప్పబోయాడు.

బిచ్చగాడు అడ్డుతగిలేడు. "మహాప్రభో మన్నించండి. మీరుతెచ్చిన మార్పువల్లే గావంచాలోంచి గోచిలోకొచ్చాను. పూరింట్లోంచి మర్రిచెట్టు కిందకి మారింది మకాం. ఈ విశాలప్రపంచంలో ఈపాటి బతుకు కూడా మిగల్చని మార్పులు నాకొద్దు బాబూ...నన్నిలా బతకనివ్వండి...నాకేమీ చెయ్యనని వాగ్దానం చెయ్యి. అలా చేస్తేనే నీకు ఓటు వేస్తాను" అంటూ జనార్ధనరావు కాళ్ళు పట్టేసాడు.

వాడి మాటలతో జనార్ధనరావుకి జ్ఞానోదయమయింది. సంతోషంగా వాడికి ఆ మాట యిచ్చేసాడు. ఓట్లు ఎలా రాబట్టుకోవాలో అతడికి బాగా అర్థమయి పోయింది.

ఆరోజు సాయంత్రం పెద్ద బహిరంగ సభ ఏర్పాటుచేసేడు. జనార్ధనరావు సభలో "మహాజనులారా! నన్ను గెలిపిస్తే నేను మీకేమీ చెయ్యను. మీ బతుకుల్లో ఏ మార్పుతేను. మిమ్మల్ని అసలు పట్టించుకోను. నన్ను గెలిపిస్తే ఈ నియోజక వర్గానికి గాని, ఈ ప్రజలకిగాని ఏమీ చెయ్యనని దైవసాక్షిగా వాగ్దానం చేస్తున్నాను" అన్నాడు.

సభలో ఆనందంతో చప్పట్లు మారుమోగాయి. జనం హాయిగా నిట్టూర్చారు. ఇన్నాళ్ళకు తమ మానాన తమని బతకనిస్తానన్న నాయకుడు దొరికాడని ఉప్పొంగిపోయారు.

ఆ తర్వాత పోలింగులో జనార్ధనరావు అఖండమయిన మెజారిటీతో గెలుపొందాడు. ప్రత్యర్థులందరికీ డిపాజిట్లు పోయాయి.

—వి.ఎస్.ఎన్. మూర్తి

# షాక్

"శ్వాసాడుతోంది. త్వరగా డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళడం మంచిది" అన్నాడో పెద్దాయన పేవ్‌మెంటుమీద పడిపోయిన అతని ముక్కుదగ్గర చెయ్యి పెట్టి చూస్తూ.

మరొకాయన ఆశ్చర్యపోతూ "ఏమిటి? శ్వాసాడుతోందా! నేనిందాక చూసినప్పుడు అసలు శ్వాస ఉన్నట్టే లేదే" అంటూ పడిపోయిన వ్యక్తి ఛాతీమీద చెవిపెట్టి చూసి కరెంట్ షాక్ తగిలినవాడిలా ఒక్కసారి ఎగిరి గంతేసి "అవునండోయ్! గుండె చిన్నగా కొట్టుకుంటున్నట్టే వుంది. అర్జెంట్‌గా ఆస్పత్రికి చేర్చడం మంచిది" అన్నాడు.

"రిషా పిలుచుకురండి" అన్నారెవరో తను వెళ్ళగూడదన్నట్లుగా.

లాటరీ వైకుంఠానికి అప్పటికే వళ్ళంతా చమటతో తడిసి ముద్దయిపోయింది. వాళ్ళ మాటలు వింటూంటే అప్పారావ్‌ను తనే ఆస్పత్రికి తీసుకెళ్ళక తప్పదనిపించింది.

ముఖాన నీళ్ళుచల్లి పదినిముషాలయిపోయింది కానీ నిలువునా పడిఉన్న అప్పారావ్ కళ్ళు తెరవనేలేదు.

మరొక అయిదు నిముషాలు చూశారు అందరూ ఆశగా. అయినా అప్పారావ్‌కి స్పృహ రాలేదు.

'ఇంక నిదానించి లాభంలేదు. ఏదైనా వూహించగూడనిది జరిగితే మొదటికే మోసం వస్తుంది' అని తనే ఓ రిషానుపిలిచి రిషావాలా సాయంతో అప్పారావ్‌ను రిషాలోకెక్కించి తనూ రిషాలో ఎక్కికూర్చుని "దగ్గర్లో ఉన్న ఏదయినా ఆస్పత్రికి పోనీ" అన్నాడు వైకుంఠం.

రిషా ఐదునిముషాల్లో ఆస్పత్రి ముందాగింది.

రిషావాలా సాయంతో అప్పారావ్‌ను ఆస్పత్రిలోకి చేర్చాడు.

అర్ధనిముషంలో డాక్టరుగారొచ్చి పడిపోయున్న అప్పారావ్ చెయ్యిపట్టిచూస్తూ 'అసలేం జరిగింది?' అన్నట్టుగా వైకుంఠం ముఖంలోకి చూశాడు.

"నేను లాటరీ టిక్కెట్లమ్ముతానండీ! ఇతను ఆమధ్యనెప్పుడో ఒక టిక్కెట్టు కొన్నాడు. దాని డ్రా నిన్ననే జరిగింది. ఇతను ఇపుడు తన టికెట్టు తెచ్చి నాకిచ్చి ప్రయిజేమయినా వచ్చిందేమో చూసి పెట్టమన్నాడు. నేను పేపరు చూసి 'మీకొక ప్రయిజొచ్చిందండీ' అన్నాను. అంతే! అతను నోరు తెరచి ఇలా పడిపోయాడు. అరగంటయినా ఇంతవరకు స్పృహ రాలేదు" క్లుప్తంగా చెప్పాడు వైకుంఠం.

"ఏమిటీ! ఇతనికి లాటరీలో ప్రయిజు వచ్చిందా? ఎంత?" ఆశ్చర్యంగా అడిగాడు డాక్టర్.

"ఐదురూపాయలండీ"

"ఏమిటీ...నా కొచ్చింది ఐదు రూపాయల ప్రయిజేనా?" అంటూ అమాంతం లేచికూర్చున్నాడు అప్పారావ్.

—జె.యస్.పి. సాయిబాబు

---

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.



ఉన్నతమైన
నాణ్యత

ప్రియలోనే
వుంది




ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004.

ఎన్నిక చేసిన దినుసులన్నీ సమపాళ్లలో
మేళవించి అద్భుతమైన రుచులతో
రూపొందించినవే ప్రియ పచ్చళ్ళు.
మీ భోజనానికి సంతృప్తి సరిజోడు-ప్రియ
డే మీ ప్రియను మీ ఇంటికి తీసుకువెళ్ళండి.

**ఎంతో రుచి... ఎంతో రుచి... - ప్రియ**

Telugu Monthly, Hyderabad-500 004.    Regd. No. H/HD




# పార్లే గ్లూకోతో
# ప్రతి అల్లరి పిల్లల అణువణువున
# ఉవ్వెత్తున లేస్తాయి శక్తి తరంగాలు.






పిల్లలు—వారికి శక్తి వస్తుంది ఎక్కడ నుండి? పార్లే గ్లూకో బిస్కట్ల నుండి కాకపోతే, ఇంకెక్కడ నుండి? తెలివైన తల్లులకు తెలుసు, వారి చిన్నారి అల్లరి, పెరిగే పిల్లలకు కావల్సింది పార్లే గ్లూకో యొక్క తియ్యని, కరకరలాడే కమ్మని రుచేనని! ఎప్పుడూ తాజాగా ఉంటాయి, ఎప్పుడూ మంచివి. తరతరాల పిల్లలకోసం పార్లేవారు వాటిని అలా చేస్తున్నారు.




గ్లూకో

రుచికరమైన, శక్తినిచ్చే ఆహారం.

భారతదేశపు అత్యధికంగా
అమ్ముడుపోతున్న బిస్కట్.



వరల్డ్ సెలక్షన్ బహుమతిని గెలుచుకున్నది.

everest/84/PP/39-tl